# శ్రీశివానన్దలహరి

(మూలాంధ్ర టీకా తాత్పర్యానువాద సహితా)

సప్తతితమ జన్మదిన ప్రచురణము

శ్రీమదాదిశంకరాచార్యులవారి కృతికి

ఆంధ్రీకృతి



"వాగర్థావివ సమ్పృక్తౌ వాగర్థప్రతిపత్తయే.
జగతః పితరౌ వన్దే పార్వతీపరమేశ్వరౌ."

టీకాతాత్పర్యాంధ్రపద్య రచయిత


## డాక్టర్ జొన్నలగడ్డ మృత్యుంజయ రావు,
ఎం.ఏ., పి హెచ్.డి.

రాజమహేంద్రవరము – ౫.

# శ్రీశివానన్దలహరీ

(మూలాంధ్రటీకా తాత్పర్యానువాద సహితా)

సప్తతితమ జన్మదిన ప్రచురణము



శ్రీమదాదిశంకరాచార్యులవారి కృతికి
ఆంధ్రీకృతి



This book is published with the financial assistance of Tirumala Tirupati Devasthanams under their scheme "Aid to Publish Religious Books".

టీకా తాత్పర్యాంధ్రపద్య రచయిత

డాక్టర్ జొన్నలగడ్డ మృత్యుంజయ రావు,
ఎం.ఏ., పి హెచ్.డి.

రాజమహేంద్రవరము - ౫.

శ్రీమదాదిశఙ్కరాచార్య కృత

శ్రీ శివానన్ద లహరీ

అకారాది శ్లోక సూచి


| | శ్లోక | పుట | | శ్లోక | పుట |
|---|---|---|---|---|---|
| అఙ్కోలం | 61 | 65 | కలాభ్యాం | 1 | 1 |
| అతి మృదులౌ | 95 | 98 | కల్యాణినం | 75 | 79 |
| అమిత ముదమృతం | 78 | 72 | కారుణ్యామృత | 52 | 55 |
| అరహసి | 70 | 74 | కిం బ్రూమః | 34 | 34 |
| అశనం | 87 | 91 | క్రీడార్థం | 63 | 70 |
| అసారే | 13 | 13 | గభీరే | 9 | 9 |
| ఆకాశేన | 53 | 56 | గలన్తీ | 2 | 2 |
| ఆకీర్ణే | 46 | 47 | గాంభీర్యం | 42 | 43 |
| ఆద్యాయామిత | 55 | 59 | గుహాయాం | 12 | 12 |
| ఆద్యా విద్యా | 91 | 95 | ఘటో వా | 6 | 6 |
| ఆనన్దామృత | 49 | 51 | ఛన్దశ్శాఖి | 45 | 46 |
| ఆనన్దాశ్రుభి | 62 | 66 | జడతా | 69 | 73 |
| ఆమ్నాయామ్బుధి | 37 | 37 | జనన మృతి | 83 | 87 |
| ఆరూఢ భక్తి | 71 | 75 | జలధి | 85 | 89 |
| ఆశాపాశ | 74 | 78 | జ్వాలోగ్ర స్సకలా | 32 | 32 |
| ఇదం తే | 99 | 102 | త్రయీ వేద్యం | 3 | 3 |
| ఉపేక్షా | 15 | 15 | త్వత్పాదామ్బుజ | 29 | 29 |
| ఏకో వారిజ | 58 | 62 | త్వమేకో | 18 | 18 |
| ఏష్య త్యేష | 80 | 84 | దురాశా | 19 | 19 |
| కఞ్చిత్కాల ముమా | 81 | 85 | దూరీకృతాని | 92 | 96 |
| కదా వా కైలాసే | 24 | 24 | ధర్మో మే | 39 | 40 |
| కదా వా త్వాం | 26 | 26 | ధీయన్త్రేణ | 40 | 41 |
| కర లగ్న మృగః | 44 | 45 | ధృతి స్తమ్భాధారాం | 21 | 21 |
| కరస్థే | 27 | 27 | ధైర్యాఙ్కుశేన | 96 | 99 |
| కరోమి | 23 | 23 | ధ్యానాఞ్జనేన | 72 | 76 |

| | శ్లోక | పుట |
|---|---|---|
| నతిభిః | 89 | 93 |
| నరత్వం దేవత్వం | 10 | 10 |
| నాలం వా పరమోప | 31 | 31 |
| నాలం వా సకృదేవ | 33 | 33 |
| నిత్యం యోగి మనః | 79 | 83 |
| నిత్యం స్వోదర | 57 | 61 |
| నిత్యాయ | 56 | 60 |
| నిత్యానన్ద | 48 | 50 |
| పాపోత్పాత | 41 | 42 |
| పూజాద్రవ్య | 86 | 90 |
| ప్రచర త్యభితః | 97 | 100 |
| ప్రభుస్త్వం | 14 | 14 |
| ప్రలోభాద్యైః | 22 | 22 |
| ప్రాక్పుణ్యాచల | 38 | 39 |
| ఫలాద్వా | 17 | 17 |
| బహువిధ | 67 | 71 |
| బాణత్వం | 82 | 86 |
| బుద్ధిస్థిరా | 77 | 81 |
| భక్తిర్మహేశ | 76 | 80 |
| భక్తో భక్తి | 36 | 36 |
| భూదారతా | 73 | 77 |
| భృఙ్గీచ్ఛా | 51 | 53 |
| మనస్తే | 7 | 7 |
| మా గచ్ఛ | 43 | 44 |
| మార్గావర్తిత | 63 | 67 |
| యదా కృతామ్భోనిధి | 88 | 92 |
| యథా బుద్ధిః | 8 | 8 |
| యోగక్షేమ | 35 | 35 |
| రోధస్తోయ | 60 | 64 |
| వక్షస్తాడన మన్తకస్య | 64 | 68 |
| వక్షస్తాడన శఙ్కయా | 65 | 69 |
| వచసా చరితం | 90 | 94 |
| వటుర్వా | 11 | 11 |
| వస్త్రోద్ధూత | 30 | 30 |
| విరిఞ్చిః | 16 | 16 |
| శమ్భుధ్యాన | 47 | 49 |
| శివ తవ | 84 | 88 |
| సదా మోహాటవ్యాం | 20 | 20 |
| సదుపచార | 78 | 82 |
| సన్ధ్యా ఘర్మ | 54 | 58 |
| సన్ధ్యారమ్భ | 50 | 52 |
| సర్వాలఙ్కార | 98 | 101 |
| సహస్రం | 4 | 4 |
| సా రసనా | 94 | 97 |
| సారూప్యం | 28 | 28 |
| సోమకళాధర | 93 | 97 |
| స్తవైర్బ్రహ్మాదీనాం | 25 | 25 |
| స్తోత్రేణాలం | 100 | 103 |
| స్మృతౌ శాస్త్రే | 5 | 5 |
| హంసః పద్మవనం | 59 | 63 |

# ఆ స్వా దః

ఆచార్య శ్రీ దోర్బల ప్రభాకరశర్మా

తత్రభవతా శ్రీమతా జొన్నలగడ్డ మృత్యుఞ్జయరావు మహాభాగేన శ్రీమదాది శఙ్కరాచార్య భగవత్పూజ్యపాదానుగృహీతాయాః శ్రీ శివానన్దలహర్యాః ఆన్ధ్ర భాషానువచనం కృత్వా ఆన్ధ్రపాఠకానాం ఆన్ధ్రకావ్యబన్ధానురాగిణాం చ సుమహానుప కారః సమాచరితః

శ్రీ మృత్యుఞ్జయరావు మహాభాగః అధీత నైకాన్ధ్ర సంస్కృత కావ్య ప్రబన్ధః, సుపరిశీలిత వ్యాకరణాది శాస్త్ర నిచయః, సమవబుద్ధ శ్రుత్యన్తసార విచారణశీలః విశేషతః శ్రీ శఙ్కరభగవత్పాదానాం భక్తిమయం వాఙ్మయం, కాళిదాసస్య అనవద్యం హృద్యం కావ్యసాహిత్యం సమ్యగాకలితవాన్, సంస్కృత సారస్వతస్యాదిగురోః భగవతః బాదరాయణస్య శ్రీమన్మహాభారతం తదాన్ధ్రానువాదం ఆన్ధ్రాదికవేః వాగనుశాసనస్య నన్నయాచార్యస్య శ్రీమదాన్ధ్రమహాభారతఞ్చ సమ్యగను శీల్య 'వ్యాస భారతము – నన్నయ పరిష్కారము' ఇతి శోధనబన్ధం ప్రకాశితవాన్. కవికులగురోః కుమారసమ్భవస్య ఆన్ధ్రపద్యకావ్యమయం తదీయం ప్రబన్ధం శ్రుత్వా పఠిత్వా వా సహృదయా స్తదీయం శేముషీవిశేషం సమ్యగభిజానన్త్యేవ. శివమహిమ్నః స్తోత్ర మిత్యాదికమపి భక్తిమయప్రబన్ధజాతం ఏతేన మహాభాగేన సుష్ఠ్వనూదితమ్.

లోకే మహర్షికల్పైః కవిభిః విరచితానాం సంస్కృతభాషామయానాం గ్రన్థానా మాన్ధ్రభాషాయాం కావ్యరూపేణానువచనం ప్రాయః క్లేశభూయిష్ఠం భవతి తథాహి సంస్కృతే యతిః పదవిరతి రేవ. త్రిలిఙ్గభాషాయాన్తు యతిః సమం సవర్ణం వా అక్షరమ్. సంస్కృతే అనుప్రాసాదయః అలఙ్కారాః. ఆన్ధ్రభాషాయాన్తు ప్రతి పాదం ద్వితీయాక్షరం సజాతీయం భవేదితి నియతః ప్రాసః సంస్కృతే విపులభావః స్వల్పశబ్దేన వివరీతుం సుశకః కదాచి దాన్ధ్రభాషాయా మేతత్ న సుశకమ్.

శ్రీ మృత్యుఞ్జయరాయ మహాభాగః సమగ్రం భావం లేశ మప్యపరిహార్య అనూదితు మిచ్ఛతిస్మ. తే ఏవ శబ్దాః తే ఏవ అర్థాః తే ఏవ భావాః యథాశక్తి యథామతి అనువాదాన్ధ్రపద్యేషు సంయోజితాః శ్రీ రాయమహాశయేన, తదర్థం అహర్నిశం ప్రాయః షణ్మాసాత్మకం కాలం తేన తప ఇవ కృతమ్.

నిరన్తర మీశ్వరచిన్తనేన, విదుషాం గురూణాం సమాహిత సంస్కారేణ శ్రీమచ్ఛఙ్కర భగవత్పాదానా మనుగ్రహేణ చ అస్మిన్ సరసే అకృత్రిమే మూలా విరోధిని, యథామూలే అనువాదే సాఫల్య మవాప్తం కవివరేణ శ్రీమృత్యుఞ్జయరాయేణ.

యద్యపి శివానన్దలహర్యాః ఆన్ధ్రానువాదమాత్రమయాః శబ్దానువాదమాత్రమయాః అర్థానువాదమాత్రమయాః స్వేచ్ఛానువాదమాత్రమయాః సన్తి బహవః అనువాదగ్రన్థాః, అయన్తు న కేవలం భావశబ్దార్థానువాదరూపః సరసతయా సరలతయా అవికృతతయా సమగ్రతయా భక్తితత్పరతయా చ విశిష్యతే శ్రీరాయమహాశయానువాదః ఇత్యేషా స్వభావోక్తి ర్నాతిశయోక్తిః. 'ఇహాన్వయముఖేనైవ సర్వం వ్యాఖ్యాయతే మయా, నామూలం లిఖ్యతే కిఞ్చిత్ నా నపేక్షిత ముచ్యతే' ఇతి మల్లినాథేనేవానేన కవినా అనుకృతా ప్రతిజ్ఞా పాలితా చ. శ్రీ మృత్యుఞ్జయరాయః యథా రచనాయాం సునిశితప్రజ్ఞః తథా సహృదయతాయాం అత్యన్తం సుకుమారప్రవృత్తిః, విశేషేణ సంస్కృతభాషాయాం అత్యధిక ప్రీతిమాన్, భృశ మధిగతాసాధారణ వైదుష్యహల్యపి సాధారణ సంస్కృత సమ్భాషణ శిక్షణ కుతూహలీ త్యాశ్చర్యమ్. 'జ్ఞానే మౌనం క్షమా శక్తౌ త్యాగే శ్లాఘా విపర్యయః' ఇతి కాలిదాసీయం వచనం కవివరేఽస్మిన్ సమ్యగన్వేతి.

అనువాదసాహాయ్యాయ కవినానేన పూర్వేషాం విశిష్టా సప్రమాణా వ్యాఖ్యా సమావృతా. దిఙ్మాత్ర ముదాహ్రియతే. తత్ర తావత్ ప్రథమపద్యస్య 'కలాభ్యాం చూడాలఙ్కృత శశి కలాభ్యా' మిత్యస్య 'హారిశిఖా పరిష్కృత శశాంక కలల్ కలలున్' ఇత్యనువాదః కవే రస్య పరిష్కృతిప్రియత్వ మావిష్కరోతి. మహాభారతస్య నన్నయ పరిష్కార ఇవ ఆచార్యాణాం శివానన్దలహర్యాః అనువాదేప్యేష పరిష్కారాయతే ఇతి సూచితమ్.

'గలన్తీ శమ్భో త్వచ్చరితసరితః' (2) ఇత్యస్య-
'స్వామి భవదీయచరితస్రవంతి నుండి
పర్వువెట్టుచు, నడ(గించి పాపరజము,
బుద్ధికుల్యల(బడి సాగి పోయిపోయి,
సంసృతిభ్రమ పరితాపశాంతి( గూర్చి
యస్మదీయ చేతోహ్రద మందు( జేరు
శ్రీ శివానన్దలహరి యుత్కృష్ట మగుత.

ఇత్యనువాద స్పష్టగీతి షట్పదీబాలా పరమేశ్వర పాదకమలయోః శ్రీ శివానన్దలహర్యాఞ్చ ఆత్మానం సమర్పయతీవాస్తి.

సంస్కృతే ఆన్ధ్రభాషాయాఞ్చ సమానశబ్దార్థాలఙ్కార స్యైద ముదాహరణం-
'త్రయీవేద్యం హృద్య' (3) మిత్యస్యానువాదపద్యమ్-

'హృద్యుఁ బశుపతిఁ ద్రిణయనుఁ ద్రిపురహరునిఁ
జలధరగహరు మృగధరు జటిలు దేవు
వేదవేద్యు మహాదేవు నాదిదేవు
సాంబు శివునిఁ జిదాలంబు నతివిడంబు
మద్గత లసత్కృపాభావు మదిని గొల్తు' ఇతి.

అత్ర 'మయి సదయభావ' మత్యస్య ఆన్ధ్రభాషాయాం లఘుపద్యే విశేషణత్వేన అనువచనం కష్టతరమ్– 'మత్సదయభావు శివు' ఇత్యస్య 'మయి సదయభావః శివః' ఇతి మూలార్థస్ఫూర్తి ర్న భవతి. కవి రతిచిరం సమాలోచ్య 'మద్గతలసత్కృపాభావు' ఇతి నివేశ్య మద్గతః లసన్ కృపాభావః యస్య|ఇత్యర్థం మనసి నిధాయ యథామూలతాం సమపాదయత్.

ఏవం క్రమేణ ప్రతిశ్లోకం కశ్చన విశేషః సమ్పాదితః, గ్రన్థవిస్తరభయాత్తత్ర తత్రైవ విశేషాః నివేద్యన్తే

'సహస్రం వర్తన్తే' (4) ఇత్యస్య 'కలరీ లోకమునందు' ఇతి ప్రారమ్భః అతి సహజ గమ్భీరః మూలానుగుణశ్చ వర్తతే.

'స్మృతౌ శాస్త్రే వైద్యే' (5) ఇతి శ్లోకోక్తాసు కలాసు 'స్మృతి శాస్త్రంబున వైద్యమందు' ఇతి పద్యే ఏకాపి నత్యక్తా.

'వృథా కణ్ఠక్షోభం వహసి' (6) ఇత్యస్య 'ఏల ఏతగా నార్చెంతు నీ గొంతు' ఇత్యనువాదః ఆన్ధ్రజాతిసహజతయా రాజతే.

'మన స్తే పాదాబ్జే' (7) ఇతి శ్లోకే తాని తాని వచనాని యథాతథ మనువాదే ఉపనిబద్ధాని 'నయనయుగల' మిత్యస్య 'కన్గవ' ఇత్యనువాదః యథామూలతాం స్పృష్టయతి.

'యథా బుద్ధిః శుక్తౌ (8)' ఇత్యస్య లఘుగీతిః సమ్పూర్ణభావపూర్ణా కథమాగతా కవేర్ముఖా దిత్యాశ్చర్యమేవ

ఆ వె. పిండినీరుఁ బాలు, నెండమావుల నీరు,
శుక్తి వెండి, గాజు మణిగ బుద్ధి
వెంచునట్లు మందుఁ డీశుని నినుఁ గాంచ
కితరు దేవుఁ డంచు నెంచు నభవ.

'గభీరే కాసారే......' (9) ఇత్యస్య—

చ. జడమతియై జనుండు సుమసంగ్రహణార్థ మగాధనీరమౌ
మడువును జొచ్చు, ఘోరవనమధ్యమునం బెనుగొండపైఁ గడున్
బడలి చరించుఁ జిత్త మను పంకజ మొక్కఁడు నీ కొసంగి యి
య్యెడ సుఖియై మనస్ దెలియఁ డెంతటి వెఱ్ఱిఁడియో యుమాపతీ!

అత్ర 'భ్రమతి' ఇత్యస్య 'బడలి చరించు' ఇత్యనువాదః మూలభావగ్రాహీ.

'నరత్వ దేవత్వాదీన్ (10) దీర్ఘ చమ్పకమాలాయాం 'మశకతయున్ నరత్వము' ఇతి గ్రథిత్వైవ, 'వటు ర్గేహ్యాదీన్'- (11)

క. వటుఁడో గేస్తో యతియో
జటియో యెవఁడైన నగుత జనుఁ డెద నీదేన్
నిటలాక్ష! తదీయుఁడవును
బటిమన్ దద్భవభరమ్ము వహియించెదవున్.

ఇతి లఘుతర కన్దార్యాయాం సంగ్రథ్య కవిః స్వీయాం సంకోచవ్యాకోచకరణ పటీయసీం శేముషీం వ్యశదయత్.

'అసారే సంసారే' (13) ఇత్యస్య 'ఫల్గువునౌ భవమందు' ఇతి సమీచీనోఽనువాదః.

'శిర స్తద్వైధాత్రం న నఖలు సుకృత్తం' (15) ఇత్యత్ర న నఖలు ఇత్యస్య వ్యాఖ్యాన సాహాయ్యేన 'అనఖలున్' ఇత్యనువాదః కవేః సమ్యక్పరిశీలకతాం వ్యఞ్జయతి.

'దురాశా భూయిష్ఠే దురధిపగృహద్వార ఘటకే' - (19) ఇత్యస్య సర్వ విశేషణాని సంసారస్య అనువాదేఽపి సుఘటితాని.

మ. 'దురితావాసము, దుఃఖసంజనకమున్, దుర్లోభభూయిష్ఠమున్,
దురినప్రాపకమున్, దురంతమును నౌ దుర్వార సంసార మం
దరుగంజేయ వదేమి నా శ్రమము నాహా యేరి మేల్గోరియోః
హర! యీదృక్కృపయున్న నీకుఁ,బరమాహ్లాదం బగున్ మాకునున్.

అస్మిన్ అనువాదే దురధిప శబ్దస్య దురినేతి ప్రయోగః ప్రాసస్థాన సంఘటనంచ కవిసామర్థ్యసమభిద్యోతక మస్తి.

'సదా మోహాటవ్యాం' (20) ఇతి శ్లోకే 'మే హృదయకపిం' ఇత్యస్య 'నా యెద కోఁతి' ఇత్యనూద్య పద్యారమ్భే నివేశనం సర్వత్ర పద్యే మథురాన్త్యపదప్రవేశనం చ కవేః స్వతన్త్రతాం గమయతి.

'ధృతి స్తమ్భాధారాం' (21) ఇత్యస్య అనువాద సప్తపదీ పరమేశ్వరస్య శక్త్యాసహ చేతఃపటకుటీప్రవేశకౌతుక సప్తపదీం సూచయతి. 'పటకుటి మాతఁ గూడి యధివసింపఁగదయ్య శివా! గణాలిసేవితుఁడ విభూ!' ఇతి తత్ర తయోః చమ్పకమాలా ఖణ్డార్ధ ముద్దిష్ట మి వా ప్యస్తి.

'కదా వా కైలాసే' (24) ఇతి శ్లోకస్య అనువాదే స్వతన్త్రకవితాస్ఫూర్తి ర్భవతి యథా బావధార్యతామ్.

ఉ. ఇమ్మగు వెండికొండపయి నింపులు గుల్కు సువర్ణ రత్నసౌ
ధమ్మున నుత్తమాంగఘటితమ్మగు నంజలితో మహేశ్వరా
గ్రమ్మున నిల్చి నేను గణరాజిని గూడి 'మహేశ! పాహి' యం
చు మ్మదమారఁగాఁ బలుకుచున్ గమలాసనకల్పముల్ నిమే
షమ్ముగ నెంచుచుం గడపు సౌఖ్యముఁ గాంచుట యెన్నఁడో కదా! -ఇతి.

అత్ర పఞ్చసు పాదేషు పఞ్చముఖ మహేశదర్శన మభికాఙ్క్ష్యతే ఇవ.
'కరస్థే హేమాద్రౌ' (27) ఇత్యస్యానువాదః సమ్యగ్విభావనీయ ఏవ.

చ. కనకధరాధిపతి కైవసమై తగ, నంతికస్థుఁడై
ధనపతి యుండ, నాకతరు దైవతధేను సుపర్వరత్నముల్
తనరఁగ నింటఁ, జంద్రుఁడు తలన్ వెలయన్, బదముల్ శుభాలికిన్
గనులుగ నింక నేమి యొసఁగంగల నీకుఁ మనంబె యిచ్చెదన్.

అస్మిన్ పద్యే అననువాదభావః స్ఫురతి. 'కనకధరాధరాధిపతి' పదం విశేషే ణాకర్షతి సహృదయానాం హృదయమ్.

'సారూప్యం తవ పూజనే' (28) ఇతి శ్లోకే సారూప్య సామీప్య సాలోక్య శబ్దాః మూలే పాదాశమ్భే వినివిష్టాః అనువాదే పాదాన్తే నివిష్టాః సన్తః తే నిరన్వయ క్లేశం విశేషేణ ముక్తి మనుభావయ న్తీవ.

'లోకగురో మదీయ మనసః సౌఖ్యోపదేశం కురు' (29) ఇతి వాక్యస్య ..ా కిమ్మ జగద్గురూ! మదికి స్వద్బ్రహ్మోపదేశందిరన్' ఇత్యనుసరణం విశేషేణ బ్రహ్మోపదేశస్య ఇన్దిరాత్వారోపణం పరిణామాలఙ్కారశ్చ సౌరస్వతానురాగిణా మాహ్లాదం జనయతి.

'జ్వాలోగ్ర'(32) ఇత్యస్యార్ధం మూలవత్తై, రర్ధం స్వప్రాన్తపదైః పూరితం.

శా. 'జ్వాలోగ్ర మ్మఖిలామరాతిభయకృద్బాధాకరంబైన యా
క్ష్వేళం బెట్టులు చూచి తెట్లు కరనిక్షిప్తంబుఁ గావించితో
కేలన్ నేరెడుపండొ, జిహ్వ నెటులం గీల్కొల్పితో మాత్రయో
నీలంబో యటు కంఠమం దునిచితో నిక్కంబు వాకో ప్రభూ!

ఇత్యేత త్పద్యం, సంస్కృతాన్ధ్ర శబ్దమయస్య భగవతః స్వరూపం క్రియా విశేషేణ సంస్కృతాన్ధ్రశబ్దశోభయాచ విభాజయతీవ.

'ఈ నీ సాహస మేమియందు', 'గరకంఠా! కరుణాకరత్వమును' ఇత్యేత త్పద్యద్వయ మపి పఞ్చభిః పాదైః స్వతన్త్రభావై రివ పూరితం జాగర్తి.

'ఆమ్నాయామ్బుధిం' (37), 'ప్రాకృ్ప జ్యోచల (38)' 'ధీయన్త్రేణ' (40), 'గామ్భీర్యం పరిఖాపదం' (42), 'ఛన్దశ్శాఖి' (45), 'ఆకీర్ణే' (46), 'శమ్భుధ్యాన' (47), 'నిత్యానన్ద' (48), 'ఆనన్దామృత పూరితా' (49), ఇత్యాది శ్లోకేషు రూపకాలఙ్కారాణా మనువాదాయ కవినా మహాన్ శ్రమః స్వీకృతః.

'పాపోత్పాత విమోచనాయ' (41) ఇతిశ్లోకే స్తోత్ర ధ్యానాదిక్రమాణాం జిహ్వా చిత్తాదీనాం క్రమైః కృతః క్రమాలఙ్కారః అనువాదేఽపి మనోహరః.

శా. ఏనోరిష్టవిముక్తియుప్ విభవ మెంతేఁ గాంచ మృత్యుంజయా!
ధ్యాన స్తోత్ర నతి ప్రదక్షిణ సపర్యాకర్ణనాలోకముల్
పూనన్ జిత్తము జిహ్వయున్ దల పదమ్ముల్ కేలు వీనుల్ కనుల్
దీనత్వంబున నన్ను వేఁడె; నిను నర్థింతున్ నిరూపించి య
వ్వానిన్ మాటికిఁ బంపుమా! ననుఁ బొనర్పంబోకుమా మూకుఁగాన్,

సంస్కృతే పఞ్చముఖ శబ్దః సింహపర్యాయే శివపర్యాయేఽపి పుల్లిఙ్గ ఏవ. తెలుఁగు భాషాయాన్తు సింహపర్యాయే అమహద్వాచకః, శివపర్యాయే మహద్వాచకః. తత్ర మూర్తిశబ్దయోజనేన ద్వయోః సమానవిశేషణైః అన్వయం కృతవాన్ కవిః.

ఆ వె. హస్తలగ్న మృగము, హతహస్తిరాజమ్ము.
వ్యాఘ్రఖండనమ్ము, నస్తజంతు,
వశ్చవపువు, గిరిశ మగు పంచముఖమూర్తి
హృద్గుహన్ వసింప నేడ భయము? (44)

ఏవం 'సేవే శ్రీగిరి మల్లికార్జున మహాలిఙ్గం శివాలిఙ్గితమ్' (50) ఇత్యత్ర సంస్కృతే పున్నపుంసకయోః ద్వితీయాయాం విభక్తౌ సమానతాం—

శా. సాయంకాలవిజృంభమున్ శ్రుతిశిరస్స్థానాంతరస్థంబుఁ బ్రే
మాయత్తభ్రమరాభిరామ మసకృద్వ్యాసక్త సద్వాసనా
మేయంబున్ సుమనః ప్రపూజ్యము గుణోత్కర్షంబు భోగీంద్రభూ
షాయోగ్యంబును గొల్తు నెల్లపుడు నిష్ఠన్ స్వాంతమందున్ జగ
చ్ఛ్రేయ శ్రీగిరిమల్లికార్జునమహాలింగం బుమాశ్లిష్టమున్.

ఇత్యస్మిన్ పద్యే సమ్యక్సమన్వితవాన్ కవిః

'ఏకో వారిజబాన్ధవః' (58) ఇత్యస్య 'నీరేజాప్తుఁ డొకండ' ఇతి పద్య వివరణం అత్యన్త ముత్తమ మాభాతి.

'హంసః పద్మవనం' (59) ఇత్యస్య 'కమలవనంబు నందయును గారు మొయిళ్ళను'-ఇత్యాద్యనువాదః అత్యన్త సరలతాయాః ఉదాహృతిః.

'ధుని వారాంనిధినట్లు' ఇ'త్యజ్ఞో_లం నిజబీజసన్తతి' (61) శ్లోకానువాదః 'అనన్నాశ్రుల నింపు' ఇతి 'అనన్నాశ్రుభి రాతనోతి' (62) శ్లోకానువాదః, 'మార్గావర్తిత పాదు' (68) కేతి శ్లోకానువాదభూతః' 'అఱిగిన ప్రాఁతచెప్పు' ఇతి కవే రసమాన సామర్థ్యం సూచయన్తి,

'జడతా పశుతా' (69) ఇత్యాదేః సరలశ్లోకస్య-

ఆ.వె. లేదు నాకు జడత, లేదు పశుత్వంబు.
లేదు కుటిలగతియు, లేదు మచ్చ
యవియ యున్న నాకు నాభరణంబనై
మసలనొక్క రాజమౌళి! నీకు?-ఇత్యేతత్ సరలతరానువాదః,

'ఆశాపాశక్లే' (74) శేత్యస్య తై రేవ శబ్దైః 'ఆశాపాశ క్లేశ దు, రాశయ
దుర్గంధ దళనమౌ గంధముచే' ఇత్యారమ్భః అత్యన్తం మనోహరః.

'జలధి మథన దక్షో' (85) ఇత్యాదేః మూలస్య 'జలధిన్ ద్రచ్చఁగలేదు' ఇత్యాద్యనువాదః అతీవ సరసః.

'అశనం గరళం' (87) ఇత్యాది లఘుపద్యానాం 'విన మశనమ్ము నీకు'-ఇత్యాది దీర్ఘపద్యానువాదః అతీవాత్ర రోచకః.

'సా రసనా తే నయనే'-(94) ఇతిశ్లోకే క్రమాలఙ్కారః నిర్మాణ సౌక ర్యాయ అవగమన సౌకర్యాయ చ 'ఏయది భర్గు నెప్డు వచియించునో యద్దియె జిహ్వయో' ఇత్యాద్యనువాదః నిరన్వయ శ్లోకతాయై వికదీకృతః

'స్తోత్రేణాల' (100) మిత్యన్తిమం పద్య మపి - 'స్తుతికిం జాల...' ఇతి మధుర పద్యేన అనూదితమ్.

గ్రన్థవిస్తర భయాత్ తే తే శ్లోకా ఏవాత్రోదాహృతాః.

శ్రీ మృత్యుఞ్జయరాయ మహాశయః ఏవం శ్రీ శివానన్దలహర్యాం నిమజ్య ఆత్మానం కృతకృత్యం సమ్పాద్య పాఠకాన్ కృతార్థీకృతవా నితి వచనే నాతిశయోక్తిః.

ఇతి నివేదయితా

కొవ్వూరు గోష్పదక్షేత్రమ్ దోర్బల ప్రభాకర శర్మా

# మున్నుడి

ఏదే నొక మంచి సంస్కృతశ్లోకము కంటఁబడినచో దానిని యథాశక్తి తెనిఁగింప మనసుపడు లక్షణము నాకు మొదటినుండియుఁ గలదు. మహాకవి కాళిదాసు కుమారసంభవమును గాని, పుష్పదంతుని శివమహిమ్నః స్తోత్రముమగాని యాంధ్రీకరించుట కదియే కారణము.

శ్రీమదాదిశంకర భగవత్పాద విరచిత శ్రీ శివానందలహరి భక్తి కవితారసములు వెల్లివిరియునట్టిది అది పవిత్ర గంగాలహరియే యనుటలో సందియము లేదు. అందలి కవితామృతమునకు మున్పటపడి దాని నాంధ్రీకరింపవలయునని యెప్పుడో యెంచితిని. సంస్కృత వ్యాఖ్యాసహితమైన వావిళ్ళవారి శివానందలహరీ ప్రతిని సంపాదించి యాంధ్రీకరణమునకుఁ దొరఁకొన నందలి మొదటి రెండుమూఁడు శ్లోకములను జూచి యెంత సుందరముగా నేనెక్కడ నాంధ్రీకరింపఁగలనని భయపడి తత్ప్రయత్నమును విరమించెడివాఁడను. ఇట్లెన్ని యోమాఱులు యత్నించి యారంభింపలేక యూరకొనుట జరిగినది.

నేను నా యాంధ్రీకరణోద్యమముమాటయే మఱచితిని.

ఏండ్లు గడచినవి. నాకడనున్న వావిళ్ళవారి సంస్కృతవ్యాఖ్యా సహితప్రతి మూషదకష్టమై చదువుటకుఁగూడ శక్యముగానినయ్యెను.

ఇట్లుండఁ గ్రిందటి సంవత్సరము శంకరజయంతినాఁడు స్థానిక భారతీయ సాహిత్య పరిషత్తువారు నన్ను శంకరులఁగూర్చి ప్రసంగింపఁగోరిరి. నేను వారికోరి కను గాదనలేక 'శంకరుల కవిత్వ వైభవమును గూర్చి నాలుగు ముక్కలు చెప్పుదు నంటిని'. అంటినేకాని యం దెట్లు కృతార్థుఁడ నగుటయాయని సంకోచించి శంకరులవివిధ స్తోత్రములలోను,శివానందలహరీ సౌందర్యలహరులలోనుగల కవితామయ శ్లోకములను గొన్నిటిని యథాశక్తి వ్యాఖ్యానించుచుఁ బ్రసంగించితిని. ఆ సభలో శివానందలహరి యందలి రెండుశ్లోకముల నాంధ్రీకరించి సభ్యులకు వినిపించితిని వానిని విసిన సభ్యులు నా తెనుఁగుసేఁతను బ్రశంసించి 'మొత్తము గ్రంథమును మీ రాంధ్రీక రింపుఁడు. మా భారతీయ సాహిత్య పరిషత్తు దాని నావిష్కరింపఁగల' దని ప్రోత్స హించిరి. డాక్టర్ ప్రభల సుబ్రహ్మణ్య శర్మగారు తమకడ వావిళ్ళవారి సంస్కృత వ్యాఖ్యాసహిత శివానందలహరీ ప్రతి యున్న దని దయతో నాకుదాని నొసఁగిరి ఆంధ్రీ కరణమునకుఁ బూనిన యా ముహూర్తబల మెట్టిదోకాని నే ననుకొనినదానికంటెఁ జాలఁ జులుకుగాఁ దెనుఁగుసేఁత సాగినది. నేను శ్లోకములను యథాక్రమముగాఁ జేయలేదు. ముందేది సుకరమని తోఁచిన దానిని జేయుచువచ్చితిని. సేను గష్టమని వెనుదీసిన మొదటి రెండు మూఁడు శ్లోకములను జిట్టచివర నాంధ్రీకరించితిని. ఆంధ్రీ కరణము నాకు మిక్కిలి తృప్తికరముగా సాగ నుత్సాహ మధికమై దాని నతిత్వరలో ముగింపఁగలిగితిని నాకే కాదు విసిన పండితులు సైతము మెచ్చుకొనుటచే నా యానంద మతిశయించినది

ఇందనుక నెందఱో చేసిన యీ పనినే మరల నీవు చేయుటెందులకని యెవ్వ రైన నడుగవచ్చును. కుమారసంభవాంధ్రీకరణమున నేను జెప్పిన—

చ. అరయఁగ నీకృతిం బలువు రాంధ్రమునందు రచించియుండఁగా
మరల నిదేల యన్న నిజమంజుల కావ్యసుమంబులం గవీ
శ్వరులు తెలుంగుఁబల్కుఁజెలువన్ గయిసేయఁగ నామెక్రొవ్వెదన్
మరల మఱొక్కపూవుఁ దుఱుమన్ సొగసెక్కునుగాక దోసమే?

— యను సమాధానమే యట్టివారి కిప్పుడును నేనిచ్చు సమాధానము.

అనువాదమువలన నేమిలాభము? ఎంతబాగుగాఁ జేసినను ననువాదము గిట్టుబడి వ్యాపారముగాదు సరిగా రాకపోవుపక్షమునఁ జీవాట్లు లభించును.

తే. అరయఁ దూ-వాలు దప్పక యనుసరింప
నితని గొప్పేమి యందురు; స్వేచ్ఛఁబూనఁ
గాళిదాస మహాకవి కవిత కొంత
వీని పైత్యమ్ము కొంతని వెక్కిరింత్రు.

నిజమే కాని యన్యభాషయందలి యుత్తమకవితను స్వీయభాషలోనికిఁ బరివర్తింపఁగలిగితిమను తృప్తియొకటి లభించును. అదియునుగాక యన్యభాషలోని మహార్థము దెలుఁగువారి కందీఁగలిగితిమను సంతోషము గలుగును. ఆంధ్రభాషలో నన్నయాదు లనువాదముల నేదృష్టితోఁ జేసిరో నాకును నదియే దృష్టి. నన్నయాదులు మహాప్రతిభాసంపన్నులు కావున వారి యనువాదములు స్వతంత్ర కావ్యముల వలె భాసిలుటయేకాక, యద్భుతకవితావిలసితములై యలరారెను. నా కట్టి ప్రతిభయులేదు. ఇట్టి యనువాదమున స్వీయకవితను జొప్పింపవలసిన యక్కఱయును లేదు. అట్లు చొప్పించుట మూలకవితాసౌందర్యభంజకమును గావచ్చును.

శంకర భగవత్పాదుల శివానందలహరి నాంధ్రీకరించుట యంత సుకరముగాదు. వారే చెప్పినట్లు వారి కవితాకన్యక సర్వాలంకారయుక్త. సరళపదయుత సాధువృత్త. సువర్ణ, సత్సంస్తూయమాన. సరసగుణయుత. లక్షిత. లక్షణాఢ్య, ఉద్యద్భూషావిశేష. ఉపగతవినయ. ద్యోతమానార్థరేఖ. కల్యాణి ఈ లక్షణములలో నేదిలోపించినను నా కన్యక కళదప్పును అందుచేఁ బరివర్తనమునఁ జాల జాగరూకత వహింపవలయును కొన్ని శ్లోకముల నొకానొకపదము సాభిప్రాయమై యపరిత్యాజ్యమై పదాంతరాసహిష్ణువై యుండును. ఉదాహరణమునకు 'జగదధికో హృది రాజశేఖరోఽస్తి' (70) యనుచో రాజన్‌శబ్ద మపరిహార్యము అందుచే 'జగదధికుఁడు ....రాజమౌళి కలఁడు మద్హృది' అని యాంధ్రీకరింపఁబడినది అట్లే 'సదయ పశుపతే సుపుణ్యపాకాం మమ పరిపాలయ భక్తిధేను మేకామ్' (63) అనుచోఁ బశుపతిశబ్దము సాభిప్రాయమై యన్యపద వినిమయాసహ మగుచున్నది అందుచే దానిని 'విమల సుకృతిఫల పరిపాకము నా యొక భక్తి గోవుఁ గావు పశుపతీ !' యని తెలిఁగించితిని. అట్లే 'వేదాన్తోపవనే విహారరసికం తం నీలకణ్ఠం భజే' (53) యనుదాన 'నీలకంఠ శబ్దము శ్లిష్టమై శివ మయూరోభయార్థ ద్యోతకమై యత్యాజ్యమగుచున్నది. పైఁగా నీలకంఠశబ్దము మయూరార్థమున నమహత్తయి నీలకంఠమని యుండవలయును శివార్థమున మహత్తయి నీలకంఠుఁడని యుండవలయును. 'తగఁ బ్రగీశించెడి నీలకంఠ మహామున్ ధ్యానింతు నశ్రాంతమున్' అని తెనిఁగింపున నది దాఁటఁబడినది.

(52) లోని 'నీలకంధర' శబ్దము, (51) లోని 'భ్రమరాధిప' శబ్దము నట్టివేయుట యపరిహరణీయము లగుచున్నవి (50) లోని 'శ్రీగిరి మల్లికార్జున మహాలిఙ్గం' అను దానిని దెనుఁగునను నట్లె రావింపవలయును (48)లోని 'ద్విజ' శబ్దమును, 'వాసనా' శబ్దమును నవర్జనీయములు. ఇట్లెన్నియని యుదాహరించుట ! అన్నిటను వ్రాయు జాగరూకత వహింపఁబడినది. దానిని సహృదయ విద్వాంసులు గుఱుతింపకపోరని యాశించుచున్నాను.

సంస్కృతమున నొకభావము — అతి సంగ్రహముగాఁ జెప్పవలనుపడు నది — తెలుఁగున నింతక విపులతరము గావచ్చును. అట్టిచోఁ దెనుఁగునఁ గొన్ని పద్యములు బహుపాదములు గాక తప్పలేదు. శ్లోకభావమంతయు ననువాదమునఁ దీసికొనివచ్చుట ముఖ్యము కావున నా వైపుల్యమునకు నేను సంకోచింపలేదు నాలుగు పాదములకంటెఁ దక్కువ కాఁగూడదు కాని యొండురెండు పాదము లధికమగుట ఛందోదోషముగాదు కావునఁ గతిపయపద్యముల నట్లుచేయ వెఱవనైతిని ఆ రెండు భాషల స్వభావ మట్టిదయినప్పు డది యసమర్థతా సూచకము గాదనియు నా విశ్వాసము.

పాఠకుల కొక మనవి. ఇది యనువాదమని నిరసింపక కడుఁగడు మెలఁకువతోఁ జేయఁబడిన దీన నేదే గుణలేశమున్నచో నాదరింప వేఁడుచున్నాను ఒకకావ్యము స్వతంత్రమా, యనువాదమా యనిచూడక తద్గుణాధిక్యమునుబట్టి యాదరింపఁ దగినది.

ఉ. ఆత్మకళంకతా రుచిరమౌనె స్వయంరచితమ్ము సర్వమున్,
స్తుత్యము గాకపోవునె యనూదితమైనది సర్వ ముత్తముత్
సత్యము నిర్ణయించి విలసన్మతిఁ గొందరు కావ్యమున్, బర
ప్రత్యయనేయబుద్ధులయి వర్తిలుచుండెద రన్యు లక్కటా!

ఆదిశంకరుల శివానందలహరీ సౌందర్యలహరులలో మంత్రమహిమ యున్నది. బీజాక్షరము లున్నవి, అవి మీ యనువాదమునను వచ్చినవా? యని యెవరైన నడుగ వచ్చును కావచ్చును. కాని యవి యేమో నాకుఁ దెలియవు అందలి కవితాప్రాభవమున కబ్బురపడియే తదాంధ్రీకరణమునకుఁ దొడఁగితినని మనవిచేయుచున్నాను. మూలశ్లోకములకట్టి మంత్రశక్తి యున్నచో దానిని జాగరూకతతో ననువదించిన దీనియందును నుండవచ్చునని నా నమ్మకము.

దీనియందలి ప్రతిశ్లోకమును, దానికి నేను గావించిన యాంధ్రీకరణమును అక్షరక్షర సంయోగముగాఁజూచి యెడనెడఁ దగుసూచనలను జేసిన మహనీయులు — ఆచార్య దోర్బల ప్రభాకరశర్మగారు. వారు జగద్విదిత సంస్కృతాంధ్ర భాషాపాండితీమండితులు సంస్కృతభాషా విశేషప్రచారమే జీవితధ్యేయముగాఁ గల పరోపకార పరాయణులు వారు విశేషించి నిరహంకారులు, సహృదయ సార్వభౌములు. నాకుఁ గల సంస్కృత భాషానురక్తినిబట్టియు, వారికిఁగల గైర్వాణీ వాణీప్రావాహిక రచనా సామర్థ్యము ననుసరించియు నేను వారిని సంస్కృతభాషలో నొక పీఠికను దయచేయుఁడని యర్థింప వారు దయతోఁ దధాస్తని నిజ సహజసుందర సర్వసుగమ శయ్యలోఁ దమ యాస్వాదమును బ్రకటించినారు వారికి నా కృతజ్ఞత. సంస్కృతములో నున్నదని విడువక దానినిగూడ నాస్వాదింప సహృదయపాఠకులను వేఁడుచున్నాను.

గ్రంధ గౌరవమును బట్టియు, నాయందుఁ దమకుఁగల గురుభావమును బట్టియు నే నడుగకయే యీ పుస్తకముద్రణమునకుఁ జేయూఁతనిచ్చి నన్నుఁ గృతార్థుని గావించిన చిరంజీవులు దత్తి ముకుందవేణీ వేంకటేశ్వరరావు దంపతులకు నా హృదయ పూర్వక శుభాకాంక్షలు,

ఎంతయో జాగరూకతతో మిక్కిలి సుందరముగా గ్రంధముద్రణము గావించిన శ్రీ సరస్వతీ పవర్ ప్రెస్ వారికి నా కృతజ్ఞత.

నాకు శ్రీ శంకరాచార్యులవారి చిత్రపటము నందఁజేసిన చిరంజీవులు కొటికలపూఁడి రమాగోపాలకృష్ణునకు నా కృతజ్ఞతా పూర్వక శుభాభినందనములు.

ఈ యనువాదమును జేయుటలోను, దట్టీకాతాత్పర్యముల రచనములోను నాకెంతయో సహాయపడిన శ్రీ వావిళ్ళహరి ప్రతిలోని సంస్కృతాంధ్రవ్యాఖ్యాతలకు నాకృతజ్ఞతా పురస్కృత నమస్కృతులు.

ఇట్లు
విద్వజ్జన విధేయుఁడు

రాజమహేంద్రవరము

డాక్టర్ జొన్నలగడ్డ మృత్యుంజయరావు



श्री शंकरभगवत्पादाः

## అంకితము

ఆతతభక్తి నీకృతిని నంకిత మిత్తు జగద్గురుండు న
ద్వైత మత ప్రవక్తయును భక్తి కవిత్వ రసస్వరూపుఁడున్
భూతలశంకరుండె యనఁ బొల్చెడివాఁడు మహామహుండు వి
ఖ్యాతుఁడు భాష్యకారుఁ డగు నాదిమ శంకరు నద్గురోయికిన్.

శ్రీమ దాదిశఙ్కరాచార్య కృతా

# శ్రీ శివానన్ద లహరీ

అ వ తా రి క : పూజ్యులును, పరమకారుణికులును నగు శ్రీ శంకరులు పరమేశ్వరనమస్కారమహిమచే సకలపురుషార్థములను సిద్ధించుట యెఱిఁగి, సంసార సముద్రమును దాము స్వయముగాఁ దరించుటకును, నితరులను దరింపఁజేయుటకును బరమేశ్వరుని స్తుతింపనారంభించువారయి నిర్విఘ్నముగా గ్రంథము పరిసమాప్తి చెందుటకయి పార్వతీపరమేశ్వర ప్రణామరూపమగు మంగళము నాచరించుచున్నారు.

1

శ్లో. కలాభ్యాం చూడాలఙ్కృతశశికలాభ్యాం నిజతపః
ఫలాభ్యాం భక్తేషు ప్రకటితఫలాభ్యాం భవతు మే,
శివాభ్యా మస్తోక త్రిభువన శివాభ్యాం హృది పున
ర్భవాభ్యా మానన్దస్ఫురదనుభవాభ్యాం నతి రియమ్.

టీ క : కలాభ్యాం = శ్రుతిప్రసిద్ధ సకల విద్యా స్వరూపులును, చూ....భ్యాం- చూడా = శిఖలచే, అలఙ్కృత - అలంకరింపఁబడిన, శశి కలాభ్యాం = చంద్ర కళలు గలవారును, నిజ = తమవైన, తపః = తపస్సులయొక్క, ఫలాభ్యాం = ఫల మైన వారును. భక్తేషు = భక్తులయందు, ప్రకటిత = చూపఁబడిన, ఫలాభ్యాం = ధర్మాది ఫలములు గలవారును, అ....భ్యాం — అస్తోక = అనల్పములైన, త్రిభు వన = ముజ్జగముల యొక్క, శివాభ్యాం = శుభములు గలవారును. హృది = హృద యమునందు, పునర్భవాభ్యాం = ధ్యానించునపుడెల్ల మరలఁ దోఁచుచుండువారును, ఆ....భ్యాం - ఆనన్ద = ఆనందముతోఁ గూడ, స్ఫురత్ = తోఁచుచుండెడు, అను భవాభ్యాం = స్వరూప సాక్షాత్కారముగలవారును. నగు, శివాభ్యాం = పార్వతీ పర మేశ్వరుల కొఱకు, ఇయం = ఈ, మే = నాయొక్క. నతిః = నమస్కారము, భవతు = అగుఁగాక.

తా త్ప ర్య ము ; శ్రుతిప్రసిద్ధ సకలవిద్యా స్వరూపులును, శిఖలచే నలంక రింపఁబడిన చంద్రకళలు గలవారును, దమతమ తపస్సులచేఁ బరస్పరము ఫలముగా నైనవారును. భక్తులకుఁ జూపఁబడిన ధర్మాది ఫలములు గలవారును, ధ్యానముచేయు

నపుడెల్ల భక్తుల హృదయములయం దావిర్భవించువారును. మోక్షకాములగువారి కానందసాక్షాత్కారము నొసఁగువారును నగు పార్వతీ పరమేశ్వరులకు నమస్కరించు చున్నాను.

ఉ. హారి శిఖా పరిష్కృత శశాంకకళల్, కళలున్. బరస్పర
స్ఫార తపః ఫలాత్ములును, భక్తజనప్రవితీర్ణ సత్ఫలుల్,
భూరి జగత్త్రయీ వశ శివుల్, పునరాంతరసంభవుల్, మహో
దార ము దాస్ఫురద్వపులుఁ దచ్ఛివులన్ బ్రణమిల్లెదన్ మదిన్.

2

అవతారిక : శివానందము తన మనస్సు నెడఁబాయకుండునట్లు వేఁడుకొను చున్నాఁడు.

శ్లో. గలన్తీ శమ్భో త్వచ్చరితసరితః, కిల్బిషరజో
దలన్తీ, ధీకుల్యా సరణిషు పతన్తీ, విజయతామ్.
దిశన్తీ సంసారభ్రమణ పరితాపోపశమనం
వసన్తీ మచ్చేతోహ్రదభువి శివానన్దలహరీ.

టీక : శమ్భో = సుఖకారణుఁడవైన శివా!, త్వ .... .... తః - త్వత్ = నీ యొక్క, చరిత = చరిత్ర మనెడి, సరితః = నదిమండి, గలన్తీ = స్రవించుచున్న దియు, కిల్బిష = పాపములనెడు, రజః = ధూళిని, దలన్తీ = అడఁచుచున్నదియు, ధీ = బుద్ధులనెడు, కుల్యా = కాలువలయొక్క, సరణిషు = మార్గములందు, పతన్తీ = పడుచున్నదియు. సం .... నం - సంసార = సంసారమందు, భ్రమణ = తిరుగుటవలని, పరితాప = సంతాపముయొక్క, ఉపశమనం = శాంతిని, దిశన్తీ = ఇచ్చుచున్నదియు, మ .... వి - మత్ = నాయొక్క, చేతః = చిత్తమనెడు, హ్రద భువి = మడుఁగునందు. వసన్తీ = నిలిచియుండునదియు నగు, శివానన్దలహరీ = పార్వతీ పరమేశ్వరులవలనఁ గలిగిన యానందప్రవాహము, విజయతాం = ఉత్కృష్ట మై యుండుఁగాక!

తాత్పర్యము : శంభూ! భక్తపరిపాలనాదిరూపమగు నీ చరిత్రమనెడు నదినుండి స్రవించుచున్నదై, పాపములనెడుధూళి నడఁచుచు, బుద్ధి యను కాలువలోఁ

బాయుచు సంసార పరితాపము నుపశమింపఁజేయుచు శివానందలహరి నా చిత్తమనెడు హ్రదమునఁబడి స్థిరముగా నుండి యుత్కృష్ట మగునుగాక.

గీ. స్వామి ! భవదీయ చరిత స్రవంతినుండి
పర్వు వెట్టుచు, నడఁగించి పాపరజము,
బుద్ధికుల్యలఁ బడి సాగి పోయి పోయి,
సంసృతిభ్రమ పరితాపశాంతిఁ గూర్చి,
యస్మదీయ చేతోహ్రద మందుఁజేరు
శ్రీ శివానందలహరి యుత్కృష్ట మగుత.

3

అ వ తా రి క : శివానందమునకు శివభజనము మూలమగుటచేఁ దద్భజనమును స్వయముగాఁ జేయుచున్నారు.

శ్లో. త్రయీ వేద్యం హృద్యం త్రిపురహర మాద్యం త్రిణయనం
జటాభారోదారం చలదురగహారం మృగధరమ్,
మహాదేవం దేవం మయి సదయభావం పశుపతిం
చిదాలమ్బం సామ్బం శివ మతివిడమ్బం హృది భజే

టీ క : త్రయీ = ఋగ్యజుస్సామము లనెడు మూఁడు వేదములచేతను• వేద్యం = తెలిసికొనఁదగినవాఁడును. హృద్యం = హృదయమునం దభివ్యక్తుఁడైనవాఁడును త్రిపురహరం = స్థూల సూక్ష్మ కారణ శరీరములను మూఁటిని హరించువాఁడును, ఆద్యం = సృష్టికిముందే యున్నవాఁడును, త్రిణయనం = మూఁడు కన్నులు గలవాఁడును, జటాభారోదారం = జటాజూటముచే గంభీరమైనవాఁడును, చలత్ = కదలుచున్న, ఉరగ = పాములనెడు, హారం = పేరులు గలవాఁడును, మృగధరం = లేడిని దాల్చువాఁడును, మహాదేవం = గొప్పదేవుఁడును - అపరిచ్ఛిన్న స్వప్రకాశరూపుఁడును, దేవం = ఆనందస్వరూపుఁడును, మయి = నాయందు, సదయభావం = దయతోఁ గూడిన మనస్సుగలవాఁడును, పశుపతిం = బ్రహ్మాది లోకపాలకుఁడును, చిదాలమ్బం = స్వరూప జ్ఞానమునకు సాధనమైనవాఁడును, అతి విడమ్బం = లోకానుకరణము గలవాఁడును. స + అమ్బం = పార్వతీ

సహితుఁడును నగు, శివం = పరమేశ్వరుని. హృది = మనస్సునందు, భజే = భజింతును.

తాత్పర్యము: ఋగ్యజుస్సామము లనెడు మూఁడు వేదములచేతను దెలియఁదగినవాఁడును, హృదయమునఁ దోఁచువాఁడును, స్థూల సూక్ష్మ కారణ శరీరములను మూఁటిని నశింపఁజేయువాఁడును, సృష్టికిఁ బూర్వమందే యుండినవాఁడును, మూఁడుకన్నులు గలవాఁడును, జటాభారము గలవాఁడును, జలించుచున్న సర్పములు హారములుగాఁ గలవాఁడును, మృగమును ధరించువాఁడును, నపరిచ్ఛిన్న స్వప్రకాశ రూపుఁడును, ఆనంద స్వరూపుఁడును, నాయందు దయతోఁగూడిన మనస్సు గలవాఁడును, బ్రహ్మాది లోకపాలకుఁడును. స్వరూప జ్ఞానమునకు సాధనమైనవాఁడును, లోకానుకరణము గలవాఁడును, పార్వతీ సహితుఁడును నగు పరమేశ్వరుని మనస్సునందు భజింతును.

గీ. హృద్యుఁ బశుపతిఁ ద్రిణయనుఁ ద్రిపురహరుని
జలదురగహారు మృగధరు జటిలు దేవు
వేదవేద్యు మహాదేవు నాదిదేవు
సాంబు శివునిఁ జిదాలంబు నతివిడంబు
మద్గత లసత్కృపా భావు మదిని గొల్తు.

## 4

అవతారిక: సర్వ దేవతలలోను శివుఁ డుత్కృష్టుఁడని తలఁచి తత్పాదారవిందభజనము నాతనినే యాచించుచున్నారు.

శ్లో. సహస్రం వర్తన్తే జగతి విబుధాః క్షుద్రఫలదా
న మన్యే స్వప్నే వా తదనుసరణం తత్కృతఫలమ్,
హరిబ్రహ్మాదీనా మపి నికటభాజా మసులభం
చిరం యాచే శమ్భో శివ తవ పదామ్భోజభజనమ్.

టీక. జగతి = లోకమునందు, క్షుద్రఫలదాః = తుచ్ఛములైన ఫలముల నిచ్చునట్టి. విబుధాః = (ఇతర) దేవతలు, సహస్రం = వేలకొలఁది, వర్తన్తే =

ఉన్నారు, (అహం = నేను), స్వప్నే వా = కలలోనైనను, తదనుసరణం = ఆ దేవతలను సేవించుటకాని, తత్కృతఫలం = ఆ దేవతలు కలుగఁజేయు ఫలమును గాని, న మన్యే = తలఁపను, శమ్భో-శివ = సుఖకారణుఁడవును మంగళస్వరూపుఁడవు నగు శంకరా! నికటభాజాం = సామీప్యమును బొందియున్న, హరిబ్రహ్మాదీనా మపి = హరిబ్రహ్మాదులకు నైతము, అసులభం = దుర్లభమైన, తవ = నీ యొక్క, పదామ్భోజభజనం = పాదపద్మ సేవను, చిరం = చిరకాలము, యాచే = యాచించుచున్నాను.

తాత్పర్యము: తుచ్ఛఫలములనిచ్చు దేవతలు వేవు రున్నారు. కలలోనైనను వారి సేవనుగాని, వారి ఫలమునుగాని నేను దలఁపను, సుఖకారణుఁడవు మంగళ స్వరూపుఁడవు నైన యీశ్వరా! సన్నిధానవర్తులైన హరిబ్రహ్మాదులకుఁ గూడ దుర్లభమైన మీ పాదసేవను నేను జిరకాలము యాచించుచున్నాను.

మ. కల రీ లోకమునందు దేవత లసంఖ్యాకమ్ముగా క్షుద్రమౌ
ఫలముల్ గల్గఁగఁజేయువారలు; తలంపన్ వారలన్, వారివౌ
ఫలముల్ స్వప్నమునందునే శివ! హరిబ్రహ్మాదులౌ నంతిక
స్థులకే దుర్లభమైన త్వచ్చరణపాథోజార్చ నెంతున్ సదా.

అవతారిక: ఎప్పుడో పరోక్షఫలము నొసఁగు దేవతల ననుసరింపనేల? ఒక రాజు నాశ్రయించి ప్రత్యక్షఫలమును వెంటనే పొందుట నయముగదా యను నభిప్రాయమును మనసునం దుంచుకొని యిట్లు చెప్పుచున్నారు.

శ్లో. స్మృతౌ శాస్త్రే వైద్యే శకున కవితా గాన ఫణితౌ
పురాణే మన్త్రే వా స్తుతి నటన హాస్యే ష్వచతురః,
కథం రాజ్ఞాం ప్రీతి ర్భవతి మయి కోఽహం పశుపతే
పశుం మాం సర్వజ్ఞ ప్రథితకృపయా పాలయ విభో.

టీక: స్మృతౌ = మనుస్మృతి మొదలగు స్మృతులయందుఁగాని, శాస్త్రే = తర్కవ్యాకరణాది శాస్త్రములయందుఁగాని, వైద్యే = వైద్యము నందుఁగాని, శ....తౌ.

శకున = శకునములు చెప్పుటయందుఁగాని, కవితా = కవిత్వమునందుఁగాని, గాన ఫణితౌ = సంగీతము పాడి రంజించుటయందుఁగాని, పురాణే = పురాణము చెప్పుటయందుఁగాని, మన్త్రే వా = మంత్రశాస్త్రమునందుఁగాని, స్తుతి = స్తోత్రము చేయుటయందుఁగాని, నటన = నాట్యమునందుఁగాని, హాస్యేషు = హాస్యము లందుఁగాని, అచతురః = నేర్పులేనివాఁడను, మయి = (ఇట్టి) నాయందు, రాజ్ఞాం = రాజులకు, ప్రీతిః = ఇష్టము, కథం = ఎట్లు, భవతి = కలుగును, (అతః = కనుక), ప్రథిత = వేదప్రసిద్ధుఁడవును, సర్వజ్ఞ = సర్వము దెలిసిన వాఁడవును, నగు, పశుపతే = పశుపతీ, కో௨హం = నే నెవ్వఁడనో యెఱుఁగని, పశుం = పశుప్రాయుఁడవైన, మాం = నన్ను, కృపయా = దయతో, పాలయ = రక్షింపుము.

తాత్పర్యము: సర్వజ్ఞుఁడవైన పశుపతీ ! స్మృతి, శాస్త్రము, వైద్యము, శకునము, కవిత్వము, గానము, పురాణము, మంత్రము, స్తుతి, నాట్యము, హాస్యము ననువానియందు నేర్పులేనివాఁడను, రాజులకు నాయందుఁ బ్రీతియెట్లు కలుగును ? నన్ను నేనే యెఱుఁగని పశువను, నీవు పశుపతివిగదా ! దయతో నీవే నన్ను రక్షింపుము.

మ. స్మృతి, శాస్త్రంబున, వైద్యమందుఁ గవితాశ్రీ నాట్యహాస్యంబులన్,
స్తుతి, గీతిన్, శకునాన, మంత్రమునయందున్, మే ల్పురాణంబునన్
జతురత్వం బిసుమంత లేమి నెటు రాట్సత్కారముల్ గల్గు నా ?
కతిమందున్ బశువన్ గృపన్ మనుపవయ్యా నన్ను సర్వేశ్వరా !

అవతారిక: ఇట్లు దేవుని వేఁడుకొని దురభ్యాసబలముచే సామాన్యశాస్త్రముల మీఁదికే పరువులెత్తు తనబుద్ధిని వారించి శివభజనము చేయుమని యనునయించు చున్నారు.

శ్లో. ఘటో వా మృత్పిణ్డో௨ప్యణురపి చ ధూమో௨గ్ని రచలః
పటో వా తన్తుర్వా పరిహరతి కిం ఘోరశమనమ్,
వృథా కణ్ఠక్షోభం వహసి తరసా తర్కవచసా
పదామ్భోజం శమ్భో ర్భజ పరమసౌఖ్యం వ్రజ సుధీః.

టీక : సుధీః = ఓ మంచి బుద్ధీ, ఘటో వా=కుండగానీ, మృత్పిణ్డోఽపి= మట్టిముద్దగానీ, అణురపి = పరమాణువుగానీ, ధూమః = పొగగానీ, అగ్నిః = నిప్పుగానీ, అచలః = కొండగానీ, పటో వా = వస్త్రముగానీ, తన్తుర్వా = దారముగానీ, ఘోరశమనం = భయంకరుఁడైన యముని, పరిహరతి కిం = పోఁగొట్టునాయేమి ? తర్కవచసా=(పైనిఁజెప్పిన) తర్కశాస్త్రమందలి మాటలచేత, వృథా = వ్యర్థముగా, కణ్ఠక్షోభం = కంఠమున కాయాసమును, వహసి = కలిగించుకొనుచున్నావు, (అది మాని), శమ్భోః = శివునియొక్క, పదామ్భోజం = పాదపద్మమును, భజ = సేవింపుము, తరసా = శీఘ్రముగా, పరమసౌఖ్యం = మోక్ష సామ్రాజ్యమును, వ్రజ = పొందుము.

తాత్పర్యము : కుండలు చేయుటకు మట్టి కావలయును. దానికిఁ బరమాణువులు కారణము. కొండమీఁదఁ బొగ కనఁబడుచున్నది. కావున నిప్పక్కడ నుండును. బట్టలనేఁతకు దారములు కావలయును. ఈ తర్కశాస్త్ర వాక్యములలో నొక్కటియు మృత్యువును వారింపలేదు. వీనిని వల్లించి వ్యర్థముగాఁ గంఠక్షోభము నేల కలిగించుకొందువు ? వలదు. శివభజనమునుజేసి మోక్షమును బొందుము.

మ. ఘటమున్ మృత్తనణూత్కరమ్ముఁ బొగయున్ గార్చిచ్చు ధాత్రీధ్రమున్
బటమున్ దంతువు ఘోరదండధరునిన్ వారింపఁగా నోపునే ?
యటు లా తర్కపదాళి నేల వితగా నార్పింతు నీ గొంతు ? వే
పలుబుద్ధీ ! శివపాదపద్మయుగసేవన్ సౌఖ్యముం బొందుమా !

7

అవతారిక : ఇట్లు బుద్ధి ననునయించి మనస్సు మొదలగు నింద్రియములను గూడ నితరవిషయాసక్తి లేకుండఁ బరమశివసేవాసక్తి గలుగునట్లు ప్రార్థించుచున్నారు.

శ్లో. మనస్తే పాదాబ్జే నివసతు వచస్స్తోత్ర ఫణితౌ
కరశ్చాభ్యర్చాయాం శ్రుతిరపి కథాకర్ణన విధౌ,
తవ ధ్యానే బుద్ధిర్నయనయుగళం మూర్తివిభవే
పరగ్రన్థాన్ కైర్వా పరమశివ జానే పర మతః,

టీక: పరమశివ = ఓ పరమేశ్వరా!, మనః = మనస్సు, తే = నీ యొక్క, పాదాబ్జే = పాదపద్మమునందును, వచః = వాక్కు, స్తోత్రఫణితౌ = స్తోత్రపాఠములు చదువుటయందును, కరః = చేయి, అభ్యర్చాయాం చ = పూజ యందును, శ్రుతిః = చెవి, కథాకర్ణన విధౌ = చరిత్ర శ్రవణమునందును, బుద్ధిః = బుద్ధి, తవ = నీ యొక్క, ధ్యానే = ధ్యానమునందును, నయనయుగళం = కను దోయి, మూర్తి విభవే = నీ దివ్యమంగళ విగ్రహముయొక్క సౌందర్యమునందును, నివసతు = స్థిరపడి యుండుఁగాక, అతః పరం = ఇంక మీఁద, కైర్వా = ఏ యింద్రియములచేత, పరగ్రన్థాన్ = నీ కైంకర్య వ్యతిరిక్తములైన గ్రంథములను, జానే = తెలిసికొందును?

తాత్పర్యము: నా మనస్సు నీ పాదాబ్జమునందును, వాక్కు నీస్తోత్ర పాఠ పఠనమునందును, జేయి నీ పూజయందును, జెవులు నీ కథల నాకర్ణించుట యందును, బుద్ధి నీ ధ్యానమునందును, గనుదోయి నీ మూర్తివిభవమునందును నిలిచి యుండుఁగాక. అప్పుడిఁక నే యింద్రియములతోఁ బరగ్రంథములను దెలిసికొందుము? ఆ ప్రసక్తియే కలుగదు, కావునఁ బరమశివా! అట్లనుగ్రహింపుము.

ఉ. నా మది నీదు పాదనలినమ్ములఁ, గన్గవ యాకృతిన్, వచ
స్తోమము స్తోత్రపాఠమున, శ్రోత్రము నీ కథలందుఁ, జేయి య
ర్చా మహనీయతన్, మతి నిరంతరచింతన మున్గియుండ, నా
కో మృడ! వేన వింకఁ దెలియున్ వెలయన్ బెఱగ్రంథసంతతుల్?

8

అవతారిక: నన్ను భజించుటచేతనే సర్వాభీష్టములు సిద్ధించుచుండఁగాఁ, గొందఱితరులనేల భజింతురనుప్రశ్నమున కిట్లు చెప్పుచున్నారు.

శ్లో. యథా బుద్ధి శ్శుక్తౌ రజత మితి కాచాశ్మని మణి
ర్జలే పైష్టే క్షీరం భవతి మృగతృష్ణాసు సలిలమ్,
తథా దేవభ్రాన్త్యా భజతి భవదన్యం జడజనో
మహాదేవేశం త్వాం మనసి చ న మత్వా పశుపతే.

టీక : మహాదేవ = ఓ మహాదేవుఁడా !, పశుపతే = సకల భూతాధిపతీ !, జడ జనః = మూఢుఁడు, ఈశం = సర్వనియంతవగు, త్వాం = నిన్ను, మనసి = మనస్సునందు. సమత్వా = తలఁపక, శుక్తౌ = ముత్యపుఁజిప్పయందు, రజత మితి = వెండి యనియు, కాచాశ్మని = గాజుఱాతియందు, మణిః = మాణిక్య మనియు, పైష్టే = పిండి కలిపిన, జలే = నీటియందు, క్షీరం = పా లనియు, బుద్ధిః = మిథ్యా బుద్ధి, యథా = ఎట్లు, భవతి = కలుగుచున్నదో, తథా = అట్లు, భవ దన్యం = నీకంటె నితరుఁడైనవాని, దేవభ్రాన్త్యా = దేవుఁ డను భ్రాంతిచేత, భజతి = సేవించుచున్నాఁడు.

తాత్పర్యము : మహాదేవా ! పశుపతీ ! ముత్యపుఁజిప్పను వెండియనియు, గాజుఱాతిని మణి యనియు, బిండినీటిని బా లనియు, నెండమావులను నీ రనియు భ్రమించునట్లు, నిన్నుఁ దెలియనేరని జడజనుఁ డితరుని దేవునిగా భ్రమించి సేవించు చున్నాఁడు.

ఆ.వె. పిండినీటిఁ బాలు. నెండమావుల నీరు,
శుక్తి వెండి, గాజు శుద్ధ మణిగ
నెంచునట్లు మందుఁ డీశుని నినుఁ గాంచ
కితరు దేవుఁడంచు నెంచు నభవ !

అవతారిక : ఏదో యొక యుపాయముచే భగవత్ప్రసాదము సంపాద నీయము. అందు సులభోపాయ మేదియో చెప్పుచున్నారు.

శ్లో. గభీరే కాసారే విశతి విజనే ఘోరవిపినే
విశాలే శైలే చ భ్రమతి కుసుమార్థం జడమతిః.
సమర్ప్యై కం చేతస్సరసిజ ముమానాథ భవతే
సుఖే నావస్థాతుం జన ఇహ న జానాతి కి మహో !

టీక : జనః=జనుఁడు, జడమతిః = మందబుద్ధియై, కుసుమార్థం=పువ్వుల కొఱకు, గభీరే = లోఁతైన, కాసారే = చెఱువునందు. విశతి = ప్రవేశించు చున్నాఁడు, విజనే = నిర్జనమైన, ఘోరవిపినే =భయంకరారణ్యమందును, విశాలే =

విస్తీర్ణమైన, శైలే చ = పర్వతమునందును, భ్రమతి = తిరుగుచున్నాఁడు, ఉమానాథ=ఓ పార్వతీపతీ, ఏకం = ఒక్క, చేతస్సరసిజం = మనఃపద్మమును, భవతే= నీకొఱకు, సమర్ప్య = సమర్పించి, ఇహ = ఇచ్చట, సుఖేన = సుఖముగా, అవస్థాతుం = నిశ్చలుఁడై యుండుటకు, న జానాతి = ఎఱుఁగఁడు, కి మహో =ఏమి యాశ్చర్యము !

తాత్పర్యము : మానవుఁడు మందబుద్ధియై పువ్వులకొఱకు లోఁతైన చెఱువులలో దిగుచు, భయంకరారణ్యమునందును, విశాలశైలములందును దిరుగుచున్నాఁడు. తన మనస్సనెడి యొక్క పద్మమును నీకు సమర్పించి సుఖముగా నుండవచ్చునని తెలియకున్నాఁడు, పార్వతీపతీ ! ఎంత వింత ?

చ. జడమతియై జనుండు సుమసంగ్రహణార్థ మగాధనీరమౌ
మడుఁగును జొచ్చు; ఘోర వనమధ్యమునం, బెనుగొండపైఁ గడున్
బడలి చరించుఁ, జిత్తమను పంకజ మొక్కఁడు నీ కొసంగి యి
య్యెడ సుఖియై మనన్ దెలియఁ డెంతటి వేఱ్ఱిడియో యుమాపతీ !

10

అవతారిక : ప్రారబ్ధకర్మవశముచేత నేదోయొక జన్మము రానిమ్ము. కాని యే జన్మమునందయినను నీ పాదపద్మస్మరణముమాత్రము కలుగున ట్లనుగ్రహింపు మని ప్రార్థించుచున్నారు.

శ్లో. నరత్వం దేవత్వం నగ వన మృగత్వం మశకతా
పశుత్వం కీటత్వం భవతు విహగత్వాది జననమ్,
సదా త్వ త్పాదాబ్జ స్మరణ పరమానన్దలహరీ
విహారాసక్తం చే ద్ధృదయ మిహ కిం తేన వపుషా ?

టీక : నరత్వం = మనుష్యుఁడుగాఁగాని, దేవత్వం = దేవుఁడుగాఁ గాని, నగ వన మృగత్వం = కొండమృగము, అడవి మృగముగాఁ గాని, మశకతా = దోమగాఁగాని, పశుత్వం = పశువుగాఁగాని, కీటత్వం = పురుగుగాఁ గాని, విహగత్వాది జననం = పక్షులు మున్నగువానిగాఁ గాని పుట్టుక, భవతు = అగుఁగాక !, హృదయం = మనస్సు, ఇహ = ఈ పై పుట్టువులందు, సదా = ఎప్పుడును,

త్వ ...... క్తం - త్వత్ = నీయొక్క పాదాబ్జ = పాదపద్మములయొక్క, లహరీ = ప్రవాహమునందు, విహార=విహరించుటయందు, ఆసక్తం=ఆసక్తి గలిగినది, (భవతి) చేత్ = అగునేని, తేన = ఆ, వపుషా = శరీరముచేత, కిం = ఏమి నష్టము?

తాత్పర్యము ; నరుఁడుగానో, దేవుఁడుగానో, నగమృగముగానో, అడవి మృగముగానో, దోమగానో, పశువుగానో, పురుగుగానో, పక్షుల మున్నగువానిగానో పుట్టువు గలుగుఁగాక ; హృదయమెప్పుడును నీ పాదాబ్జ స్మరణమనెడి పరమానంద ప్రవాహమునందు విహరింప నాసక్తి గలిగియున్నచోఁ బుట్టు వేదయినను నష్టములేదు.

చ. మశకతయున్, నరత్వము. నమర్త్యతయున్, వనశైల జంతుతల్,
పశుతయుఁ, గీటకత్వమును, బక్షితయున్ లభియించుఁ గా కెదో!
పశుపతి ! దాననేమి ? యెద త్వత్పదపంకజయుగ్మ చింతనా
వశ పరమ ప్రహర్షపరివాహ విహార సముత్సకంబ యేన్ ?

11

అవతారిక: ఇట్లు జన్మ మేదయినను బాధలేదనిచెప్పి చిత్త మీశ్వరాధీనము గాక యాయా వర్ణాశ్రమధర్మము లెన్నిచేసినను లాభములేదని చెప్పుచున్నారు.

శ్లో. వటు ర్వా గేహీ వా యతిరపి జటీ వా తదితరో
నరో వా యః కశ్చి ద్భవతు భవ కిం తేన భవతి,
యదీయం హృత్పద్మం యది భవ దధీనం పశుపతే
తదీయ స్త్వం శమ్భో భవసి భవభారం చ వహసి.

టీక: నరః = జనుఁడు, వటు ర్వా = బ్రహ్మచారి యైనను, గేహీ వా = గృహస్థైనను, యతి రపి = సన్న్యాసియైనను, జటీ వా = జడదారియైనను, తదితరః యః కశ్చిత్ = మఱి యిఁకనెట్టివాఁ డయినను, భవతు=కానిమ్ము, భవ= ఈశ్వరా!, తేన = దానిచే, కిం భవతి = ఏ మగును? (ఏమియుఁ గార్యము లేదు). పశుపతే = సకలభూతనాథా! యదీయం = ఎవని సంబంధమైన, హృత్పద్మం = హృదయ కమలము, భవ దధీనం యది = నీ యధీన మయినదిగా నుండునో, తదీయం = తత్సంబంధివిగా, త్వం = నీవు, భవసి = అగుదువు, శమ్భో = శంకరా !, భవభారం చ=వాని సంసారభారమునుగూడ, వహసి=(నీవే) భరింతువు.

తాత్పర్యము : వర్ణభేదయిన నగుఁగాక, యాశ్రమభేదయిన నగుఁగాక, జడదారి యగుఁగాక, మఱి యెవ్వఁడైన నగుఁగాక ; ఈశ్వరభక్తి లేనిదే లాభ మేమియు లేదు. ఎవని హృదయపద్మము నీ కధీనమయి యుండునో, యీశ్వరా! నీవు వానికి సంబంధించినవాఁడవయి తత్సంసారభారమును సైతము వహింతువు.

క. వటుఁడో, గేస్తో, యతియో.
జటియో యెవఁడైన నగుత జనుఁ, డెద నీదేన్.
నిటలాక్ష ! తదీయుఁడవను,
బటిమన్ దద్భవభరమ్ము వహియించెదవున్.

12

అవతారిక : ఇట్లాశ్రమచతుష్టయముకన్న శివభక్తియే మిన్న యనిచెప్పి, పర్వతగుహాది నివాసముకన్నను శివభక్తి మేలని చెప్పుచున్నారు.

శ్లో. గుహాయాం గేహే వా బహి రపి వనే వాద్రిశిఖరే
జలే వా వహ్నౌ వా వసతు వసతేః కిం వద ఫలమ్,
సదా యస్యైవాన్తఃకరణ మపి శమ్భో తవ పదే
స్థితం చే ద్యోగోఽసౌ స చ పరమయోగీ స చ సుఖీ.

టీక : గుహాయాం=కొండగుహయందో. గేహే వా = గృహమందో. బహిరపి = బయలనో. వనే వా = అడవియందో, అద్రిశిఖరే = పర్వత శిఖరమునందో, జలే వా = నీటియందో, వహ్నౌ వా = పంచాగ్నిమధ్యముననో, వసతు = నివసించుఁగాక, శమ్భో = శంకరా ?, వసతేః = అట్టి నివాసమువలన, కిం ఫలం = ఏమిలాభమో, వద = చెప్పుము, యస్య = ఎవనియొక్క, అన్తఃకరణ మపి = మనస్సుకూడ, సదా = ఎల్లప్పుడును, తవ = నీయొక్క, పదే ఏవ = పాదమునందే, స్థితం చేత్ = నిలిచియున్నచో, అసౌ = అది, యోగః = శివయోగము, స చ = అతఁడే, పరమయోగీ = నిర్వికల్ప సమాధిగల పరమయోగియు, స చ = వాఁడే, సుఖీ = పరమానందము గలవాఁడును నగును,

తాత్పర్యము : పర్వతగుహయందో, యింటనో, యరణ్యముననో, పర్వత శిఖరముననో, నీటనో, యగ్నియందో, నివసించుఁగాక ; అట్టి నివాసమువలన

ఫలమేమి? అంతఃకరణముగూడ నీశ్వరపాదమునందు నిలుచుచో, నదే శివయోగము, అతఁడే పరమయోగి. అతఁడే పరమానందభాజుఁడు నగును.

చ. క్షితిధరగహ్వరంబుననొ, గేహమునందొ. వనంబునందొ, యు
న్నతగిరి కొమ్మనందొ, జ్వలనంబుననో, వెలియందొ, నీటనో
శితిగళ! యుండుఁగాక! స్థితిచే ఫలమేమి? యెడంద త్వత్పద
స్థిత మగునేని యోగ మదె. సిద్ధుఁ డతండె, సుఖీంద్రుఁ డాతఁడే.

13

అవతారిక: అట్టివాఁడను గాలేని నాకు జ్ఞానము నను గ్రహించి రక్షించుట నీకు యుక్తమని చెప్పుచున్నారు.

శ్లో. అసారే సంసారే నిజభజనదూరేఽజడ ధియా
భ్రమన్తం మా మన్ధం పరమ కృపయా పాతు ముచితమ్,
మ దన్యః కో దీన స్తవ కృపణరక్షాతినిపుణః
త్వ దన్యః కో వా మే త్రిజగతి శరణ్యః పశుపతే.

టీక: పశుపతే = ఆత్మజ్ఞానమును బరిపాలించువాఁడా!, అజడ = జడములైన దేహాదులకన్న భిన్నమైన, పరమ = ఓ పరాత్పరా!. అసారే = సారములేనిదియు. నిజ భజనదూరే = ఆత్మానుసంధానము దూర మయినదియు నగు. సంసారే= సంసారమందు, భ్రమన్తం = కొట్టుకొనుచున్నట్టియు, అన్ధం = ఆత్మానాత్మవివేకము లేమి గ్రుడ్డివాఁడనైనట్టియు. మాం = నన్ను, కృపయా = దయతో, ధియా= స్వరూపజ్ఞానముచేత. పాతుం = రక్షించుటకు, ఉచితం = యుక్తము. దీనః = సంసారతాపముచేత దీనుఁడైన, మ దన్యః = నాకంటె మఱియొకఁడు, తవ = నీకు, కః = ఎవఁ డున్నాఁడు, కృపణ రక్షాతి నిపుణః = దీనరక్షణమందు మిక్కిలి నేర్పుగలవాఁడును, మే = నాకు, శరణ్యః = శరణు పొందఁదగినవాఁడును. త్వ దన్యః = నీకంటె మఱియొకఁడు, త్రిజగతి = ముజ్జగము లందును, కః = ఎవఁ డున్నాఁడు?

తాత్పర్యము: పశుపతీ! ముజ్జగములందును దీనజనరక్షాదక్షుఁడవు నీ వొక్కఁడవే కలవు. నేనును సంసార పరితాపమును సైఁపలేక దీనుఁడనై నీవే దిక్కుగా

నీ శరణుచొచ్చి యున్నాను, నావంటి దీనుఁ డింకెందును గానరాఁడు. కావున దయతో నాత్మజ్ఞానము నొసఁగి యీ దీనుని సంసారతాపమునుండి రక్షింపుము.

చ. అజడ ! మహేశ ! యోయిపరమా ! కృప సాకవె యంధునిన్ భవ
దృజన విదూరవర్తియును, ఫల్గువు నౌ భవమందు సంభ్రమిం
చు జనుని నన్ను ధీ యొసఁగి ? చూడఁగ నీకు మదన్యదీనుఁడున్,
త్రిజగములం ద్వదన్యుఁడగు దీనశరణ్యుఁడు నాకు, నుందురే ?

## 14

అవతారిక : అపరాధినైన నన్ను రక్షించుటె ట్లందువేమో ? నేను నీ వాఁడను గనుక నాతప్పు క్షమింపుమని బంధుత్వము నుపపాదించుచున్నారు.

శ్లో. ప్రభు స్త్వం దీనానాం ఖలు పరమబన్ధుః పశుపతే
ప్రముఖ్యోఽహం తేషా మపి కిముత బన్ధుత్వ మనయోః,
త్వ యైవ క్షన్తవ్యాః శివ మదపరాధాశ్చ సకలాః
ప్రయత్నా త్కర్తవ్యం మదవన మియం బన్ధుసరణిః.

టీక : పశుపతే = ఓ పరమేశ్వరా !, త్వం = నీవు, ప్రభుః = దీనత్వమును బాప సమర్థుఁడవు- (కావుననే) దీనానాం = దీనులకు, పరమబన్ధుః ఖలు = ముఖ్యబంధుఁడవు గదా, అహం = నేను, తేషాం = ఆ దీనులలో, ప్రముఖ్యః = మొట్టమొదటివాఁడను, అనయోః అపి = ఇట్టి మనకును, బన్ధుత్వం = చుట్టఱికము, కిముత = ఉన్నదని వేఱుగాఁ జెప్పవలయునా ?, శివ = ఓ యానందస్వరూపుఁడా, సకలాః = సమస్తమైన, మదపరాధాః = నాతప్పులు, త్వయైవ = నీచేతనే, క్షన్తవ్యాః = క్షమింపఁదగినవి, మదవనం = నా రక్షణము, ప్రయత్నాత్ = ప్రయత్నము వలన, కర్తవ్యం = చేయఁదగినది, ఇయం = ఇది, బన్ధుసరణిః = బంధుమర్యాద.

తాత్పర్యము : పశుపతీ ! నీవు దీనజన బాంధవుఁడవు, నేను దీనులలో నగ్రగణ్యుఁడను, ఇఁక మనకు బాంధవము కలదని వేఱుగాఁ జెప్పవలయునా ? శివా ! కావున నా తప్పులన్నియు మన్నించి నన్ను నీవే దయతోఁ దప్పక రక్షింపవలసి యున్నది. ఇదియేకదా బంధుమర్యాద.

చ. ప్రభుఁడవు నీవు దీనజన బంధువరుండవు, నేను వారిలో
నభవ ! ప్రముఖ్యుఁడన్, మనకు నారయఁ జుట్టఱికం బదేమి దు
ర్లభమె ? మహేశ !. నాదు నపరాధము లన్నియు క్షమ్యముల్ శివా !
అభయ మొసంగి ప్రోవుము ప్రయత్నముచే, నిదె బంధుధర్మమౌ.

15

అవతారిక : ఈశ్వరుఁడు తన్నుపేక్షించునేమో యని యాశంకించి యట్లు కాకుండుటకుఁ జెప్పుచున్నారు,

శ్లో. ఉపేక్షా నోచే త్కిం న హరసి భవద్ధ్యాన విముఖాం
దురాశా భూయిష్ఠాం విధి లిపి, మశక్తో యది భవాన్.
శిర స్త ద్వైధాత్రం ననఖలు సువృత్తం పశుపతే
కథం వా నిర్యత్నం కర నఖ ముఖేనైవ లులితమ్ ?

టీక : పశుపతే = సకలలోకాధీశ్వరా !, ఉపేక్షా నో చేత్ = (నన్ను రక్షించుటయందు నీ కుపేక్షకలదేమో) అట్లుపేక్ష లేనిచో, దురాశాభూయిష్ఠాం = దుష్టములైన కోరికలతో నిండినదియు. భవద్ధ్యన విముఖాం = నీధ్యానమునుండి పరాఙ్ముఖమైనదియు- విధి లిపిం = (నా నుదుటఁగల) బ్రహ్మవ్రాఁతను, కిం పరిహరసి = ఏల తుడిచివేయవు ?, భవాన్ = నీవు, అశక్తః యది = అశక్తుఁడ వేని, ననఖలు = గోటితోఁ ద్రుంప నలవిగాని, తత్ = ఆ, సువృత్తం = మిక్కిలి దృఢమైన, వైధాత్రం = విధాతృసంబంధమైన, శిరః = అయిదవ శిరస్సును- నిర్యత్నం = అప్రయత్నముగా, కర నఖ ముఖే నైవ = చేతిగోటి కొనచేతనే, కథం వా = ఎట్లు లులితం = త్రుంచివేయఁబడినది?

తాత్పర్యము: పశుపతీ ! దురాశలకును, భవద్ధ్యాన విముఖతకును సూచకముగా నా నుదుట బ్రహ్మవ్రాసిన వ్రాఁత నుపేక్షింపక తుడిచివేయుము, ఆ పని నాచేతఁ గాదని నీవు తప్పించుకొనలేవు. ఆ బ్రహ్మదేవుని యైదవతలను నీవు గోటికొనచేతనే త్రుంచితివి గదా !

ఉ. హూనవుగా నుపేక్షమెయి భూతపతీ! హరియింపవే భవ
ద్ధ్యాన పరాఙ్ముఖమ్ముగను దురాశల పుట్టియునైన బ్రహ్మబ్రాల్,
దానికి నోపవే, సుదృఢ తద్విధిశీర్ష మయత్న సిద్ధిగా
లూనముఁ జేసి తె టనఖలున్ గయిగోరికొనన్ మహేశ్వరా!

16

అవతారిక: దీనజనరక్షకుఁడవైన నీ కటాక్షమునకు భక్తుఁడు పాత్రుఁడగుటకు బ్రహ్మ వాని నుదుట దైన్యరేఖలు వ్రాయుచున్నాఁడు. నీ వాతని పంచమ శిరస్సును త్రుంచితివి. దానితోపాటు తక్కిన నాలుగు తలలను మాత్రము త్రుంపకుము. అతనిని దీర్ఘాయుష్మంతునిగా నుండనిమ్మని వేఁడుకొనుచున్నారు.

శ్లో. విరిఞ్చి ర్దీర్ఘాయు ర్భవతు భవతా త త్పర శిర
శ్చతుష్కం సంరక్ష్యం స ఖలు భువి దైన్యం లిఖితవాన్,
విచారః కో వా మాం విశద కృపయా పాతి శివ తే
కటాక్షవ్యాపార స్స్వయమపి చ దీనావనపరః.

టీక: విశద = నిర్మల స్వరూపుఁడవైన, శివ = ఓయి శివుఁడా!, విరిఞ్చిః = బ్రహ్మ, దీర్ఘాయుః = చిరాయుష్మంతుఁడు, భవతు = అగుఁగాక!, భవతా = నీచేత, తత్పర శిరశ్చతుష్కం = అతని తక్కిన శిరశ్చతుష్టయమును, సంరక్ష్యం = రక్షింపఁదగినది, సః = ఆ బ్రహ్మ, భువి = భూలోకమందు, దైన్యం = దీనత్వమును, లిఖితవాన్ ఖలు = (నుదుట) వ్రాసెను గదా!, దీనావనపరః = దీనరక్షణమందాసక్తి గల, తే = నీయొక్క, కటాక్షవ్యాపారః = క్రీఁగంటి చూపుల ప్రసారము, స్వయమపి = తనంతఁదానే, కృపయా = దయతో, పాతి = రక్షించుచున్నది, విచారః = దైన్యమును వ్రాయుటవలని విచారము, కో వా = ఏమున్నది? (ఏమియు లేదనుట)

తాత్పర్యము: ఓయి శివా! బ్రహ్మ మా నుదుట దైన్యమును వ్రాయుచున్నాఁడు. దానిచే దీనజన పోషకమగు నీ కటాక్షమునకుఁ బాత్రులమయి మే ముపకారమునే పొందుచున్నాము. అందుచే మాకు విచారములేదు. పాప మిఁక నాతని తక్కిన నాలుగు తలలను మాత్రము ఛేదింపకుము. ఆ బ్రహ్మ దీర్ఘాయుష్మంతుఁడై యుండుఁగాక.

చ. నలువ చిరాయు వౌత మదనద్విష ! యాతని తక్కు నాల్గుమో
ములఁ బరిరక్షితవ్యములు; భూమిని దైన్య మతండు వ్రాసెనేన్
దలఁపఁగఁ జింత లేదు విశదా ! భవదీయ కృపా కటాక్షముల్
వలఁతులు గావె దీనజనపాలనకార్యమునన్ స్వయమ్ముగన్?

17

అ వ తా రి క : నీ పాదాబ్జములను దర్శింపనిదే యెదురుగా నీ కటాక్షము నాపైఁ బ్రసరింపనేరదు. అదియును విఘటక సామగ్రి బలమువలన దుర్లభముగా నున్నదని చెప్పుచున్నారు.

శ్లో. ఫలాద్వా పుణ్యానాం మయి కరుణయా వా త్వయి విభో
ప్రసన్నేఽపి స్వామిన్ భవదమల పాదాబ్జయుగళమ్,
కథం పశ్యేయం మాం స్థగయతి నమస్సమ్భ్రమజుషాం
నిలిమ్పానాం శ్రేణి ర్నిజ కనకమాణిక్య మకుటైః.

టీ క : విభో = సర్వవ్యాపకుఁడవైన, స్వామిన్ = ఓ పరమేశ్వరా !. (మమ = నాయొక్క), పుణ్యానాం = పుణ్యములయొక్క. ఫలాద్వా = ఫలమువలననో, మయి = నాయందు, కరుణయా వా = దయచేతనో, త్వయి = నీవు, ప్రసన్నేఽపి = ప్రసన్నుఁడవయ్యును, భవ దమల పాదాబ్జయుగళం = నిర్మలమైన నీ పాదపద్మద్వయమును, కథం = ఎట్లు, పశ్యేయం = చూతును. నమస్సమ్భ్రమజుషాం = నమస్కరించుటకు వేగిరపడుచున్న. నిలిమ్పానాం = దేవతల యొక్క, శ్రేణిః = వరుస, నిజ కనక మాణిక్య మకుటైః = రత్నములు పొదిగిన తమ బంగారు కిరీటములతో, మాం = నన్ను, స్థగయతి = అడ్డగించుచున్నది.

తా త్ప ర్య ము : సర్వవ్యాపకుఁడవైన యో స్వామీ ! నా పుణ్యమువలననో, నీ దయచేతనో, నీవు ప్రసన్నుఁడ వయ్యును, నీ పాదపద్మ దర్శన మగుట యెట్లు? నీకు నమస్కరించుటకు సంభ్రమించు దేవతలు గుంపులయి తమ రత్నస్థగితసువర్ణ కిరీటములను నీ పాదములందు మోపుచు నా కడ్డమగుచున్నారు.

మ. మును నేఁ జేసిన పుణ్యకర్మము ఫలంబో, నాపయిం గల్గు నీ
యనుకంపాతిశయంబొ నీ వెదుటఁ బ్రత్యక్షంబుగా నెట్లు నేఁ
గనుఁగోఁ జాలుదుఁ ద్వత్పదాంబురుహ యుగ్మంబున్ నమస్సంభ్రమం
బున గీర్వాణ సువర్ణ రత్నమకుటంబుల్ గప్పుచుండన్ విభూ!

18

అవతారిక మోక్షప్రదాత యగు నొక్క పరమశివుని వలననే నిజ హృదయగ్రంథి వీడవలయునని కోరుచున్నారు.

శ్లో. త్వ మేకో లోకానాం పరమఫలదో దివ్యపదవీం
వహన్త స్త్వన్మూలాం పునరపి భజన్తే హరిముఖాః,
కియద్వా దాక్షిణ్యం తవ శివ మదాశా చ కియతీ
కదా వా మద్రక్షాం వహసి కరుణాపూరిత దృశా.

టీక : శివ = సుఖస్వరూపుఁడ వగు నో యీశ్వరా!, త్వం = నీవు, ఏకః = ఒక్కఁడవే, లోకానాం = జనులకు, పరమ ఫలదః = మోక్షఫలము నిచ్చువాఁడవు, హరిముఖాః = విష్ణువు మున్నగువారు, త్వ న్మూలాం = నీవే మూల కారణముగాఁ గలిగిన, దివ్యపదవీం = అమానుషమైన వైకుంఠాదిస్థానమును, వహన్తః = పొందుచున్నవారై, పునరపి = మరల (తృప్తిలేక యుత్తమ ఫల ప్రాప్తికై), భజన్తే = (నిన్నే) సేవించుచున్నారు, తవ = నీయొక్క, దాక్షిణ్యం = భక్తాభిప్రాయ వర్తనము, కియద్వా = ఎంతటిది? (అపరిమిత మనుట). మదాశా చ = నాయొక్క ఆశయు, కియతీ = ఎంతటిది? యెఱుఁగ ననుట), మద్రక్షాం = అహంకారమునుండి నా రక్షణమును, కరుణాపూరిత దృశా = దయతో నిండినచూపుతో, కదా = ఎన్నఁడు, వహసి = వహింతువు.

తాత్పర్యము: సుఖస్వరూపుఁడవైన యో యీశ్వరా! జనులకు మోక్షము నిచ్చువాఁడవు నీవొక్కఁడవే. విష్ణ్వాదులు నీదయచేతనే వైకుంఠాది దివ్యపదమును బొందిరి, అయినను దనివిసనక నీవలన నున్నతతరపదములను గోరుచు నిన్ను భజించు చుందురు. భక్తులయెడ నీకుఁగల దయ యెంతటిది? నా యాశయు నెంతటిదని చెప్పుదును? దేవా! కరుణాపూరిత కటాక్షవీక్షణములతో నహంకారమునుండి న న్నెప్పుడు రక్షింతువు?

ఉ. ఈ వొకరుండవే జనుల కిత్తువు మోక్షఫల మ్మమోఘమున్
దేవ! వహించి నీకతన దివ్యపదమ్మును విష్ణుముఖ్యు లెం
తే వినుతింత్రు వెండి నిను. నీకృప యెంతటి? దస్మదాశయున్
గేవలమే? ననున్ గరుణ నిండినచూపుల నెప్డు ప్రోతువో?

19

అవతారిక: తన భక్తుఁడుగదా యని యీశ్వరుఁడు బ్రహ్మకొనర్చిన యుపకారమును బర్యాలోచించి యీశ్వరభజనముచేఁ దాము ను గృతార్థులమైతిమని నిశ్చయించుచున్నారు.

శ్లో. దురాశాభూయిష్ఠే దురధిప గృహద్వార ఘటకే
దురన్తే సంసారే దురితనిలయే దుఃఖజనకే,
మదాయాసం కిం న వ్యపనయసి కస్యోపకృతయే
వ దేయం ప్రీతి శ్చేత్తవ శివ కృతార్థాః ఖలు వయమ్.

టీక: దురాశా భూయిష్ఠే = దురాశచే నిండినదియు, దురధిప గృహ ద్వార ఘటకే = దుష్టప్రభువుల మందిరద్వారములకుఁ జేర్చునదియు, దురన్తే = దురవసానము గలదియు, దురితనిలయే = పాపముల కునికిపట్టయినదియు, దుఃఖజనకే = దుఃఖోత్పాదకమైనదియు నగు, సంసారే = జననమరణాది ప్రవాహరూపమైన సంసారమందు. మదాయాసం = నా పరిభ్రమణరూప ప్రయత్నమును, కస్య = బ్రహ్మదేవునియొక్క, ఉపకృతయే = ఉపకారముకొఱకు, న వ్యపనయసి కిం = పోఁగొట్టకుంటివా యేమి?, వద = చెప్పుము, ఇయం = (భక్తోపకృతివిషయకమైన) ఈ, ప్రీతిః = ప్రేమము, శివ = ఓయి శివా!, తవ = నీకు, చేత్ = ఉన్నచో, వయ మపి = (నీ భక్తులమగు) మేము గూడ, కృతార్థాః ఖలు = కృతార్థులమే గదా.

తాత్పర్యము: శివా! దురాశలతో నిండినదియు, దుష్టప్రభువుల మందిర ద్వారములను బొందించునదియు, దురంతమైనదియు, దురితములకు నిలయమైనదియు, దుఃఖోత్పాదక మయినదియు నగు సంసారమందుఁ గొట్టుకొనుచున్న నా పరిశ్రమమును నీ భక్తుఁడైన బ్రహ్మమీఁది ప్రీతిచేఁ బోగొట్టకుంటివా యేమి? భక్తులయెడ నీకంతటి వాత్సల్య మున్నచో, నీ భక్తులమగు మేమును గృతార్థుల మగుదుముగదా!

మ. దురితావాసము, దుఃఖ సంజనకమున్, దుర్లోభభూయిష్ఠమున్,
దురిత ప్రాపకమున్, దురంతమును నౌ దుర్వార సంసార మం
దరుగంజేయ వదేమి నా శ్రమము నాహా! యేరి మేల్గోరియో,
హర! యీదృక్కృప యున్న నీకుఁ, బరమాహ్లాదం బగున్ మాకునున్.

20

అవతారిక : ఈ రీతిగా నీశ్వరప్రీతిని గోరికొని చపలత్వమును బరిహరించి నా చిత్తమును నీవశము చేసికొనుమని యీశ్వరుని వేఁడికొనుచున్నారు.

శ్లో. సదా మోహాటవ్యాం చరతి యువతీనాం కుచగిరౌ
నట త్యాశాశాఖా స్వటతి ఝడితి స్వైర మభితః,
కపాలిన్ భిక్షో మే హృదయకపి మత్యన్తచపలం
దృఢం భక్త్యా బద్ధ్వా శివ భవదధీనం కురు విభో.

టీక : కపాలిన్ = బ్రహ్మకపాలమును ధరించినవాఁడవును, విభో =సర్వవ్యాపకుఁడవును, శివ = ఆనందస్వరూపుఁడవును, భిక్షో = ఆదిభిక్షుకుఁడవు నగు నో దేవా!, సదా = ఎల్లప్పుడును. మోహాటవ్యాం = సంసారేచ్ఛయనెడి యడవియందు, చరతి = సంచరించుచున్నది, యువతీనాం = జవరాండ్రయొక్క, కుచగిరౌ = స్తన ద్వయమనియెడు కొండయందు, నటతి= క్రీడించుచున్నది. ఆశాశాఖాసు=భార్యాపుత్రుల యందలి ప్రేమ మను కొమ్మలయందు, అటతి = తిరుగుచున్నది, ఝడితి = శీఘ్రముగా, అభితః = నలువంకలకును, స్వైరం = స్వేచ్ఛగా, అటతి = పరుగులిడుచున్నది, అత్యన్త చపలం = మిక్కిలి చంచలమైన, మే = నాయొక్క, హృదయకపిం = మనస్సనెడు కోఁతిని, దృఢం = గట్టిగా, భక్త్యా = భక్తియనెడు త్రాటితో, బద్ధ్వా = కట్టి, భవదధీనం = నీవశము, కురు = చేసికొనుము

తాత్పర్యము : ఓయి కపాలీ! ఆదిభిక్షూ! విభూ! మిక్కిలి చపలమైన నా మనస్సనెడు కోఁతి సంసారారణ్యమందుఁ దిరుగుచున్నది, యువతుల కుచగిరుల యందుఁ గ్రీడించుచున్నది, ఇచ్చవచ్చిన ట్లిటునటు శీఘ్రముగా నాశలనెడి కొమ్మలందు దుముకుచున్నది, దానిని భక్తియను త్రాటితో గట్టిగాఁ గట్టి శివా! నీవశము చేసికొమ్ము.

ఉ. నా యెదకోఁతి మోహవిపినమ్మునఁ ద్రిమ్మరు నెప్డు; బాయపుం
దోయలి గుబ్బగుబ్బలుల దూఁకును; గోర్కెలకొమ్మలందు వా
లాయముఁ దిర్గుఁ; దద్ద చపలంబగు దానిని గట్టి బత్తిచే
నోయి కపాలి! భిక్షుకుఁడ! యుష్మదధీనముఁ జేసికోఁగదే!

21

అ వ తా రి క : ఈ విధముగా మనస్సు నీశ్వరాధీనముచేసి, యిప్పుడు దానిని గుటీరముగాఁజెప్పి, యందు నివసింపుమని శివుని వేఁడికొనుచున్నారు.

శ్లో. ధృతి స్తమ్భాధారాం దృఢగుణ నిబద్ధాం సగమనాం
విచిత్రాం పద్మాఢ్యాం ప్రతిదివస సన్మార్గ ఘటితామ్,
స్మరారే మచ్చేతస్స్ఫుట పటకుటీం ప్రాప్య విశదాం
జయ స్వామిన్ శక్త్యాసహ శివ గణై స్సేవిత విభో.

టీ క : స్మరారే = మన్మథునకు శత్రువైనవాఁడా, స్వామిన్ = లోకముల నన్నిటిని వశపఱుచుకొనినవాఁడా, గణైః = స్వరూపమును విమర్శించు గణములచేత, సేవిత = సేవింపఁబడువాఁడా, విభో = ఓ సర్వవ్యాపకుఁడా, శివ = అఖండానంద స్వరూపుఁడవగు నో పరమేశ్వరా, ధృతి = ధైర్య మనెడు, స్తమ్భ = కంబము, ఆధారాం = ఆధారముగాఁ గలదియు, దృఢ = దృఢమైన, గుణ = గుణత్రయ కార్యభూతములైన దేహాదులనెడు త్రాళ్ళతో, నిబద్ధాం = నిలుపఁ బడినదియు, సగమనాం = ఎచ్చటికి వలయునన్నను బోవునదియు, విచిత్రాం = వివిధ దుర్వాసనలనెడు రంగులు గలదియు, పద్మాఢ్యాం = లక్ష్మీయుక్తమును, పద్మములవంటి చిత్తవృత్తులతో నొప్పునదియు, ప్రతి దివస = ప్రతి దినమందును, సన్మార్గ ఘటితాం = బ్రహ్మవిచారమందుఁ గూర్పఁబడినదియు, రాజమార్గమం దమర్పఁబడినదియు, విశదాం = నిర్మలమయినదియు, మచ్చేతః = నా మనస్సనెడు, స్ఫుట పటకుటీం = స్ఫుటమైనడేరాను, ప్రాప్య = పొంది, శక్త్యా సహ = పార్వతీదేవితోఁగూడ, జయ = సర్వోత్కర్షతో నుండుము.

తా త్ప ర్య ము : కామజేతవును, సర్వ స్వతంత్రుఁడవును, సర్వవ్యాపకుఁడవును, పరమానంద స్వరూపుఁడవును నగు నో యీశ్వరా! నా మన స్సొక గుడారము

వంటిది. గుడార మొక స్తంభముపై నిలిచియుండునట్లే నా చిత్తము విషయనిత్యత్వావ ధారణముపై నిలిచియున్నది. గుడారము త్రాళ్ళతోఁగట్టఁబడినట్లే, నా చిత్తము సత్త్వ రజస్తమో గుణరూప దేహాదులతో నిలుపఁబడియున్నది. గుడారమును వలయుచోటికిఁ దీసికొని పోవచ్చును. అట్లే చిత్తమును స్థిరముగా నుండక యటునిటు పోవుచుండును. గుడారము పెక్కు రంగులను, బద్మములవంటి చిత్రములను గలిగి రాజమార్గములం దమర్పఁబడును. అట్లే చిత్తమును నానావిధములగు జన్మాంతర దుర్వాసనలతోఁ గూడి నిరతము సంపదను గోరుచు బ్రహ్మవిచారమందు ఘటింపఁబడియున్నది. ఇట్టి నా చిత్తకుటీరమందు శక్తిసహితుఁడవై నివసించియుండుము.

గీ. ధైర్యమను పెనుకంబ మాధారముగను,
దృఢగుణ నిబద్ధమై విచిత్రితము నగుచుఁ
బ్రతిదివస సత్పథప్రతిష్ఠితము, విశద
మగుచు నగమన మౌచుఁ బద్మాఢ్య మైన
మన్మన స్స్ఫుట పటకుటి మాతఁగూడి
యధివసింపఁగదయ్య ! శివా ! గణాలి
సేవితుఁడ ! విభూ ! నా స్వామి ! జితసుమాస్త్ర !

22

అవతారిక: ప్రయత్న విశేషముచే బ్రహ్మవిచారమందు ఘటింపఁబడిన దయ్యుఁ జోరునివలెఁ బ్రలోభాదులచే ధనాహరణ పరతంత్రమైన చిత్తము నోర్వక తద్దోషపరిహారార్థము నీ వశము చేసికొమ్మని శివుని వేఁడికొనుచున్నారు.

శ్లో. ప్రలోభాద్యై రర్థాహరణ పరతన్త్రో ధనిగృహే
ప్రవేశోద్యుక్త స్సన్ భ్రమతి బహుధా తస్కరపతే,
ఇమం చేతశ్చోరం కథ మిహ సహే శఙ్కర విభో
తవాధీనం కృత్వా మయి నిరపరాధే కురు కృపామ్.

టీక: తస్కరపతే = దొంగలతేఁడా, శఙ్కర = భక్త సుఖదాయకుఁడా. విభో = ప్రభూ, ప్రలోభాద్యైః = వశీకరణాది దురుపాయములచేత, అర్థాహరణ = ధనాకర్షణమందు, పరతన్త్రః = ఆసక్తిగలవాఁడై, చేతశ్చోరః = మన స్సనియెడు

దొంగ, ధనిగృహే = ధనవంతుని యింటియందు, ప్రవేశోద్యుక్తస్సన్ = ప్రవేశింప నుద్యుక్తుఁడగుచు, బహుధా = పెక్కు విధములుగా, భ్రమతి = తిరుగుచున్నాఁడు, ఇమం = ఈ, చేతశ్చోరం = మనస్సనెడు దొంగను, కథం = ఎట్లు, సహే = సహింతును?, ఇహ = ఇప్పుడు, తవ + అధీనం కృత్వా = నీవశము చేసికొని, నిరపరాధే = అపరాధములేని, మయి = నాయందు, కృపాం = దయను, కురు = చేయుము (చూపుము)

తాత్పర్యము ; ఓయి శంకరా ! స్వామీ ! లేనిపోని కల్లబొల్లి మాటలు చెప్పి, ధనవంతుల చిత్తములను వశపఱుచుకొనుట మొదలగు దురుపాయములను బన్ని ధనము నాకర్షించుటకై ధనికులయిండ్లఁ దూఱుచుఁ దిరుగుచున్న యీ నా మనస్సనెడు చోరుని నే నెట్లు సహింపఁగలను ? నీవు తస్కరపతివి గావున నీ కప్పగింతును. నీ వశము చేసికొని నిరపరాధినగు నన్ను దయఁజూడుము.

శా. చోరాగ్రేసర ! యీశ ! నాదు మన మన్ చోరుండు లోభాదులన్
దా రాయాహరణార్థమై ధనికులిండ్లన్ దూఱఁగా నెంచి సం
చారంబుం బొనరించుఁ బల్విధములన్; నైరింతు నె ట్లిప్పు డా
చోరున్? నీవశుఁజేసికోఁగదె ! యదోషున్ నన్ గృపం జూడవే !

23

అవతారిక : శివపూజకు ఫలములుగా బ్రహ్మత్వ విష్ణుత్వములుగూడ దోషయుక్తములే కావున నవి వలదని నిర్దుష్టమైన నిత్యసుఖమును గోరుచున్నారు.

శ్లో. కరోమి త్వత్పూజాం సపది సుఖదో మే భవ విభో
విధిత్వం విష్ణుత్వం దిశసి ఖలు తస్యాః ఫల మితి,
పునశ్చ త్వాం ద్రష్టుం దివి భువి వహన్ పక్షిమృగతా
మదృష్ట్వా తత్ఖేదం కథ మిహ సహే శఙ్కర విభో,

టీక : విభో = ఓ మహాప్రభూ ! త్వ త్పూజాం = నీ పూజను, కరోమి = చేయుదును, సపది = వెంటనే, శఙ్కర = సుఖకరా !, మే = నా కొఱకు, సుఖదః = నిత్య సుఖము నిచ్చువాఁడవు, భవ = అగుము. తస్యాః = ఆ నా పూజకు, విధిత్వం = బ్రహ్మత్వము, విష్ణుత్వం = విష్ణుత్వము, ఫల మితి = ఫలమని, దిశసి ఖలు =

ఇత్తువుకదా ః పునశ్చ = మరల. దివి = ఆకాశమునందును, భువిచ = భూమి యందును, త్వాం = నిన్ను, ద్రష్టుం = చూచుటకు. పక్షి మృగతాం = పక్షి (హంస) రూపమునుగాని. మృగ (వరాహ) రూపమునుగాని. వహన్ = ధరించుచు, అదృష్ట్వా = చూడఁజాలక, తత్ఖేదం = పక్షి మృగములుగాఁ బుట్టుటవలని దుఃఖమును, కథం = ఎట్లు. సహే = సహింతును ?

తాత్పర్యము : ఓయి ప్రభూ ! నిన్నారాధింతును. పూజా ఫలముగా నాకు మోక్షానంద మొసఁగుము. అంతేకాని దానికి ఫలమని బ్రహ్మత్వమో విష్ణుత్వమో మాత్ర మొసఁగకుము. అక్కడనుండి హంసగానో. వరాహముగానో పుట్టి నీ శిరస్సును, నీపాదములను గనుఁగొనుటకు నాకాశమునందును. భూమియందును దిరిగి శ్రమపడ లేను. తుదకు నిన్నుఁ గనుఁగొనలేక క్షుద్రజన్మమువలని యవమానమును సహింపఁ జాలను, కావున బ్రహ్మత్వ విష్ణుత్వములకన్న మిన్నయగు సాయుజ్యముక్తి యను పరమానందమును దయచేయుము.

మ. నినుఁ బూజింతును మోక్షదాత వవువే. నీ విత్తొ తత్సిద్ధి గాఁ
గను బ్రహ్మత్వము విష్ణుతన్, మగుడ నిన్ గన్గో ఖగంబన్ మృగం
బను నై నింగిని నేలనుం దిరిగి యబ్బన్ లేక నీదర్శనం
బును-నేనెట్లు సహింపనోపుదును శంభూ : యామహాఖేదముల్ ?

24

అవతారిక : శుద్ధసాయుజ్యమును గోరి, తత్సాధనభూతమైన సపరిజన సాంబ సన్నిధివాసము గలుగు టెప్పుడెప్పుడాయని వేగిరపాటును జూపుచున్నారు.

శ్లో. కదా వా కైలాసే కనక మణి సౌధే సహ గణై
ర్వసన్ శమ్భో రగ్రే స్ఫుట ఘటిత మూర్ధాఞ్జలిపుటః,
విభో సామ్బ స్వామిన్ పరమశివ పా హీతి విగదన్
విధాతౄణాంకల్పాన్ క్షణ మివ వినేష్యామి సుఖతః.

టీక : కైలాసే = శివ నివాస స్థానమగు కైలాసమందు, కనకమణిసౌధే = స్వర్ణ రత్నమయ భవనమందు, గణైస్సహ = ప్రమథగణములతోఁ గూడ,

శమ్భోః = శివునియొక్క, అగ్రే = ఎదుట, వసన్ = ఉన్నవాఁడనై. స్ఫు....ట-స్ఫుట ఘటిత = స్ఫుటముగాఁ గూర్పఁబడిన, మూర్ధాఞ్జలిపుటః = శిరస్సునందలి యంజలిబంధము గలవాఁడ నగుచు, విభో = ప్రభూ! స్వామిన్ = స్వామీ! పరమ శివ = పరమశివా! పాహి = రక్షింపుము, ఇతి = అని, నిగదన్ = పలుకుచున్నవాఁడనై, సుఖతః = అట్టి యానందానుభూతి వలన, విధాతౄణాం కల్పాన్ = బ్రహ్మకల్పములను, క్షణ మివ = క్షణమాత్రముగా, కదా వా = ఎప్పుడు, వినేష్యామి = గడపుదునో!

తాత్పర్యము : శివస్థానమగు కైలాసమునుజేరి ప్రమథగణములను గూడి పరమేశ్వరు నెదుట 'హే విభో! హే సాంబ! హే స్వామిన్, హే పరమ శివ! పాహి పాహి' యని పలుకుచు సంతోషముతో బ్రహ్మకల్పములను క్షణములుగా నెప్పుడు గడపుదునో కదా!

ఉ. ఇమ్మగు వెండికొండపయి నింపులు గుల్కు సువర్ణరత్న సౌ
ధమ్మున నుత్తమాంగ ఘటితమ్మగు నంజలితో మహేశ్వరా
గ్రమ్మున నిల్చి నేను గణరాజిని గూడి 'మహేశ! పాహి' యం
చు మ్మదమారఁగాఁ బలుకుచున్ గమలాసనకల్పముల్ నిమే
షమ్ముగ నెంచుచుం గడపు సౌఖ్యముఁ గాంచుట యెన్నఁడో కదా!

25

అవతారిక : మఱియొక విధముగా నా శివునే స్తుతించుచున్నారు.

శ్లో. స్తవైః బ్రహ్మాదీనాం జయజయవచోభి ర్నియమినాం
గణానాం కేళీభి ర్మదకల మహోక్షస్య కకుది,
స్థితం నీలగ్రీవం త్రిణయన ముమాశ్లిష్టవపుషం
కదా త్వాం పశ్యేయం కరధృతమృగం ఖణ్డపరశుమ్.

టీక : బ్రహ్మాదీనాం = బ్రహ్మ మొదలగువారియొక్క, స్తవైః = స్తుతులతోను, నియమినాం = నియమవంతులగు మహర్షులయొక్క, జయజయ వచోభిః = జయజయ వాక్కులతోను. గణానాం = ప్రమథగణములయొక్క, కేళిభిః = క్రీడలతోను, మదకల మహోక్షస్య = హర్షాతిశయముచే సొంపుగానున్న వృషభముయొక్క

కకుది = మూఁపురమునందు, స్థితం = ఉన్నవాఁడును. నీలగ్రీవం = నల్లనికంఠము గలవాఁడును, త్రిణయనం = మూఁడుకన్నులు గలవాఁడును, ఉమాశ్లిష్టవపుషం = పార్వతీదేవిచేతఁ గౌఁగిలించుకొనఁబడిన శరీరము గలవాఁడును, కర ధృత మృగం= చేతితోఁ బట్టుకొనఁబడిన లేడి గలవాఁడును, ఖణ్డ పరశుం = ఖండమైన గండ్ర గొడ్డలి గలవాఁడును నగు, త్వాం నిన్ను, కదా వా=ఎప్పుడు, పశ్యేయం = చూతును.

తాత్పర్యము: స్తోత్రపాఠములతో బ్రహ్మాదులును, జయజయ ధ్వానములతో మహర్షులును, గ్రీడలతోఁ బ్రమథగణములును గొలువఁ బార్వతీసమేతుఁడవై వృషభ వాహనముపై నాసీనుఁడవైన నిన్నుఁజూచు భాగ్యము నా కెన్నఁడు లభించునోగదా!

చ. వనజజ ముఖ్య దివ్యుల స్తవమ్ములతో, మునివర్గపున్ జయ
ధ్వనితతితో, గణావలి కృతమ్మగు కేళులతో వృషమ్ము మూఁ
పున నుపవిష్టుఁడైన యభవున్. గిరిజాపతి, నీలకంధరున్,
త్రిణయను. శంకరున్. బశుపతిన్ నినుఁ గాంచుట యెన్నఁడోకదా!

## 26

అవతారిక: ఆ పరమేశ్వరునే మఱియొక విధముగాఁ బ్రార్థించుచున్నారు.

శ్లో. కదా వా త్వాం దృష్ట్వా గిరిశ తవ భవ్యాఙ్ఘ్రి యుగళం
గృహీత్వా హస్తాభ్యాం శిరసి నయనే వక్షసి వహన్,
సమాశ్లిష్యాఘ్రాయ స్ఫుట జలజ గన్ధాన్ పరిమళా
నలభ్యాం బ్రహ్మాద్యై ర్ముద మనుభవిష్యామి హృదయే.

టీక: గిరిశ = పర్వతశాయివగు నో పరమేశ్వరా! త్వాం = నిన్ను, దృష్ట్వా=చూచి, తవ = నీయొక్క, భవ్యాఙ్ఘ్రియుగళం = శుభప్రదమైన యడుగుదోయిని, హస్తాభ్యాం = చేతులతో, గృహీత్వా = పట్టుకొని, శిరసి = శిరస్సునందును, నయనే = కన్నులందును, వక్షసి = వక్షమునందును, వహన్ = వహించుచున్నవాఁడనై, సమాశ్లిష్య = కౌఁగిలించుకొని, స్ఫుట జలజ గన్ధాన్ = వికసించిన పద్మములయొక్క సుగంధమువంటి సుగంధముగల, పరిమళాన్ = పరిమళములను, ఆఘ్రాయ = మూర్కొని, బ్రహ్మాద్యైః = బ్రహ్మాదులచేత, అలభ్యాం = పొంద

శక్యముగాని, ముదం = సంతోషమును, హృదయే = హృదయమునందు, కదా వా = ఎప్పుడు, అనుభవిష్యామి = అనుభవింతును?

తాత్పర్యము ; గిరిశా ! నిన్నుఁజూచి, నీ పాదద్వయమును జేతులతోఁ బట్టి శిరస్సునందును, గన్నులందును, వక్షమునందును జేర్చి కౌఁగిలించుకొని యందలి పద్మపరిమళముల నాఘ్రాణించి బ్రహ్మాదులకును లభింపని యానందము నెప్పు డనుభవింతునోకదా!

చ. పరమశివా! నినుం గని భవచ్ఛుభ పాదయుగమ్ము నేఁ
గరములఁ బట్టి మూర్ధమునఁ గన్నుల వక్షమునన్ వహించుచున్
వరద! కవుంగిలించి స్ఫుట పద్మ సుగంధము మూరుకొంచుఁ దా
మరసజ ముఖ్యులుం గనని మానసమోదము నెప్డు కందునో!

27

అవతారిక : సర్వ సంపూర్ణుఁడగు పరమేశ్వరున కీఁదగిన దొక్కటియు లేనందునఁ దమ మనస్సునే యర్పించుచున్నారు.

శ్లో. కరస్థే హేమాద్రౌ గిరిశ నికటస్థే ధనపతౌ
గృహస్థే స్వర్భూజామరసురభి చిన్తామణి గణే,
శిరస్థే శీతాంశౌ చరణయుగళస్థేఽఖిల శుభే
క మర్థం దాస్యేఽహం భవతు భవదర్థం మమ మనః.

టీక : గిరిశ = పర్వతశాయివగు నో యీశ్వరా! హేమాద్రౌ = మేరు పర్వతము (బంగారుకొండ), కరస్థే = చేతనుండఁగా, ధనపతౌ = కుబేరుఁడు (ధనవంతుఁడు), నికటస్థే = దగ్గఱనుండఁగా, స్వ...ణే - స్వర్భూజ = కల్ప వృక్షములయొక్కయు, అమరసురభి = కామధేనువు యొక్కయు, చిన్తామణి చింతామణుల యొక్కయు, గణే = సమూహము, గృహస్థే = ఇంటనుండఁగా, శీతాంశౌ = చంద్రుఁడు, శిరస్థే = శిరస్సున నుండఁగా, అఖిల శుభే = ఎల్ల శుభ మును, చరణ యుగళస్థే = పాదద్వయమందుండఁగా, కం = ఏ, అర్థం = ఇష్టార్థ మును, అహం = నేను, దాస్యే = ఇత్తును, మమ = నాయొక్క, మనః = మనస్సు, భవదర్థం = నీకొఱకు, భవతు = అగుఁగాక.

తాత్పర్యము: పర్వతశాయివగు నో పరమేశ్వరా! బంగారుకొండ ధనస్సుగా నీచేత నున్నది. మహాధనవంతుఁడగు కుబేరుఁడు మిత్రుఁడై నీ సమీపమున నున్నాఁడు. కోరినంతనే యెల్లకోరికల నిచ్చు కల్పవృక్షము, కామధేనువు, చింతామణి నీ యధీనములై నీ యింట నున్నవి. ఆహ్లాదకరుఁడగు చంద్రుఁడు భూషణముగా నీ శిరమున నున్నాఁడు. నీ పాదములు సకల శుభములకు నాలవాలములు. శివా! నీకు నే నొసఁగఁదగిన దొక్కటియుఁ గానరాదు. కావున నా చిత్తమునే నీ కర్పించెదను స్వీకరింపుము.

చ. కనకధరాధరాధిపతి కైవసమై తగ, నంతికస్థుఁడై
ధనపతి యుండ, నాకతరు దైవతధేను సుపర్వరత్నముల్
తనరఁగ నింటఁ, జంద్రుఁడు తలన్ వెలయన్, బదముల్ శుభాలికిన్
గనులుగ నింక నేమి యొసఁగంగల నీకు? మనంబె యిచ్చెదన్.

28

అవతారిక: వక్ష్యమాణ హేతువులచే వక్ష్యమాణ ఫలములు సిద్ధించుటచేఁ దాము ధన్యులమైతిమని యనుకొనుచున్నారు.

శ్లో. సారూప్యం తవ పూజనే శివ మహాదే వేతి సంకీర్తనే
సామీప్యం శివ భక్తి ధుర్య జనతా సాఙ్గత్య సమ్భాషణే,
సాలోక్యం చ చరాచరాత్మక తను ధ్యానే భవానీపతే
సాయుజ్యం మమ సిద్ధ మత్ర భవతి స్వామిన్ కృతార్థోఽస్మ్యహమ్.

టీక: భవానీ పతే = ఓయి పార్వతీ పతీ, స్వామిన్ = సర్వాధ్యక్షుఁడా! తవ = నీయొక్క, పూజనే = పూజయందు, సారూప్యం = సమాన రూపతా సిద్ధియు, శివ మహాదే వేతి సంకీర్తనే = శివా, మహాదేవా యని కీర్తించినప్పుడు, సామీప్యం = సమీప వర్తిత్వమును, శివ....ణే - శివభక్తిధుర్య = ఈశ్వర భక్తి యను భారము వహించునట్టి, జనతా = జనసమూహముయొక్క, సాఙ్గత్య సమ్భాషణే = సహవాస సల్లాపములయందు, సాలోక్యం = సమానలోక వర్తిత్వమును, చ....నే - చరచరాత్మక = జంగమ స్థావర రూపమైన, తను = మూర్తి యొక్క, ధ్యానే = ధ్యానమునందు, సాయుజ్యం = సహాయుక్తత్వమును, మమ=

నాకు, అత్ర = ఈ పుట్టువునందు, సిద్ధం భవతి = సిద్ధించుచున్నది. (అతః = కావున), అహం = నేను, కృతార్థః = ధన్యుఁడను, అస్మి = అగుచున్నాను.

తాత్పర్యము : స్వామీ! పార్వతీ పతీ! నీ పూజయందు సారూప్యమును, నీ నామసంకీర్తనమునందు సామీప్యమును, నీ భక్తులతోడి సహవాస సల్లాపముల యందు సాలోక్యమును, స్థావర జంగమాత్మకమైన నీ మూర్తిని ధ్యానించుటయందు సాయుజ్యమును నా కీ పుట్టువుననే సిద్ధించుచున్నవి. కావున నేను ధన్యుఁడనై తిని.

మ. భవదీ యావిరతార్చనా మహిమ దేవా! భర్గ! సారూప్యమున్,
శివ యన్ తావక నామకీర్తనమునన్ శ్రీకంఠ! సామీప్యమున్,
శివభక్తాగ్రణి సంగభాషణములన్ దేవేశ! సాలోక్యమున్
భవ! నీ స్థావర జంగమాత్మక తనుప్రాసక్తి సాయుజ్యమున్
శివ! యీ పుట్టువునంద నాకు లభియించెన్ నేను ధన్యాత్ముఁడన్.

## 29

అవతారిక : ప్రకారాంతమునఁ బ్రార్థించుచున్నారు.

శ్లో. త్వత్పాదామ్బుజ మర్చయామి పరమం త్వాం చిన్తయా మ్యన్వహం
త్వా మీశం శరణం వ్రజామి వచసా త్వామేవ యాచే విభో,
వీక్షాం మే దిశ చాక్షుషీం సకరుణాం దివ్యైశ్చిరం ప్రార్థితాం
శమ్భో లోకగురో మదీయ మనస స్సౌఖ్యోపదేశం కురు.

టీక : విభో = ఓయి సర్వ వ్యాపకుఁడా! శమ్భో = సుఖకరుఁడా!, పరమం = సర్వోత్కృష్టమైన, త్వ త్పాదామ్బుజం = నీ పాదపద్మమును, అర్చయామి = పూజించుచున్నాను, అన్వహం = ప్రతిదినమును, త్వాం = నిన్ను, చిన్తయామి = స్మరించుచున్నాను, ఈశం = జగత్కర్తవగు, త్వాం = నిన్ను, శరణం = జనన మరణ నివారకుఁడవైన దిక్కుగా, వ్రజామి = పొందుచున్నాను, వచసా = వాక్కుచేత, త్వా మేవ = నిన్నే, యాచే = ప్రార్థించుచున్నాను, దివ్యైః = దేవతలచేత, చిరం = తడవులనుండి, ప్రార్థితాం = ప్రార్థింపఁబడిన దియు, సకరుణాం = సదయ మయినదియు, చాక్షుషీం = నేత్ర సంబంధమైన, వీక్షాం = కటాక్షమును, మే = నాకు, దిశ = ఇమ్ము, లోకగురో = భక్తజనులకు

రహస్యార్థ ప్రకాశమును జేయువాఁడా!, మదీయ మనసః = నా మనస్సునకు, సౌఖ్యోపదేశం = బ్రహ్మోపదేశమును, కురు = చేయుము.

తాత్పర్యము : ఓయి సర్వవ్యాపకుఁడవైన శంకరా ! జగద్గురూ ! సర్వోత్కృష్టమైన నీ పాదపద్మమును బూజించుచున్నాను, అన్వహమును నిన్ను స్మరించుచున్నాను. సర్వదేవతా ప్రార్థనీయమైన నీ సదయ కటాక్షమును నా కనుగ్రహింపుము. వాక్కుచే నిన్నే యాచించుచున్నాను. జనన మరణ క్లేశనివారకుఁడ వగు నిన్ను శరణు చొచ్చుచున్నాను నా మనస్సునకు బ్రహ్మోపదేశమును జేయుము.

మ. భవదీయాంఘ్రులఁ గొల్చెదన్, బరము నిన్ భావింతు నశ్రాంతమున్,
శివు నిన్నున్ శరణందుఁ, బల్కులను యాచింతున్ విభూ! నిన్నె; యా
దివిజుల్ నిచ్చలుఁ గోరు చాక్షుషదయాదృష్టిన్ బ్రసాదింపు; మో
భవ ! నా కిమ్ము జగద్గురూ ! మదికి సద్బ్రహ్మోపదేశేంధిరన్.

30

అవతారిక : ఇటువంటి నిన్ను నే నిప్పటి స్థితిలో సేవింపఁజాలనని యనుచున్నారు.

శ్లో. వస్త్రోద్ధూతవిధౌ సహస్రకరతా పుష్పార్చనే విష్ణుతా
గన్ధే గన్ధవహాత్మతాఽన్నపచనే బర్హిర్ముఖాధ్యక్షతా,
పాత్రే కాఞ్చనగర్భతాఽస్తి, మయి చే ద్బాలేన్దుచూడామణే
శుశ్రూషాం కరవాణి తే పశుపతే స్వామిన్ త్రిలోకీగురో.

అవతారిక: బాలేన్దుచూడామణే = బాలచంద్రుఁడు తలమానికముగాఁ గలవాఁడా!, పశుపతే = పశుపతీ!, స్వామిన్ = ప్రభూ!, త్రిలోకీగురో = ముల్లోకములకును రహస్యార్థములను బ్రకాశింపఁజేయువాఁడా ! తే = నీయొక్క, వస్త్రోద్ధూతవిధౌ = వస్త్రోపచారము చేయుటయందు, సహస్రకరతా = సూర్యుఁడగుటయు (వేయి కరములు గలుగుట), పుష్పార్చనే = పుష్పోపహారార్పణమందు, విష్ణుతా = విష్ణు వగుటయు (వ్యాపకత్వము), గన్ధే = గంధోపచారమందు, గన్ధవహాత్మతా = వాయు వగుటయు, అన్న పచనే = అన్నమును వండుటయందు (హవిరుపచారము చేయుటయందు), బర్హిర్ముఖాధ్యక్షతా = ఇంద్రుఁ డగుటయు

(అగ్నిముఖుల కధ్యక్షుఁ డగుట) పాత్రే = పాత్రోపచారమందు (అర్ఘ్యవిధి), కాఞ్చన గర్భతా = హిరణ్యగర్భుఁడగుటయు (ధనపూర్ణుఁడగుట). మయి = నాయందు. అస్తి చేత్ = ఉన్నయెడల, తే = నీయొక్క, శుశ్రూషాం = సేవను, కరవాణి= చేయఁజాలుదును.

తాత్పర్యము : ఓయి జగద్గురూ! స్వామీ! పశుపతీ! నీకు వస్త్రోపచారము చేయుటకు వేయిచేతులవాఁడు గావలయును, నీకుఁ బుష్పోపచారముచ జేయుటకు వ్యాపనశీలుఁడు కావలయును, నీకు గంధోపచారమును జేయుటకు గంధవహుఁడు గావలయును, అన్నమును వండి నీకు హవిస్సు నివేదనముచేయుటకు నగ్నిముఖాధ్యక్షుఁడు గావలయును. పాత్రోపచారమును జేయుటకు హిరణ్య గర్భుఁడు కావలయును. అట్టి సూర్యుఁడును, విష్ణువును, వాయుదేవుఁడును, దేవేంద్రుఁడును, హిరణ్యగర్భుఁడును నైనఁగాని నీ కుపచారముచేయ నా తరముగాదు.

మ. వసనోద్ధూత విధిన్ సహస్రకరతా భాస్వత్త్వంబు. విష్ణుత్వమున్
ప్రసవార్చాక్రియ, గంధవాహకత గంధం బందు, బర్హిర్ముఖా
గ్రసరత్వంబును వంటలోఁ, గనకగర్భత్వంబు పాత్రంబునం
దసమాక్షా! కలదేని నాకు, వరివస్యల్ నీకు నీ నోపుదున్.

31

అవతారిక : పరమేశ్వరునియందున్న సర్వాతిశాయి శక్తిని జూపుచున్నారు.

శ్లో. నాలం వా పరమోపకారక మిదం త్వేకం పశూనాంపతే
పశ్యన్ కుక్షిగతాన్ చరాచరగణాన్ బాహ్యస్థితాన్ రక్షితుమ్,
సర్వామర్త్య పలాయనౌషధ మతిజ్వాలాకరం భీకరం
నిక్షిప్తం గరళం గళే న గిళితం నోద్గీర్ణ మేవ త్వయా

టీక : పశూనాంపతే = ఓయి పశుపతీ!, కుక్షిగతాన్ = కడుపులోనున్న, చరాచరగణాన్ = జంగమ స్థావర సమూహములను, బాహ్య స్థితాన్ = వెలుపలనున్న వారలను, రక్షితుం = రక్షించుటకు, పశ్యన్ = చింతించుచు, త్వయా = నీచేత, అతిజ్వాలాకరం = మిక్కిలి తాపమును గలుగఁజేయునదియు, భీకరం = భయంకరమును నగు, గరళం = కాలకూట విషము, స....ధం - సర్వామర్త్య =

ఎల్లదేవతలయొక్క, పలాయన = పాఱిపోవుట యనియెడు రోగమునకు, ఔషధం = మం దగునట్లుగా. గళే = కంఠమందు. నిక్షిప్తం = నిలుపఁబడినదయి, న గిళితం = మ్రింగఁబడలేదు, నోద్గీర్ణ మేవ = వెడలఁగ్రక్కఁబడను లేదు. పర మోపకారకం = మిక్కిలి యుపకారమైన. ఇదం = ఇది. ఏకం = ఒక్కటి. నాలం వా = (నీ మహిమ తెలియుటకు) చాలదా ?

తా త్ప ర్య ము : ఓయి పశుపతీ! సకల లోకభయంకరము, సంతాపకరము నగు కాలకూటమును భయపడి పాఱిపోవు దేవతల కూఱట గలుగునట్లుగా నీ కంఠము నందె యుంచుకొని మ్రింగక, గ్రక్కక కడుపులోని వారలకును, వెలుపలివారలకును బాధ కలుగకుండులాగున రక్షించితివి. ఈ మహోపకార మొక్కటి నీ మహిమ తెలియు టకుఁ జాలదా ?

చ. అలయక కుక్షిసంస్థిత చరాచర సంతతులన్ బహిస్స్థిత
మ్ములఁ బరిరక్ష సేయుటకుఁ బూని సురాళి పలాయనౌషధ,
మ్మలఘు విదాహకమ్మును, భయంకర మౌ గరళమ్ము మ్రింగకే,
వెలికిని గ్రక్కకే గళనివిష్టముఁ జేసితి; వద్ది యొక్కఁడే
తెలుపునుగాదె యో పశుపతీ ! భవదీయ పరోపకారతన్.

32

అ వ తా రి క : పరమశివ పరిగృహీతమైన విషమును మూఁడు విధముల భావించి ప్రశ్నించుచున్నారు.

శ్లో. జ్వాలోగ్ర స్సకలామరాతి భయదః క్ష్వేళః కథం వా త్వయా
దృష్టః కిం చ కరే ధృతః కరతలే కిం పక్వ జమ్బూఫలమ్,
జిహ్వాయాం నిహితశ్చ సిద్ధఘుటికా వా కణ్ఠదేశే భృతః
కిం తే నీలమణి ర్విభూషణ మయం శమ్భో మహాత్మన్ వద.

టీ క : మహాత్మన్ = మహాత్ముఁడవైన. శమ్భో = పరమేశ్వరా !. జ్వాలోగ్రః = మంటలచేత భయంకర మయినదియు. స....దః - సకలామర = సమస్త దేవతలకును. అతి భయదః = మిక్కిలి భయంకరమును నగు. క్ష్వేళః = విషము. త్వయా = నీచేత. కథం వా = ఎట్లుగా. దృష్టః = చూడఁబడినది !.

కిం చ = మ యును, కరే = హస్తమందు, ధృతం = ధరింపఁబడినది?, కరతలే = అఱచేతియందు, నిహితః = ఉంచుకొనఁబడినది?, పక్వజమ్బూఫలం కిం = పండిన నేరేడుపండా యేమి ?. కణ్ఠదేశే = కంఠప్రదేశమున. ధృతః = ధరింపఁబడినది?, అయం = ఈ కాలకూటవిషము, తే = నీకు, విభూషణం = అలంకారమైన, నీలమణిః కిం = ఇంద్రనీలమణియా యేమి ?. వద = చెప్పుము.

తాత్పర్యము : మహాత్ముఁడవైన ఓ యీశ్వరా ! తీవ్రజ్వాలలు గ్రమ్ముచు సమస్త దేవతలకును భయంకరమైన యీ కాలకూటవిషమును గన్నులతో నెట్లు చూచితివి ? చేతితో నెట్లు తాఁకితివి ? అఱచేతిలోఁ బెట్టుకొంటి వది నేరేడుపండా యేమి ? పైఁగా నాలుకమీఁద వేసికొంటి వది సిద్ధఘుటికయా యేమి ? మఱియును గంఠమందు ధరించితి విది యింద్రనీలమణియా యేమి ? చెప్పుము.

శా. జ్వాలోగ్ర మ్మఖిలామరాతిభయకృద్బాధాకరంబైన యా
క్ష్వేళం బెట్టులు చూచి, తెట్లు కరనిక్షిప్తంబు గావించితో,
కేలన్ నేరెడుపండో, జిహ్వ నెటులం గీల్కొల్పితో మాత్రయో,
నీలంబో యెటు కంఠమం దునిచితో నిక్కంబు వాకో ప్రభూ !

33

అవతారిక : వక్ష్యమాణసాధనములలో నేదే నొకదానిచే ముక్తి సులభ మగుచుండఁగా నన్యదేవతానుసరణము వ్యర్థముగదా యనుచున్నారు.

శ్లో. నాలం వా సకృదేవ దేవ భవత స్సేవా నతిర్వా నుతిః
పూజా వా స్మరణం కథాశ్రవణమ ప్యాలోకనం మాదృశామ్,
స్వామి న్నస్థిరదేవతానుసరణాయాసేన కిం లభ్యతే
కా వా ముక్తి రితః కుతో భవతి చే త్కిం ప్రార్థనీయం తదా.

టీక : స్వామిన్ = సమస్తభూతాధ్యక్షుఁడవైన యో దేవా!. భవతః = నీ యొక్క. నతి ర్వా = కాయికమైన నమస్కారమో, నుతి ర్వా = వాచికమైన స్తోత్రమో, పూజా వా = సపర్యయో, స్మరణం = మానసికమైన స్మరణమో. కథాశ్రవణమపి = చెవులతో నీ చరిత్రలు వినుటయో. ఆలోకనం = కన్నులతో నీ

మూర్తిని జూచుటయో, సకృదేవ = ఒక్కమాఱుమాత్రమే, భవతః = నీయొక్క. సేవా = భజనము, మాదృశాం = నావంటివారికి, నాలం వా = ముక్తియొసఁగఁ జాలదా?, ఇతః = ఈపై యుపాయమును, విహాయ = విడిచి, ముక్తిః = మోక్షము, కా వా = ఎట్టిది? కుతోఽపి = పై యుపాయములలో నేయొక్క దానిచేనైనను, భవతిచేత్ = ముక్తి కలుగునేని, తదా = అప్పుడు అ.........న-అస్థిర = శాశ్వతముగాని, దేవతా = దేవతలయొక్క, అనుసరణాయాసేన = అనుసరించుశ్రమముచేత, కిం లభ్యతే = ఏమి లభించుచున్నది?, ప్రార్థనీయం కిం = కోరఁదగినదియు నేమున్నది?

తాత్పర్యము : ఓ స్వామీ! ఈశ్వరా! కాయిక వాచిక మానసికములగు నమస్కారము, స్తోత్రము, స్మరణము మున్నగు నీ సేవలయం దొక్కొక్కటియు మోక్షమునకు సంపూర్ణసాధనమగుచున్నది. ఈ యుపాయములుగాక వేఱొకదానిచే మోక్షములేదు. అస్థిరులయిన యితరదేవతల ననుసరించి శ్రమపడుటవలన నేమిలాభము? వారిని గోరఁదగిన దేమున్నది?

మ. నతియో, స్తోత్రమొ, పూజయో, స్మరణమో, నానాకథల్ వింటొ, స
మ్మతి దర్శించుటొ చాలదొక్కొ యొకఁడే మాదృజ్మనుష్యాలికిన్
హృతకామా! భవదీయసేవ? స్థిరతా హీనామరశ్రేణిసం
గతి కష్టం బదియేల? ముక్తిగలుగంగా వీన నొం దేలిఁకన్?

34

అవతారిక : ఆ పరమశివుని పద్ధతి యన్యదుర్లభమని చెప్పుచున్నారు.

శ్లో. కిం బ్రూమ స్తవ సాహసం పశుపతే కస్యాస్తి శమ్భో భవ
ద్ధైర్యం చేదృశ మాత్మన స్థ్సితి రియం చాన్యైః కథం లభ్యతే,
భ్రశ్యద్దేవగణం త్రసన్మునిగణం, నశ్యత్ప్రపఞ్చం లయం
పశ్య న్నిర్భయ ఏకఏవ విహర త్యానన్దసాన్ద్రో భవాన్.

టీక : పశుపతే = ఓ భూతనాథా? శమ్భో = ఓయి శంకరా!. తవ = నీ యొక్క, సాహసం = తెగువ, కిం బ్రూమః = ఏమనిచెప్పుదుము, ఈదృశం = ఇటువంటి, భవద్ధైర్యం = నీ ధైర్యము, కస్య = ఎవనికి, అస్తి = ఉన్నది?, ఇయం = ఈ (ఇట్టి), ఆత్మనః = తన (నీ) యొక్క. స్థితిశ్చ = ఉనికియును.

అన్యైః = ఇతరులచేత, కథం = ఎట్లు, లభ్యతే = పొందఁబడును?, ఆనన్ద సాన్ద్రః = ఆనందమయుఁడవైన, భవాన్ = నీవు, భ్రశ్యద్దేవగణం = పడిపోవు చున్న దేవతాగణమును, త్రసన్మునిగణం = భయపడుచున్న మునిసమూహమును. నశ్యత్ప్రపఞ్చం = నశించుచున్న ప్రపంచమును గల. లయం = ప్రళయమును. పశ్యన్ = చూచుచు, నిర్భయః = భయరహితుఁడవై, ఏకః ఏవ = ఒక్కఁడవే, విహరతి = విహరించుచున్నావు.

తాత్పర్యము : ఓయి పశుపతీ! శంకరా! నీ సాహసమేమని చెప్పుదుము? ఇట్టి నీ ధైర్య మెవనికిఁగలదు? ఇట్టి నీ స్థితి యన్యుల కెవరికుండును? దేవత లందఱును బతనము చెందుచుండ, మును లందఱును భయకంపితులగుచుండ, దృశ్యమాన ప్రపంచమంతయు నశించిపోవుచుండ, నీ వొక్కఁడవేకదా నిర్భయుఁడవై పరమానంద పరిపూర్ణుఁడవై మహాప్రళయమున విహరించుచున్నావు.

శా. ఈ నీ సాహసమేమియందు! భవదీదృగ్ధైర్య మెవ్వానిలోఁ
గానంగా నగు? నీ మనస్స్థితి యెటుల్ కల్గున్ ద్వదన్యాళికిన్?
హానింజెందఁ బ్రపంచ మంతయును, సంత్రాసంబు నొందన్ మునుల్,
స్థానభ్రంశము నొంద దేవతలు నిస్త్రాసుండవై చూచుచున్
సానందం బొకరుండవున్ లయమునన్ స్వామీ! వినోదింపవే!

35

అవతారిక : 'పరమశివుని గుణము లన్నియును దెలిపినట్లే, ఇఁక నాతని పరమాప్తత్వమును స్మరింతు'నని శపథము చేయుచున్నారు.

శ్లో. యోగక్షేమధురంధరస్య సకలశ్రేయఃప్రదోద్యోగినో
దృష్టాదృష్ట మతోపదేశకృతినో బాహ్యాన్తరవ్యాపినః,
సర్వజ్ఞస్య దయాకరస్య భవతః కిం వేదితవ్యం మయా
శమ్భో త్వం పరమాన్తరఙ్గ ఇతి మే చిత్తే స్మరా మ్యన్వహమ్.

టీక : యో....స్య - యోగ = దుర్లభ వస్తువులను లభింపఁజేయుటయందును, క్షేమ = లభించినవానిని గాపాడుటయందును, ధురంధరస్య = భారమును

వహించినట్టియు, స....నః - సకల = ఎల్ల, శ్రేయః = శుభములను, ప్రద = ఇచ్చునట్టి, ఉద్యోగినః = ఉద్యోగము గలిగినట్టియు, దృ... నః - దృష్టాదృష్ట = ఇహపరలోకములకు, మత = సమ్మతమైన యుపాయమును, ఉపదేశకృతినః = ఉపదేశించుటయందు నేర్పు గలిగినట్టియు, బాహ్యాన్తరవ్యాపినః = బాహ్యప్రపంచము నందును, ఆంతర ప్రపంచమునందును వ్యాపించియున్నట్టియు, సర్వజ్ఞస్య = సర్వజ్ఞుఁడ వయినట్టియు, దయాకరస్య = కరుణాకరుఁడ వయినట్టియు, భవతః = నీయొక్క, (నీ సంబంధ మయినది), మయా = నాచే, వేదితవ్యం = తెలిసికోఁదగినది, కిం = ఏమున్నది? శమ్భో = శంకరా!, త్వం = నీవు, మే = నాకు, పరమాన్తరఙ్గః = మిక్కిలి యాప్తుఁడవు, ఇతి = అని, అన్వహం = ప్రతిదినమును, చిత్తే = మనస్సునందు, స్మరామి = తలఁచుచున్నాను.

తాత్పర్యము: శంకరా! ప్రజల యోగక్షేమముల భారమును వహించుట, సకలశ్రేయస్సులను గలిగించుట, ఇహ పరలోకసాధనములైన యుపాయముల నుపదేశించుట, ఎల్లయెడలఁ దానే వ్యాపించియుండుట, సర్వజ్ఞత్వము, దయాళుత్వము - ఇవి యన్నియు నీ గుణములని నాకుఁ దెలియును, ఇఁక నేను దెలిసికొనఁదగిన దేమున్నది? నాకు నీవే పరమాప్తుఁడవని యెప్పుడును స్మరింతును.

మ. గరకంఠా! కరుణాకరత్వమును, యోగక్షేమధుర్యత్వమున్,
 హర! సర్వజ్ఞత, సర్వ భద్రద సముద్యద్భావ, మంతర్బహిః
 పరితో వ్యాప్తత, లోకయుగ్మ మత సద్భావోపదేశక్రియల్
 గుఱుతే నాకు భవద్గుణంబు, లిఁక నొక్కొండున్నదే నేర్వ! మ
 త్పరమాప్తుండ వటంచు నీవయిని విశ్వాసంబు నుంతున్ మదిన్.

36

అవతారిక: పదార్థరూపకముచేఁ బరమశివునకుఁ బ్రీతిఁ గావించుచున్నారు.

శ్లో. భక్తో భక్తిగుణావృతే ముదమృతాపూర్ణే ప్రసన్నే మనః
 కుమ్భే సామ్బ తవాఙ్ఘ్రిపల్లవయుగం సంస్థాప్య సంవిత్ఫలమ్,
 సత్త్వం మన్త్ర ముదీరయన్ నిజశరీరాగారశుద్ధిం వహన్
 పుణ్యాహం ప్రకటీకరోమి రుచిరం కల్యాణ మాపాదయన్.

టీక: సామ్బ = ఓయి సాంబా! భక్తః = భక్తుఁడనైన నేను, నిజ శరీర = నా శరీరమనెడు, ఆగార శుద్ధిం = గేహ శుద్ధిని, వహన్ = సంపాదించు చున్నవాఁడనై, రుచిరం = మనోహరమైన, కల్యాణం=మంగళ మనియెడు వివాహ మంగళమును, ఆపాదయన్ = సంపాదింపఁబోవుచు, భక్తి గుణావృతే = భక్తి యనెడు తంతువుతోఁ జుట్టఁబడినదియు, ముదమృతాపూర్ణే = సంతోషమనెడు నుదకముతో నిండింపఁబడినదియు, ప్రసన్నే = స్వచ్ఛమయినదియు, అగు, మనః కుమ్భే = మనస్సనెడు కలశమందు, తవ = నీయొక్క, అఙ్ఘ్రిపల్లవయుగం = పాదపల్లవద్వయమును, సంవిత్ఫలం = జ్ఞాన మను కొబ్బెరబొండమును, సంస్థాప్య= ఉంచి, సత్త్వం=సత్త్వగుణప్రధానమైన, మన్త్రం = మంత్రమును, ఉదీరయన్ = ఉచ్చరించుచు, పుణ్యాహం = పుణ్యాహ వాచనమును, ప్రకటీకరోమి = ప్రకాశింపఁ జేయుదును.

తాత్పర్యము: ఓయి సాంబమూర్తీ!, భక్తుఁడనైన నేను నాదేహమనెడు గేహమును బరిశుద్ధము గావించుకొని మనఃప్రియముగాఁ గల్యాణమును గావింపఁ బూని, యందులకుఁగా భక్తియనెడు తంతువును జుట్టి, సంతోషమునెడు జలముతో నించిన నా మనస్సనెడు కలశమున నీ పాదపల్లవద్వయమును, నీ జ్ఞానమనెడు నారికేళఫలమును జేర్చి కలశమును స్థాపించి తారకమంత్రోచ్చారణపూర్వకముగాఁ బుణ్యాహ వాచనమును నెఱవేర్తును. మీ పాదద్వయము నెప్పుడును మనసా స్మరింతునని భావము.

మ. పరమా ; భక్తిగుణావృతంబుఁ, బ్రమదాంభఃపూర్ణమౌ స్వచ్ఛహృ
ద్వరకుంభంబున యుష్మదంఘ్రికిసలద్వంద్వంబు సంవిత్ఫలం
బిరవొందించుచు, సత్త్వమంత్రపరనం బింపొందఁగాఁజేసి యీ
శ్వర ! మద్దేహగృహమ్ము శుద్ధము నొనర్పంజేసి పుణ్యాహసం
స్కరణంబుం బొనరింతు హృత్ప్రియముగాఁ గల్యాణసంప్రార్థినై.

37

అవతారిక: విద్వాంసులు వేదసముద్రమును ద్రచ్చి తజ్జన్యఫలమునుగా నిన్నుఁ బొందుదు రనుచున్నారు.

శ్లో. ఆమ్నాయామ్బుధి మాదరేణ సుమనస్సఙ్ఘా స్సముద్యన్మనో
మన్థానం దృఢభక్తిరజ్జుసహితం కృత్వా మథిత్వా తతః,
సోమం కల్పతరుం సుపర్వసురభిం చిన్తామణిం ధీమతాం
నిత్యానన్దసుధాం నిరన్తరరమాసౌభాగ్య మాతన్వతే.

టీక : సుమనస్సఙ్ఘాః = విద్వద్బృందములు (దేవబృందములు), సముద్యత్ = గుణసమూహముతో నొప్పుచున్న, మనః = మనస్సును, దృఢభక్తి, రజ్జు సహితం = అచంచలభక్తి యను త్రాటితోఁ గూడిన, మన్థానం = కవ్వమునుగా కృత్వా = చేసి, ఆమ్నాయామ్బుధిం = వేదములనెడు సముద్రమును, ఆదరేణ = ఆసక్తితో, మథిత్వా = త్రచ్చి, తతః = దానినుండి, సోమం = చంద్రుని, కల్ప తరుం = కల్పవృక్షమును, సుపర్వ సురభిం = కామధేనువును, చిన్తామణిం = చింతా మణిని, ధీమతాం = బుద్ధికి సమ్మతమైన, నిత్యానన్దసుధాం = శాశ్వతానందప్రద మైన యమృతమును, నిరన్తరరమాసౌభాగ్యం = అవిచ్ఛిన్న లక్ష్మీ సమృద్ధిని, ధీమతాం = బుద్ధిమంతులకు, కల్పద్రుమం = కల్పవృక్షమువంటివాఁడును, సుపర్వ సురభిం = కామధేనువువంటివాఁడును, చిన్తామణిం = చింతామణివంటివాఁడును, నిత్యానన్దసుధాం = అమృతమువంటి నిత్యానంద స్వరూపుఁడును, నిరన్తర రమా సౌభాగ్యం = శాశ్వత మోక్షలక్ష్మీసమృద్ధిస్వరూపుఁడును, అగు, సోమం = ఉమా సహిత పరమేశ్వరుని, ఆతన్వతే = విస్తరించి పొందుచున్నారు.

తాత్పర్యము : దేవతలందఱును మందరపర్వతమును గవ్వముగాఁజేసి సముద్రమును మథించి కల్పవృక్షమును, గామధేనువును, జింతామణిని, నమృతమును, జంద్రుని సంపాదించినట్లు విద్వాంసులందఱును దమ మనస్సును గవ్వముగాఁజేసి, భక్తియను త్రాడుగట్టి, వేదములనెడు సముద్రమును ద్రచ్చి యందుండి భక్తిశాలులకుఁ గల్పవృక్ష కామధేను చింతామణులవంటి వాఁడును, నిత్యానంద స్వరూపుఁడును, నవిచ్ఛిన్నమోక్షలక్ష్మీస్వరూపుఁడు నగు సోమేశ్వరుని సాధించుచున్నారు.

మ. సుమనస్సంఘము లెంతొ యాదరమునన్ శ్రుత్యబ్ధిఁ బ్రోద్యన్మన
స్సుమహామంథన భక్తిరూపదృఢరజ్జుప్రక్రియం ద్రచ్చి, ది
వ్య మణిన్, సోమునిఁ, గామధేనువు, సుపర్వక్ష్మాజమున్, శాశ్వత
ప్రమదాఖ్యామృతమున్, నిరంతర రమా భాగ్యంబుఁ బ్రాపించెడిన్.

38

అవతారిక : పరమశివచంద్రదర్శనముచే నానందసముద్రము పొంగును, అందు సుమనస్కులకుఁ బ్రవృత్తి గలుగునని చెప్పుచున్నారు.

శ్లో. ప్రాక్పుణ్యాచల మార్గదర్శిత సుధామూర్తిః ప్రసన్న శ్శివ
సోమ స్సద్గణ సేవితో మృగధరః పూర్ణ స్తమోమోచకః,
చేతః పుష్కరలక్షితో భవతి చే దానన్దపాథోనిధిః
ప్రాగల్భ్యేన విజృమ్భతే సుమనసాం వృత్తి స్తదా జాయతే.

టీక : ప్రా .... ... ర్తిః = ప్రాక్పుణ్యాచల = పూర్వజన్మములనందలి పుణ్యములగుట్టయొక్క - తూర్పుదిక్కుననుండు పుణ్యాకరమైన పర్వతము (ఉదయగిరి) యొక్క, మార్గ = మార్గమున, దర్శిత = చూపఁబడిన, సుధామూర్తిః = అమృత శరీరము (అమృతమయమగు బింబము) కలవాఁడును, ప్రసన్నః = స్వచ్ఛమైన వాఁడును. శివః = ఆనంద స్వరూపుఁడును, (ఆహ్లాదకరమైన వాఁడును), సద్గణసేవితః = సజ్జనబృందముచేఁ బూజింపఁబడినవాఁడును, (నక్షత్రసముదాయముచేఁ జుట్టుకొనఁబడిన వాఁడు), మృగధరః = లేడిని దాల్చినవాఁడును, పూర్ణః = అంతటను నిండినవాఁడును (షోడశకళా పరిపూర్ణుఁడు). తమోమోచకః = అజ్ఞానము (చీఁకటి) పోఁగొట్టువాఁడును, అగు, సోమః = సాంబుఁడనెడు చంద్రుఁడు, ప్రాగల్భ్యేన = ప్రౌఢిచేత, చేతః పుష్కర లక్షితః = హృదయాకాశమునందుఁ జూడఁబడినవాఁడు, భవతిచేత్ = అగునేని, ఆనన్దపాథోనిధిః = ఆనందసముద్రము, విజృమ్భతే = ఉప్పొంగుచున్నది, తదా = అప్పుడు, సుమనసాం = సంస్కరింపఁబడిన చిత్తము గలవారలకు, వృత్తిః = అం దోలలాడవలయునను) ప్రవృత్తి, జాయతే = పుట్టుచున్నది.

తాత్పర్యము : జనుఁడు పూర్వపుణ్యార్జితమైన యుదయపర్వతసదృశమైన పుణ్యముచేఁ దన యమృతశరీరము భక్తలోకమునకుఁ గనఁబఱిచి ప్రసన్నుఁడు, నానందమయుఁడు నయి నక్షత్రసమూహామువలె సజ్జనబృందము పరివేష్టించి సేవింప మృగధరుఁడును, బరిపూర్ణుఁడును, దమోనివారకుఁడు నగుచుఁ, జంద్రునివలె హృదయాకాశమునందు సోమేశ్వరుఁడు పరమప్రబోధముతోఁ దోఁచునేని నానందసముద్రముప్పొంగును. అప్పుడు శుద్ధమనస్కులగు విబుధుల చిత్తములు రంజిల్లును.

తే. పూర్వపుణ్యాద్రిపథసుధాస్ఫురితమూర్తి,
శివుఁడు, సోముఁడు, సద్గణసేవితుండు.
పూర్ణుఁడు, ప్రసన్నుఁడును, దమోమోచకుండు,
మృగధరుండు మనోఽమ్బరదృష్టుఁడేనిఁ
బొంగి పొరలెడు సమ్మదాంబునిధి; పొడము
నంత సుమనస్కులకు నోలలాడుబుద్ధి.

39

అ వ తా రి క : ఒక నగరమున మంచిరాజుండుటచే దేశమునకు సర్వసమృద్ధియుఁ గలుగునట్లు హృదయపుండరీకమునఁ బరమేశ్వరుఁడుండుటచేఁ నాకు సర్వసమృద్ధియుఁ గలిగినదని చెప్పుచున్నారు.

శ్లో. ధర్మో మే చతురఙ్ఘ్రిక స్సుచరితః పాపం వినాశం గతం
కామక్రోధమదాదయో విగళితాః కాలా స్సుఖావిష్కృతః,
జ్ఞానానన్ద్య మహౌషధి స్సుఫలితా కైవల్యనాథే సదా
మాన్యే మానసపుణ్డరీకనగరే రాజావతంసే స్థితే.

టీ క : రాజావతంసే = చంద్రుఁడు శిరోభూషణముగాఁ గలవాఁడును (రాజశ్రేష్ఠుఁడును), మాన్యే = సర్వపూజ్యుఁడును (సర్వసమ్మతుఁడును) నగు శివుఁడు (రాజు). మే = నాయొక్క, మానసపుణ్డరీకనగరే = పద్మమువంటి మనస్సనెడు నగరమున, కైవల్యనాథే = కైవల్యముతోఁ గూడిన ప్రభువై, స్థితే సతి = ఉండఁగా, చతురఙ్ఘ్రికః = నాలుగు పాదములుగల, ధర్మః = ధర్మము, సుచరితః = సుఖముగా నాచరింపఁబడినది, పాపం = పాపము, వినాశం = నాశమును, గతం = పొందినది, కామక్రోధమదాదయః = కామ క్రోధ లోభ మోహ మదమాత్సర్యములనునవి, విగళితాః = తొలఁగిపోయినవి, కాలాః = పక్ష మాస సంవత్సరాది కాలములు, సుఖావిష్కృతః = సుఖమును బ్రకటించునవి, జ్ఞానానన్ద్య మహౌషధిః = జ్ఞానసాధన గ్రంథ బాహుళ్య మనెడు సిద్ధసాధనమగు నోషధి, సదా = ఎల్లప్పుడును, సుఫలితా = చక్కఁగా ఫలించినది, (భవతి = అగుచున్నది.)

తాత్పర్యము: మంచివాఁడగు రాజు స్వతంత్రుఁడై నగరమునందుండి పరిపాలించుచుండఁగా దోషములన్నియుఁ దొలఁగిపోయి, భూమి ఫలవంతమయి, సర్వసమృద్ధి గలుగునట్లు, నా హృదయపుండరీకమునఁ బరమేశ్వరుఁడు మోక్షాధి నాథుఁడై నివసించియుండ, సదా నాకు ధర్మము నాలుగుపాదముల నడచి పాపములు నశించి కామాద్యంతశ్శత్రువులు తొలఁగి జ్ఞానసాధనములనెడు నోషధులు ఫలించి కాలము సుఖముగా సాగినది.

శా. కైవల్యేశుఁడు రాజశేఖరుఁడు హృత్కంజాఖ్యమౌ ప్రోలునం
దావాసింప సదా యఘమ్ములును, గామాదుల్ నశించున్, సుఖం
బై వర్తిల్లును గాలముల్, నడచు నాల్గౌకాళ్ల ధర్మంబు, స
ద్యోఽవాప్తఫలంబులై తనరు జ్ఞానానంత్యసిద్ధౌషధుల్.

40

అవతారిక: వక్ష్యమాణలక్షణముగల ఫలమును బొందియున్నందువ నాకు క్షామభయము లేదనుచున్నారు.

శ్లో. ధీయన్త్రేణ వచోఘటేన కవితాకుల్యోపకుల్యాక్రమై
రానీతైశ్చ సదాశివస్య చరితామ్భోరాశి దివ్యామృతైః,
హృత్కేదారయుతాశ్చ భక్తికలమా స్సాఫల్య మాతన్వతే
దుర్భిక్షా న్మమ సేవకస్య భగవ న్విశ్వేశ భీతిః కుతః ॥

టీక: భగవన్ = షడ్గుణైశ్వర్యసంపన్నుఁడవైన, విశ్వేశ = ఓ సకల జగదధిపతీ!, ధీయన్త్రేణ = బుద్ధి యనెడు మోటతో, వచోఘటేన = వాక్కనెడు బొక్కెనచేత, కవితా కుల్యోపకుల్యాక్రమైః = కవిత్వమనెడు కాలువలు పిల్లకాలువలు మున్నగువాని ద్వారమున, ఆనీతైః = (హృదయ మనెడు పొలములోనికి) తీసికొనిరాఁబడిన, సదాశివస్య = పరమశివునియొక్క, చ....తైః - చరితామ్భో రాశి = చరిత్రములనెడు సముద్రముయొక్క, దివ్యామృతైః = మంచినీళ్ళచేత, హృత్కేదారయుతాః = హృదయమనెడు పొలమునఁ బుట్టియున్న, భక్తి కలమాః = భక్తియను వరిపైరులు, సాఫల్యం = పంటను, ఆతన్వతే = విస్తరించుచున్నవి,

సేవకస్య = నీ సేవకుఁడనైన, మమ = నాకు, దుర్భిక్షాత్ = కఱవువలన, భీతిః = భయము, కుతః = ఎక్కడిది ?

తాత్పర్యము: ఓయి భగవంతుఁడవైన విశ్వేశ్వరా ! నీ చరిత్రమనెడు మహాసముద్రమునందలి దివ్యామృతము కవిత్వమనెడు కాలువలు పిల్లకాలువలు మున్నగువాని ద్వారమున వాక్కనెడు కుండతో, నా బుద్ధియనెడు మోటవలన హృదయమనెడు పొలములోనికిఁ బ్రవహించి, భక్తియను సస్యమును సఫలము చేయుచున్నది ఇఁక నాకు క్షామభయ మెక్కడిది ? మీ చరిత్రలు స్మరించుచు హృదయమున భక్తితో మి మ్మెప్పుడును సేవించుచుందునని భావము.

మ. కవితాకుల్యల, బుద్ధియంత్రమున, వాక్పాత్రంబునన్ దెచ్చి యో
శివ : యుష్మచ్చరితాబ్ధిదివ్యజలరాశిన్ నిండుగా మన్మనో
భువిఁ బూరింపఁ దదీయభక్తికలమంబుల్ పండు నవ్వారిగన్
భవ ! యిం కేటికి నాకుఁ గింకరునకున్ క్షామశ్రమత్రాసముల్ ?

41

అవతారిక: వక్ష్యమాణవిషయములందు మూకత్వము, బధిరత్వము మున్నగునవి రాకుండఁ జేయుమని ప్రార్థించుచున్నారు.

శ్లో. పాపోత్పాతవిమోచనాయ రుచిరైశ్వర్యాయ మృత్యుఞ్జయ
స్తోత్ర ధ్యాన నతి ప్రదక్షిణ సపర్యాలోక నాకర్ణనే,
జిహ్వా చిత్త శిరోఽఙ్ఘ్రి హస్త నయన శ్రోత్రై రహం ప్రార్థితో
మా మాజ్ఞాపయ తన్నిరూపయ ముహు ర్మా మేవ మామేఽవచః.

టీక: మృత్యుఞ్జయ = ఓయి మృత్యుంజయా ! పాపోత్పాత విమోచనాయ = పాపమనెడు నుత్పాతమును బోఁగొట్టుటకొఱకును, రుచిరైశ్వర్యాయ = సర్వస్వాతంత్ర్యముకొఱకును, స్తో....నే - స్తోత్ర = (నిన్ను) స్తుతించుట, ధ్యాన = (నిన్ను) ధ్యానించుట, నతి = (నీకు) నమస్కరించుట, ప్రదక్షిణ = (నీకు) ప్రదక్షిణము చేయుట, సపర్యా = (నీ) పూజచేయుట, ఆలోకన = (నిన్ను) చూచుట, ఆకర్ణనే = (నీ కథలు) వినుట, (వీని విషయమున), జి....త్రైః - జిహ్వా = నాలుక చేతను, చిత్త = మనస్సుచేతను, శిరః = శిరస్సుచేతను, అఙ్ఘ్రి = పాదములచేతను,

హస్త = చేతులచేతను, నయన = కన్నులచేతను శ్రోత్రైః = చెవులచేతను, అహం = నేను, ప్రార్థితః = ప్రార్థింపఁబడితిని, మాం = నన్ను, ఆజ్ఞాపయ = ఆజ్ఞాపింపుము, తత్ = ఆ స్తోత్రాదికమును గూర్చి, మాం = నన్ను, ముహుః = మాటి మాటికి, నిరూపయ = పురికొల్పుము, మే = నాకు, అవచః=మూఁగతనము, మైవ = కలుగనీకుము.

తాత్పర్యము: ఓయి మృత్యుంజయా! పాపములుపోయి యిష్టైశ్వర్యము సిద్ధించుటకొఱకుఁ బరమేశ్వరుని స్తుతింపుమని నాలుకయు, ధ్యానింపుమని మనస్సును, నమస్కరింపుమని శిరస్సును, ప్రదక్షిణము సేయుమని పాదములును, పూజింపుమని చేతులును, జూడుమని కన్నులును, గథలు వినుమని చెవులును నన్నుఁ గోరుచున్నవి. నన్నాజ్ఞాపించి పలుమాఱట్లుచేయ నన్నలవఱుపుము. నాకు మూకత్వాదులు రాకుండఁ జూడుము.

శా. ఏనోఽరిష్టవిముక్తియున్, విభవ మెంతేఁగాంచ మృత్యుంజయా!
ధ్యాన స్తోత్ర నతి ప్రదక్షిణ సప ర్యాకర్ణ నాలోకముల్
పూనన్ శత్రము, జిహ్వయున్, దల, పదమ్ముల్, కేలు, వీనుల్, కనుల్
దీనత్వంబున నన్ను వేఁడె, నిను నర్థింతున్ నిరూపించి య
వ్వానిన్ మాటికిఁ, బంపుమా! ననుఁ బొనర్పంబోకుమా మూకుఁగాన్.

42

అవతారిక: ఈశ్వరుఁడు దుర్గాతిప్రియుఁ డగుటచే నిజమనోదుర్గమున నివసింపుమని ప్రార్థించుచున్నారు.

శ్లో. గామ్భీర్యం పరిఖాపదం ఘనధృతిః ప్రాకార ఉద్యద్గుణ
స్తోమ శ్చాప్తబలం ఘనేన్ద్రియచయో ద్వారాణి దేహస్థితః,
విద్యావస్తుసమృద్ధి రిత్యఖిలసామగ్రీసమేతే సదా
దుర్గాతిప్రియ దేవ మామకమనోదుర్గే నివాసం కురు.

టీక: దుర్గాతిప్రియ = పర్వతదుర్గమందు మిక్కిలి ప్రీతి గలిగిన, దేవ = ఓయి పరమశివుఁడా!, పరిఖా పదం = అగడ్తయొక్క లక్షణమైన,

గామ్భీర్యం = గాంభీర్యము (లోఁతు)ను, ఘనధృతి = గొప్పదైనధైర్యము, ప్రాకారః=కోటగోడయును, ఉద్యద్గుణ స్తోమః = పుట్టుచున్న సద్గుణ సమూహము, ఆప్తబలం = విశ్వసనీయమైన బలమును, దేహస్థితః = శరీరమందున్న, ఘనేన్ద్రియ చయః = గొప్పవైన కన్ను మున్నగు నింద్రియముల సమూహము, ద్వారాణి = రాకపోకలకు ద్వారములును, విద్యా = శివవిషయక జ్ఞానము, వస్తు సమృద్ధిః = పదార్థ సంపదయును, ఇతి = ఇట్టి, అఖిల సామగ్రీ సమేతే = దుర్గమునకు వలసిన సమస్త పదార్థములతోఁ గూడియున్న, మామక మనోదుర్గే = నా మనస్సనెడు దుర్గమున, సదా = ఎల్లప్పుడును, నివాసం = నివాసమును, కురు = చేయుము.

**తాత్పర్యము :** మిక్కిలి దుర్గమమైన కైలాసపర్వతమునఁ బ్రీతితో నివసించుచున్న యో దేవా! నా మనస్సుగాంభీర్య మగడ్తగను, ధైర్యము ప్రాకారముగను, నుదయించు సద్గుణములు బలముగను, చక్షురాదీంద్రియములు ద్వారములుగను, బరమశివ సంబంధి జ్ఞానము సర్వపదార్థ సంపదగను - ఇట్లు దుర్గ లక్షణ సమగ్రమై యున్నది నీవు దుర్గాత్రిప్రియుఁడవు గావున నందు నివసింపుము.

మ. బలు గాంభీర్య మగడ్త, సాంద్రధృతియో ప్రాకార, ముద్యద్గుణా
వలియో యాప్తబలంబు, దేహగతముల్ బహ్వింద్రియానీకముల్
వలు ద్వారమ్ములు, విద్య వస్తురమ, యిబ్భంగిన్ సమస్తంబునుం
గల యస్మద్హృదిదుర్గమందు వసతిం గావింపు దుర్గప్రియా!

## 43

**అవతారిక :** పరమశివుఁ డాదికిరాతమూర్తి యగుట దలఁచి కిరాతలభ్య ఫలమంతయు నాయందు సులభము గావున మ ఱెక్కడకును బోవలదని ప్రార్థించు చున్నారు

శ్లో, మాగచ్ఛ స్త్వ మితస్తతో గిరిశ భో మయ్యేవ వాసం కురు
స్వామి న్నాదికిరాత మామక మనఃకాన్తారసీమాన్తరే,
వర్తన్తే బహుశో మృగా మదజుషో మాత్సర్యమోహాదయ
స్తా న్హత్వా మృగయావినోదరుచితాలాభం చ సమ్ప్రాప్స్యసి.

టీక : ఆదికిరాత = ఓ యాదికిరాతమూర్తీ ! భో గిరిశ = ఓయి కైలాస శాయీ, స్వామిన్ = ప్రభూ !, త్వం = నీవు, ఇతస్తతః = ఇటునటు, మాగచ్ఛః= పోవకుము. మయ్యేవ = నాయందే, వాసం = నివాసమును, కురు = చేయుము, మామక మనః కాన్తార సీమాన్తరే = నా హృదయమను నరణ్యములోపల, మద జుషః=(మ మ్మెవ్వరును జయింపలే రనెడి) గర్వములోఁ గూడిన, మాత్సర్య మోహా దయః = మాత్సర్యము, మోహము మొదలైన, మృగాః = అడవిమృగములు, బహుశః = అనేకములుగా, వర్తన్తే = తిరుగుచున్నవి. తాన్ = వానిని, హత్వా= చంపి. మృగయా వినోద రుచితా లాభం చ = వేఁటతోఁ గాలము పుచ్చవలయు నను కోరికయొక్క లాభమునుగూడ, సమ్ప్రాప్స్యసి = పొందఁగలవు.

తాత్పర్యము : ఓయి యాదికిరాతమూర్తీ ! గిరిశా ! స్వామీ ! నీ విటునటు పోక నా మనస్సునందే యుండుము. నా మనస్సు మహారణ్యము, అందుఁ గామ క్రోధాదులగు క్రూరమృగములు మెండుగా నున్నవి వానిని వేఁటాడి వేఁటయందలి నీ యానందమును సైతముఁ దీర్చికొందువు.

మ. గిరిశా ! యిట్టటు పోక నా మదిన సాగింపంగదే వాసమున్;
హర ! యో యాదికిరాత ! మద్ధృదయఘోరారణ్యమధ్యంబునన్
జరియించున్ గడుఁ గ్రొవ్వి యెన్నొ మదమాత్సర్యాదులౌ జంతువుల్
పొరయంగల్గుదు వానిఁజంపి మృగయా భూరి ప్రమోదంబునున్.

## 44

అవతారిక : మహాదేవునియందు సింహత్వమును నిరూపించి వానిని స్తుతించుచున్నారు.

శ్లో. కరలగ్నమృగః కరీన్ద్రభఙ్గో
ఘనశార్దూలవిఖణ్డనోఽ స్తజన్తుః,
గిరిశో విశదాకృతిశ్చ చేతః
కుహరే పఞ్చముఖోఽస్తి మే కుతో భీః.

టీక : కర లగ్న మృగః = హస్తమందు లగ్నమైన మృగము గలవాఁ డును (చేఁజిక్కిన మృగములు గలదియు), కరీన్ద్ర భఙ్గః = గజాసురుని భంజించిన

వాఁడును (గజశ్రేష్ఠములను జంపునదియు), ఘన శార్దూల విఖణ్డనః = ప్రబలుఁడగు వ్యాఘ్రాసురుని ఖండించినవాఁడును (బెబ్బులులఁ జంపునదియు), అ_స్తజన్తుః = తన యందు లీనమైన ప్రాణికోటి గలవాఁడును (నిరస్తములైన జంతువులు గలదియు), గిరిశః = పర్వతమందు శయనించువాఁడును (కొండలయందు శయనించునదియు), విశదాకృతిశ్చ = ధవళమైన యాకారము గలవాఁడును (తెల్లగా నుండునదియు), అగు, పఞ్చముఖః = అయిదు ముఖములు గలవాఁడు (వ్యక్తమైన ముఖముగలది) పరమేశ్వరుఁడనెడి సింహము, మే = నాయొక్క, చేతఃకుహరే = మనస్సనెడు గుహయందు, అ_స్తి = కలఁడు (కలదు), మే = నాకు, భీః = భయము, కుతః = ఎక్కడిది ?

తాత్పర్యము: సింహమునకు మృగములు చేఁజిక్కును. పరమేశ్వరుఁడు మృగమును జేత నిఱికించుకొనెను. అది గజశ్రేష్ఠములఁ జంపును. అతఁడు గజాసురుని ఖంజించెను. అది బెబ్బులులఁ జంపును అతఁడు వ్యాఘ్రాసురుని ఖండించెను. దానిని జూచి జంతువులన్నియుఁ బాఱిపోవును. ఆయనయందే జంతుజాలము లయించును. అది కొండలయందు శయించును. అతఁడు కైలాసపర్వతమందు శయించును. అది తెలుపు. అతఁడును దెలుపు. పంచముఖత్వ ముభయులకును సామాన్యమే. అట్టి పరమేశ్వరుఁడు సింహమువలె మన్మనఃకుహరమున నుండఁగా నాకు భయ మెక్కడిది.

ఆ.వె. హ_స్తలగ్నమృగము, హతహ_స్తిరాజమ్ము,
వ్యాఘ్ర ఖండనమ్ము, న_స్తజంతు,
వచ్ఛవపువు, గిరిశ మగు పంచముఖమూ_ర్తి
హృద్గుహన్ వసింప నేడ భయము ?

45

అవతారిక: పరమేశ్వరుని పాదద్వయ మనెడి గూఁటియందుఁ దన చి_త్త మనెడు పక్షి విహరింపఁ గోరుచున్నారు.

శ్లో. చన్ద్రశ్శాఖిశిఖాన్వితై ర్ద్విజవరై స్సంసేవితే శాశ్వతే
సౌఖ్యాపాదిని ఖేదభేదిని సుధాసారైః ఫలై ర్దీపితే,
చేతఃపక్షిశిఖామణే త్యజ వృథా సఞ్చార మన్యై రలం
నిత్యం శఙ్కరపాదపద్మయుగళీనీడే విహారం కురు.

టీ క : చేతః పక్షి శిఖామణే = మనస్సనెడు పక్షి శ్రేష్ఠమా!, ఛన్దశ్శాఖి శిఖాన్వితైః = వేదములనెడి వృక్షములయొక్క కొమ్మల కొనలతో (ఉపనిషత్తులతో), అన్వితైః = సంబంధించిన, ద్విజ వరైః = బ్రాహ్మణ శ్రేష్ఠుల (పక్షి శ్రేష్ఠముల) చేత, సంసేవితే = ఆశ్రయింపఁబడినదియు, శాశ్వతే = నిత్యమయినదియు, సౌఖ్యాపాదిని = సుఖమును గలిగించునదియు, సుధాసారైః = అమృతరసము గల, ఫలైః=ఫలములతో, ఖేద భేదిని = సంసారదుఃఖమును (ఆఁకలిని), పోఁగొట్టునదియు, దీపితే = ప్రకాశవంతమైన, శఙ్కర పాదపద్మ యుగళీ నీడే = ఈశ్వరుని పాదపద్మద్వయ మనెడు గూఁటియందు, విహారం = విహారమును, కురు=చేయుము, అన్యైః = ఇతరములతో, అలం = చాలును, వృథా = వ్యర్థమైన, సఞ్చారః = సంచారమును, త్యజ = విడువుము.

తా త్ప ర్య ము : ఓ చిత్త పక్షి శ్రేష్ఠమా! ఇటు నటు తిరిగి వ్యర్థముగా నేల శ్రమపడెదవు? పరమేశ్వరుని పాదద్వయము చక్కనిగూఁడు, దాని కెన్నఁడును నాశములేదు. అందుఁ జక్కని వెలుఁగు గలదు, అది మిక్కిలి సౌఖ్యావహము, అమృతరసఫలములుగలిగి దుఃఖ నివారకమయి యొప్పుచున్నది. అందు విహరించి యానందింపుము. అనేకద్విజసత్తము లాయా శాఖల శిఖరములతో సంబంధించియుండి దాని నాశ్రయించియుందురు. నా మనస్సు పరమేశ్వరుని పాదసరసిజములను మాత్ర మాశ్రయించుఁగాక యని భావము.

శా. ఛందశ్శాఖి శిఖాన్విత ద్విజవరాంచత్సేవ్యమున్, నిత్యమున్,
నందాపాదియు, ఖేద భేదియు, సుధాన్యక్కృత్ఫలోద్భాసియౌ
సౌందర్యాన్విత శంభుపాదసరసీజద్వంద్వనీడంబు నిం
పొందం బొందు మనఃఖగంబ! యితరం బుజ్ఝింపుమా వ్యర్థమున్.

46

అ వ తా రి క : మానసరాజహంసమునకుఁ బార్వతీనాథుని పాదసౌధాంతరాళమునందు నివాసమును విధించుచున్నారు.

శ్లో. అక్షీణే నఖరాజికాన్తివిభవై రుద్యత్సుధావైభవై
రాధాతేఽపి చ పద్మరాగలలితే హంసవ్రజై రాశ్రితే,

నిత్యం భక్తివధూగణైశ్చ రహసి స్వేచ్ఛావిహారం కురు
స్థిత్వా మానసరాజహంస గిరిజానాథాఙ్ఘ్రిసౌధాన్తరే.

టీక : మానసరాజహంస = మనస్సనెడి రాజహంసమా !, నఖరాజి కాన్తి విభవైః = గోటి వరుసల కాంత్యతిశయములచేత, ఆకీర్ణే = నిండియున్నదియు, ఉద్యత్సుధా వైభవైః = వృద్ధిపొందుచున్న చంద్రుని యమృతకిరణముల వ్యాప్తులచే (సున్నపుంబూంతలచే), ఆధౌతే = తెల్లంబడినదియు, అపి చ = మఱియును, పద్మరాగలలితే=పద్మములయొక్క యెఱుపువంటి యెఱుపుతో నొప్పునదియు, (పద్మరాగమణులు చెక్కినదియు), హంసవ్రజైః = హంసమంత్రార్థ ధ్యానపరుల సమూహములచేత (హంసల గుంపులచేత), ఆశ్రితే = సేవింపంబడినదియు నగు, గిరిజానాథాఙ్ఘ్రి సౌధాన్తరే = పార్వతీపతియొక్క పాదములనెడి మేడలోపల, రహసి = రహస్యమందు, భక్తి వధూ గణైః సహ=భక్తి వధూ సమూహములతోం గూడ, నిత్యం = ఎప్పుడును, స్వేచ్ఛావిహారం = ఇచ్ఛ వచ్చిన సంచారమును, కురు = చేయుము.

తాత్పర్యము : ఓ నా మానసరాజహంసమా ! నీ వా గౌరీనాథుని పాదమనెడు సౌధాంతరాళమునందు రహస్యమున భక్తివధూసహితముగా స్వేచ్ఛావిహారము సలుపుము, ఆ పాదసౌధము గోరులవరుసమెఱుంగు సమృద్ధిగా వెలుంగ, నా చంద్రమౌళి శిరమున నిత్యోదితుండై యుండు చంద్రుని యమృతకిరణప్రసారము సున్నపుంబూంతగను, బద్మముల రక్తిమవంటి రక్తిమ పద్మరాగముల చెక్కడముగను నొప్పారుచున్నది, మఱియు హంస (హంసమంత్ర ధ్యానపరులయొక్క - హంసలయొక్క) సమూహములచే నిత్యము నాశ్రయింపంబడుచున్నది.

మ. అనయంబున్ నఖరాజికాంతి విభవ వ్యాకీర్ణ ముద్యత్సుధా
ఘనధౌతంబయి, పద్మరాగయుతమై కన్పట్టుచున్ హంససే
వనమై పొల్చు సుమావరాంఘ్రి గృహగర్భంబందు భక్త్యంగనా
జనముం గూడి రహోవిహారి వగు స్వేచ్ఛన్ మన్మనోహంసమా !

47

అవతారిక: హృదయారామమున నారామలక్షణములు గలవని యను చున్నారు.

శ్లో. శమ్భుధ్యానవసన్తసఙ్గిని హృదారామేఽఘజీర్ణచ్ఛదా
స్స్రస్తా భక్తిలతాచ్ఛటా విలసితాః పుణ్యప్రవాళశ్రితాః,
దీప్యన్తే గుణకోరకా జపవచఃపుష్పాణి సద్వాసనా
జ్ఞానానన్దసుధామరన్దలహరీ సంవిత్ఫలాభ్యున్నతిః.

టీక: శ....ని - శమ్భుధ్యాన = ఈశ్వరధ్యాన మనెడి. వసన్తసఙ్గిని = వసంతర్తు సంబంధముగల, హృదారామే = హృదయమనెడి పూఁదోఁటయందు, స్రస్తాః = రాలిన, అఘ జీర్ణచ్ఛదాః = పాపములనెడి పండుటాకులును, విలసితాః = ప్రకాశమానములైన, పుణ్య ప్రవాళ శ్రితాః = పుణ్యములనెడి చిగురుటాకులను బొందినవియును, గుణకోరకాః = సుగుణములనెడి మొగ్గలు గలవియు, జప వచః పుష్పాః = జప వచనములనెడి పుష్పములు గలవియు, సద్వాసనాః = సత్కర్మ సంస్కారము లనెడి సువాసనలు గలవియునగు, భక్తి లతాచ్ఛటాః = భక్తి యనెడు తీవజొంపములును, జ్ఞానానన్ద సుధా మరన్ద లహరీ = జ్ఞానము, నానందము ననెడి యమృత మకరందములయొక్క ప్రవాహము, సంవిత్ఫలాభ్యున్నతిః = బ్రహ్మజ్ఞాన మనెడు ఫలాభివృద్ధియును, దీప్యన్తే = ప్రకాశించుచున్నవి.

తాత్పర్యము: శివా! మీ ధ్యానము వసంతర్తువుగా వచ్చుట వలన నా హృదయమనెడు నుద్యానములోఁ బాపములన్నియుఁ బండుటాకులవలె రాలిపోయినవి. పుణ్యములు చిగురుటాకులుగా విలసిల్లినవి. సగుణములు మొగ్గలుగా బయలుదేఱినవి. భక్తి తీవలు సాగుచున్నది. జప వచనములు పూవులుగా నుదయించినవి. సత్కర్మ సంస్కారములు సువాసనలు విరజిమ్ముచున్నవి. జ్ఞానానందము లమృతమకరందములుగాఁ బ్రవహించుచున్నవి, బ్రహ్మజ్ఞానము ఫలముగా నొప్పారుచున్నది. ఈ విధముగా నా హృదయ మారామలక్షణము లన్నియుఁ గలిగి యొప్పుచున్నది.

శా. నానాగస్తతిజీర్ణపర్ణములు క్రిందన్ రాలఁ, బుణ్యప్రవా
ళానూనశ్రితముల్, గుణాళి కలికల్, ప్రాంచజ్జపారంభ వా
క్సూనంబుల్ శుభ వాసనా భరితముల్ శోభిల్లె సద్భక్తి రూ
పానేక వ్రతతుల్ మనోవని శివధ్యానాత్మకం బామనిన్;
జ్ఞానానంద సుధా మరందలహరుల్, సంవిత్ఫలర్ధుల్ తగెన్.

48

అవతారిక: పరమశివధ్యానమే సర్వోత్తమఫలదాయకమని నిర్ణయించి యన్యదేవతాశ్రయణమునుండి మనస్సును మరలించుచున్నారు.

శ్లో. నిత్యానన్దరసాలయం సురమునిస్వాన్తామ్బుజాతాశ్రయం
స్వచ్ఛం సద్ద్విజసేవితం కలుషహృత్సద్వాసనావిష్కృతమ్,
శమ్భుధ్యానసరోవరం వ్రజ మనోహంసావతంస స్థిరం
కిం క్షుద్రాశ్రయపల్వలభ్రమణసఞ్జాతశ్రమం ప్రాప్స్యసి ?

టీక: మనోహంసావతంస = ఓ మానసరాజహంసమా! నిత్యానన్ద రసాలయం = శాశ్వతానంద మనెడి జలమునకు స్థానమును, సు....యం - సుర = దేవతలయొక్కయు, ముని = పరమ హంసలయొక్కయు, స్వాంత = హృదయములనెడి, అమ్బుజాత = పద్మములకు, ఆశ్రయం = ఆధారమును, స్వచ్ఛం = నిర్మలమును, సద్ద్విజసేవితం = యోగ్యులయిన ద్విజుల (రాజహంసముల) చేత సేవింపఁబడినదియు, కలుషహృత్ = పాప హరమును, సద్వాసనావిష్కృతమ్ = సత్కర్మ వాసనలచేత (సువాసనలచేత) ప్రకటింపఁబడినదియు నగు, శమ్భుధ్యాన సరోవరం = శివధ్యాన మనెడి సరశ్శ్రేష్ఠమును, స్థిరం = స్థిరమైనదానిని, వ్రజ= పొందుము, క్షు. మం - క్షుద్రాశ్రయ = అల్పుల నాశ్రయించుట యనెడి, పల్వల భ్రమణ = పడియలనుగూర్చిన త్రిప్పటచేత, సంజాత = పుట్టిన, శ్రమం = ఆయాసమును. కిం = ఏల, ప్రాప్స్యసి = పొందెదవు ?

తాత్పర్యము: ఓ నా మనోరాజహంసమా! క్షుద్రదేవతాశ్రయమువలనఁ గొన్ని పాపములు నశించిన నశించుఁగాక; శాశ్వతానందము లభింపదు. అది నీరు నిలిచెడు చిన్నచిన్నగుంటలకెల్లఁ బోయి యాయాసపడుటగాని వేఱుకాదు. అట్టి వృథాయాసమేల పడియెదవు ? శివధ్యానము చేయుము. అది సరోవరము. అందు శాశ్వతానందము జలముగను, దేవతలు, మునులు మున్నగువారి చిత్తములు కమలములుగను స్థిరముగా నిండియుండును. బ్రాహ్మణక్షత్రియాదులగు వారెల్లరును హంసాది పక్షులుగా నిత్యమును సేవించుచుందురు, అది పాపహరము. సత్కర్మసంస్కారమునఁగాని లభింపదు. సువాసనలను విరజిమ్ముచుండును. తక్కిన చెఱువులవలె నది యొకప్పుడును దఱుఁగునది కాదు. బహిరంగ సాధనములను విడిచి యంతరంగసాధనము నవలంబింపుమని భావము.

మ. సతతానందరసాలయంబు, దివిషత్ సన్మౌని చిత్తాబ్జ సం
శ్రితమున్, స్వచ్ఛము, సద్ద్విజాశ్రితము, దుష్కృత్యాపహారమ్ము, శా
శ్వత సద్వాసనమై తనర్చు స్థిరసాంబధ్యానకాసారసం
తతి హృద్ధంసము : చేయు; మేల పెఱగుంటల్ క్షుద్రముల్ చేరఁగన్?

49

అవతారిక : శివభక్తిసాధ్యమైన ఫలమును గోరుచున్నారు.

శ్లో. ఆనన్దామృతపూరితా హరపదామ్భోజాలవాలోద్యతా
స్థైర్యోపఘ్న ముపేత్య భక్తిలతికా శాఖోపశాఖాన్వితా,
ఉచ్చైర్మానసకాయమానపటలీ మాక్రమ్య నిష్కల్మషా
నిత్యాభీష్టఫలప్రదా భవతు మే సత్కర్మసంవర్ధితా,

టీక : ఆ...... తా - ఆనన్ద = (శివభక్తియందలి) ప్రీతియనెడి, అమృత = జలముతో, పూరితా = నింపఁబడినదియును, హ... లా - హర = శివునియొక్క, పదామ్భోజ = పాదపద్మములనెడి, ఆలవాల=పాదునుండి, ఉద్యతా=పుట్టినదియును- స్థైర్య = చిత్తస్థైర్యమనెడి, ఉపఘ్నం = ప్రాఁకును, ఉపేత్య = పొంది, శాఖోపశాఖాన్వితా = చిలవలతోఁ బలవలతో నల్లుకొనినదియును, ఉచ్చైః = ఎత్తయిన, మానస = మనస్సనెడు, కాయమాన = పందిరుల యొక్క, పటలీం = సమూహమును, ఆక్రమ్య = అలముకొని, నిష్కల్మషా = చీడపట్టనిదై, సత్కర్మ సంవర్ధితా = పూర్వకృత పుణ్యకర్మముల (దోహదక్రియల) చేత వృద్ధిపొందింపఁబడినదియు నగు, భక్తిలతికా = భక్తియను తీఁగ, మే = నాకు, నిత్యాభీష్టఫలప్రదా = శాశ్వతములైన నా యభీష్టఫలముల నిచ్చునది, భవతు = అగుఁగాక,

తాత్పర్యము : పరమేశ్వరసేవానురక్తియను నీటిచే నింపఁబడినదియును, బరమశివ పాదపద్మములనెడి పాదున మొలచినదియును, జిత్తస్థైర్యమనెడి ప్రాఁకును బొంది, చిలవలు పలవలు వైచినదియును, నున్నతమైన నా మనస్సనెడు పందిరిపై నలముకొని చీడపట్టనిదియును నగు భక్తిలత పురాకృతపుణ్యకర్మములనెడు దోహద క్రియలచే వృద్ధిపొంది నా కభీష్టములయిన శాశ్వతఫలముల నిచ్చుఁగాక.

మ. హరసేవాప్రమదాంబుపూర్ణ, శివపాదాబ్జాలవాలమ్మం. సు
స్థిరతోపఘ్నము నైన భక్తిలత వాసిం గొమ్మలన్ రెమ్మలన్
దఱచై మానస కాయమాన పటలిస్ వ్యాపించి నిష్పీడయై
పరంగున్ మత్కృషి నాకభీష్టఫలసంప్రాప్తిప్రదంబై కదున్.

50

అవతారిక : ఇప్పుడు శ్రీశైలవాసియగు భ్రమరాంబికా సమేత మల్లికార్జున స్వామిని భజించుచున్నారు.

శ్లో. సన్ధ్యారమ్భవిజృమ్భితం శ్రుతిశిరస్థానాన్తరాధిష్ఠితం
సప్రేమభ్రమరాభిరామ, మసకృత్సద్వాసనాశోభితమ్,
భోగీన్ద్రాభరణం సమస్తసుమనఃపూజ్యం గుణావిష్కృతం
సేవే శ్రీగిరిమల్లికార్జునమహాలిఙ్గం శివాలిఙ్గితమ్.

టీక : స. . తం - సన్ధ్యారమ్భ = సాయంసంధ్యారంభమున. విజృమ్భితం = తాండవనృత్యముచే విజృంభించునట్టియు, (పుష్పములు వికసించునదియు) శ్రు ........ తం - శ్రుతిశిరస్థానాన్తర = వేదములకు శిరస్థానమునైన యుపనిషత్తులనెడి యితరస్థలమందు, (చెవులయందుసు, దలమీఁదను). అధిష్ఠితం = బోధ్యముగా నున్నదియు (అలంకారముగా నున్నదియు), స. మం - సప్రేమ = ప్రేమతోఁ గూడిన, భ్రమరా (ర) = భ్రమరాంబచేతను, (తుమ్మెదలచేతను). అభిరామం = మనోహరమయినట్టియు. అసకృత్ = ఎల్లప్పుడును, సద్వాసనా = సాధువులయొక్క భావనచేత, (మంచివాసనచేత), శోభితం = ప్రకాశించునట్టియు. భో .. ణం - భోగీన్ద్ర = వాసుకి (భోగిశ్రేష్ఠులకు), ఆభరణం = భూషణముగాఁ గలిగినట్టియు. (భూషణమైనట్టియు), స ...... జ్యం - సమస్త = ఎల్ల, సుమనః = దేవతల (విద్వాంసుల) చేతను. (సకల పుష్పములకంటెను), పూజ్యం = పూజింపఁదగినట్టియు, గు ......తం - గుణ = సత్త్వగుణముచేత (సుగంధగుణముచేత), ఆవిష్కృతం = ప్రకటితమైనట్టియు, శివాలిఙ్గితం = పార్వతీదేవిచేతఁ గౌఁగిలించుకొనఁబడిన, శ్రీ ........గం - శ్రీగిరి = శ్రీశైలమందలి, మల్లికార్జున = మల్లెతీఁగ యల్లుకొనిన మద్దిచెట్టును బోలిన, మహాలిఙ్గం = పరమాత్మ సూచకమైన మహాలింగమును, సేవే = భజించుచున్నాను.

తాత్పర్యము : శ్రీశైలమునందలి మల్లికార్జున మహాలింగము మల్లెతీఁగ యల్లుకొనిన మద్దిచెట్టుతోఁ బోల్పఁబడినది. ఎట్లన, ఈశ్వరుఁడు సంధ్యాసమయమునఁ దాండవనృత్యముతో భక్తుల నానందింపఁజేయును. అది పుష్పవికాసములతో నట్లు చేయును. అతఁడు శ్రీశైలమందుఁగాక శ్రుతిశిరస్సు (ఉపనిషత్తు) లయందు నుండును. దాని పుష్పములు శ్రవణములయందును, శిరస్సులందును నలంకారములుగా నుండును. మల్లికార్జునుఁడు భ్రమరాంబతోడను, నర్జునవృక్షము భ్రమరములతోడను గూడి యొప్పును. ఈశ్వరునకు సద్వాసన (సాధుభావన) యొక్క శోభయు, దానికి సువాసన యొక్క శోభయుఁగలదు. భోగీంద్రుఁడు (శేషుఁడు) శివున కాభరణము. భోగీంద్రులకు- అనఁగా భోగిశ్రేష్ఠులకు దాని పుష్పము లలంకారములు. పరమేశ్వరుఁడు సుమనఃపూజ్యుఁడు. అనఁగా దేవతలచేఁ బూజ్యుఁడు. దాని పుష్పములు సర్వపుష్పములలోను బూజ్యములు. పరమశివుఁడు సత్త్వగుణమువలనఁ దెలియఁబడును. అది సుగంధగుణమువలనఁదెలియఁబడును, ఇట్లు శ్రీశైలమున శివాలింగితమైన మల్లికార్జునమహాలింగమూర్తిని భజించెదను.

శా. సాయంకాల విజృంభమున్, శ్రుతిశిరస్థ్సానాంతరస్థంబుఁ, బ్రే
మాయత్త భ్రమరాభిరామ, మసకృద్వ్యాస_త్తసద్వాసనా
మేయంబున్, సుమనఃప్రపూజ్యము, గుణోన్మీలంబు, భోగీంద్రభూ
షాయోగ్యంబును గొల్తు నెల్లపుడు నిష్ఠన్ స్వాంతమందున్ జగ
చ్ఛ్రేయ శ్రీగిరిమల్లికార్జునమహాలింగం బుమాశ్లిష్టమున్.

## 51

అవతారిక : భ్రమరాంబాపతిని భ్రమరపతినిగా నిరూపించి స్వమనఃపద్మమున విహరింపఁ బ్రార్థించుచున్నారు.

శ్లో. భృఙ్గీచ్ఛానటనోత్కటః కరిమదగ్రాహీ స్ఫురన్మాధవా
హ్లాదో నాదయుతో మహాసితవపుః పఞ్చేషుణా చాదృతః,
సత్పక్షస్సుమనోఽవనేషు స పునస్సాక్షాన్మదీయే మనో
రాజీవే భ్రమరాధిపో విహరతాం శ్రీశైలవాసీ విభుః.

టీక: భృ .టః - భృఙ్గి (గ్గీ) = భృంగియను ప్రమథునియొక్క (భృంగ జాతియొక్క), ఇచ్ఛా = అభిప్రాయముచేత (అపేక్షలను), నటన = నర్తించుట యందు (అనుకరించుటయందు), ఉత్కటః = ఉత్కటేచ్ఛ గలిగినట్టియు, క... హీ - కరి = గజాసురునియొక్క, మద = బలగర్వమును, (ఏనుఁగు మదమును), గ్రాహీ = అణఁచినట్టియు (గ్రహించు స్వభావము గలిగినట్టియు), స్ఫు . దః - స్ఫురత్ = ప్రకాశించుచున్న, మాధవ = మోహినీరూపుఁడైన మాధవునియందు (వసంతమందు), ఆహ్లాదః = ఆనందము గలిగినట్టియు, నాదయుతః = ప్రణవనాద ప్రతిపాద్యుఁడయినట్టియు (ఝుంకారధ్వనితోఁ గూడినట్టియు), మహత్(మహా = గొప్ప, సితవపుః = తెల్లని శరీరము గలిగినట్టియు (మహా-అసిత-వపుః=నల్లని శరీరము గలిగి నట్టియు), పఞ్చేషుణా = మన్మథునిచేత, ఆదృతః = బాణలక్ష్యముగను (సహాయ ముగను), ఆదరింపఁబడినట్టియు, సుమనః + అవనేషు = దేవతల (విద్వాంసుల) యొక్క సంరక్షణములయందు-సుమనః+వనేషు=పూలతోఁటలయందు, సత్పక్షః = అభిమానము గలిగినట్టియు, సాక్షాత్ = కన్నులయెదుట నున్నట్టియు, శ్రీశైలవాసీ = శ్రీశైలమందు లింగరూపమున నున్నట్టియు, విభుః = పలువిధములైన రూపము లగుచున్నట్టియు, భ్రమరాధిపః = భ్రమరాంబాపతి యనెడి భ్రమరశ్రేష్ఠము, మదీయే = నా సంబంధమైన, మనోరాజీవే = మనఃపద్మమునందు, విహరతాం = విహరించుఁగాక.

తాత్పర్యము: ఓయి శ్రీశైలవాసా! విభూ! భ్రమరాంబాపతీ! నీవు భ్రమరాధిపతివి. కావున నా చిత్తకమలమున విహరింపుము. నీవు నీ భక్తుఁడగు భృంగీశ్వరుని యిచ్ఛానుసారముగా వర్తింతువు, తుమ్మెదఱేఁడు తుమ్మెదల జాతి యపేక్ష ననుసరించి ప్రవర్తించును, నీవు గజాసురుని మదము నడఁచితివి. అది గజ ముల మదజలము గ్రహించును. నీకు మోహినీరూపమును ధరించిన మాధవునియం దాహ్లాదము స్ఫురించినది. దానికి వసంతమునం దాహ్లాదము స్ఫురించును. నీకుఁ బ్రణవనాదము, దానికి ఝుంకారనాదము. మన్మథుఁడు నిన్నుఁ బుష్పబాణముతో నాదరించెను. దానిని సహాయముగా నాదరించెను. నీకు సుమనోఽవనము (విద్వ ద్రక్షణమునం దభిమానము, దానికి సుమనోవనము = పుష్పవనమునం దభిమానము. కావున నా చిత్తకమలమునం దెడఁబాయక యుండుము.

గీ. భృంగి యిచ్ఛానుసృతిని వ ర్తించువాఁడు,
నంగజాదృతుఁడు, మహాసితాంగయుతుఁడు,
హ స్తి మదహారి, సుమనోవనాభిమాని,
నాద సహితుండు. మాధవాహ్లాదనుండు,
శ్రీనగావాసి విభుఁడు సర్వేశ్వరుండు
నైన భ్రమరాధినాథుఁ డనారతంబు
మామక మనోఽంబురుహమందు మసలుఁగాక!

52

అవతారిక: మేఘముగా నిరూపింపఁబడిన శంకరుని నా మనశ్చాతకము కోరుచున్నదని చెప్పుచున్నారు.

శ్లో. కారుణ్యామృతవర్షిణం ఘనవిపద్గ్రీష్మచ్ఛిదాకర్మఠం
విద్యా సస్య ఫలోదయాయ సుమనస్సంసేవ్య మిచ్ఛాకృతిమ్,
నృత్యద్భ క్తమయూర మద్రినిలయం చఞ్చజ్జటామణ్డలం
శమ్భో వాఞ్ఛతి నీలకన్ధర సదా త్వాం మే మనశ్చాతకః.

టీక: శమ్భో = సుఖోత్ప త్తి కారణమైనవాఁడా! నీలకన్ధర = నల్లని కంఠము గలవాఁడా, (నీల = నల్లని, కం = జలమును, ధర = ధరించినవాఁడా - మేఘుఁడా), మే = నాయొక్క, మనశ్చాతకః = మనస్సనెడి చాతకపక్షి, కారుణ్యామృతవర్షిణం = దయ యనెడి యమృతమును వర్షించునట్టియు (దయతో జలమును వర్షించునట్టియు), ఘ....ఠం-ఘన = గొప్పదియగు, విపద్ = ఆపద యనెడి (సస్యనాశము మున్నగు విపత్తుగల). గ్రీష్మ = అమితతాపమును (గ్రీష్మమును). ఛిదా = ఛేదించుటకు. కర్మఠం = సమర్థమయినట్టియు, వి. య - విద్యా సస్య = విద్యయనెడు పైరు యొక్క, ఫలోదయాయ = ఫలము (బ్రహ్మానందానుభవము) కలుగుటకొఱకు. సుమన స్సంసేవ్యం = దేవతలచేతను, సస్యాదిఫలమునందు మంచి మనస్సుగల పండితులచేతను (కర్షకులచేతను) సేవింపఁదగినట్టియు, ఇచ్ఛాకృతిం = కామరూప మయినట్టియు, నృత్యద్భ క్త మయూరం = నాట్యముచేయుచున్న భక్తులనెడు (మేఘ మందుఁ నెమళ్ళు గలిగినట్టియు, అద్రి నిలయం = కొండ వాసస్థానముగాఁ

గలిగినట్టియు, చఞ్చత్ + జటా మణ్డలం = చలించుచున్న జడలయొక్క (మెఱుపులయొక్క) సమూహము గలిగినట్టియు, త్వాం = నిన్ను, సదా = ఎల్లప్పుడును, వాఞ్ఛతి = కోరుచున్నది.

తాత్పర్యము: ఓయి శంభూ! నీలకంధరా! నా మనస్సనెడి చాతకము నీలమేఘమునువలెఁ దానభీష్టసిద్ధికై నిన్నుఁగోరుచున్నది. మేఘము దయతో జలమును వర్షించును. నీవు దయామృతమును వర్షింతువు. అది సస్యాదులను నశింపఁజేయు గ్రీష్మమును దొలఁగింపఁగలదు. నీవు మహాపదలను దొలఁగింతువు. అది సస్యములను జక్కఁగా ఫలింపఁజేయును. నీవును విద్యయనెడు సస్యమునకు బ్రహ్మానందానుభవమును ఫలముగాఁ గలిగింతువు. దేవతలు, పండితులు నిన్ను భజింతురు. శుభప్రదమైన సస్యఫలమందు మనస్సుగల కర్షకులు మేఘము నపేక్షింతురు. నెమళ్ళు మేఘునిఁ జూచి ప్రీతితో నాట్యము చేయును. అట్లే భక్తులు నీ మ్రోల నాట్యము చేయుదురు. నీవు కైలాసపర్వతమున నివసింతువు, మేఘమును బర్వతమున నుండును. కామరూపమును, జటామండలమును నుభయులకును గలదు. (మేఘపక్షమున జట యనఁగా మెఱుపు.)

శా. కారుణ్యామృతవర్షియున్, ఘనవిపద్ఘర్మచ్ఛిదాదక్షు, ని
చ్ఛారూపున్, సుమనోఽర్చ్య, నద్రినిలయున్, జంచజ్జటారాజి, వి
ద్యారూపాంచిత సస్య సత్ఫలదు, నృత్యద్భక్తబర్హిన్ మన
స్సారంగం బిది నీలకంధర! మహేశా! కోరు ని న్నెప్పుడున్.

53

అవతారిక: మహాదేవునియందు మయూరత్వమును నిరూపించి స్తుతించుచున్నారు.

శ్లో. ఆకాశేన శిఖీ సమస్తఫణినాంనేత్రా కలాపీ నతా
నుగ్రాహి ప్రణవోపదేశ నినదైః కేకీతి యో గీయతే,
శ్యామాం శైలసముద్భవాం ఘనరుచిం దృష్ట్వా నటన్తం ముదా
వేదాన్తోపవనే విహార రసికం తం నీలకణ్ఠం భజే.

టీక: యః = ఏ శివుఁడు (ఏ నెమలి), అకాశేన = ఆకాశముచేత, శిఖీ = శిఖావంతుఁడు అనఁగా వ్యోమకేశుఁ డనుట (శిఖండము గలిగిన నెమలి), సమస్త ఫణినాం నేత్రా = సర్వ సర్పనాయకుఁడైన వాసుకిచేత, కలాపీ = భూషణ వంతుఁడు (పింఛముగల నెమిలి), న...దైః - నత = నమ్రులైనవారిని, అనుగ్రాహి = అనుగ్రహించు స్వభావము గల, ప్రణవ = ప్రణవ మంత్రము యొక్క, ఉపదేశ = ఉపదేశమునందలి, నినదైః = ధ్వనులచేత, కేకీతి చ = కేకాధ్వని గలవాఁడు (కేకాధ్వని గల నెమలి) అనియును, గీయతే = గానము చేయఁబడుచున్నాఁడో, శ్యామాం = నల్లనిదియు, ఘనరుచిం = మేఘకాంతి వంటి కాంతి గల, శైలసముద్భవాం = పార్వతిని (పర్వతమందుఁబుట్టిన మేఘకాంతిని), దృష్ట్వా = చూచి, నటన్తం = నాట్యము చేయునట్టియు, వేదాన్తోపవనే = వేదాంత మనెడి యుద్యానవనమందు, విహారరసికం = విహరించుటయందు రసికుఁ డయినట్టియు, తం = ఆ, నీలకణ్ఠం = నల్లని కంఠముగల యీశ్వరుఁ డను నెమిలిని, ముదా= సంతోషముతో, భజే = సేవించుచున్నాను.

తాత్పర్యము: నెమలి శిఖండము గలది కనుక శిఖి, కలాపము గలది కనుకఁ గలాపి. కేకాధ్వని చేయునది కనుకఁ గేకి యనఁబడుచున్నది. నీవును నాకాశముచేత శిఖివి (వ్యోమకేశుఁడ వనుట). వాసుకిచేతఁ గలాపివి (భూషణము గలవాఁడవు). భక్తానుగ్రహార్థమైన ప్రణవనాదముచేతఁ గేకివి, మఱియును అది పర్వతమందుఁ బుట్టిన మేఘకాంతిని జూచి యానందముతో నృత్యము చేయును. నీవును హిమవత్పర్వతమునం దుదయించి మేఘకాంతితో నొప్పుచున్న యా శ్యామలాంబనుజూచి యానందతాండవము చేయుదువు. అది యుద్యానవనమందు విహరించును. నీవును వేదాంతోద్యానమునందు విహరింతువు. అది నీలకంఠము. నీవును నీలకంఠుఁడవు. వ్యోమకేశుఁడును, నాగభూషణుఁడును, ప్రణవోపదేశముచేత భక్తుల ననుగ్రహించువాఁడును, పార్వతీ వల్లభుఁడును, వేదాంతవేద్యుఁడును నగు నీలకంఠుని భజింతునని భావము.

మ. గగనానన్ శిఖియున్, గలాపియు భుజంగస్వామిచేఁ, గేకియున్
జగదుద్భ్రాత్ప్రణవోపదేశజనితాంచన్నాదసంఘమ్ముచే
నగుచున్ శ్యామలవర్ణ శైలజ ఘనోద్యత్కాంతి నీక్షించి యిం
పుగ వేదాంతవనంబునందు నటనంబుం జల్పుచున్ వేడుకన్
దగఁ గ్రీడించెడి నీలకంఠమహిమున్ ధ్యానింతు నశ్రాంతమున్.

54

అవతారిక: పార్వతీపరమేశ్వరులను మయూరీమయూరములనుగా నిరూపించి స్తుతించుచున్నారు.

శ్లో. సన్ధ్యా ఘర్మదినాత్యయో హరికరాఘాతప్రభూతానక
ధ్వానో వారిదగర్జితం దివిషదాం దృష్టిచ్ఛటా చఞ్చలా,
భక్తానాం పరితోషబాష్పవితతి ర్వృష్టి ర్మయూరీ శివా
యస్మి న్నుజ్జ్వలతాణ్డవం విజయతే తం నీలకణ్ఠం భజే.

టీక: సన్ధ్యా = సాయంకాలము, ఘర్మదినాత్యయః = మేఘ ప్రాదుర్భావ కాలముగను, హ....సః - హరి = విష్ణువుయొక్క, కర = హస్తములచేనైన, ఆఘాత = వాయించుటచేత, ప్రభూత = పుట్టిన, ఆనక = మద్దెలయొక్క, ధ్వానః = ధ్వని, వారిదగర్జితం = ఉఱుముగను, దివిషదాం = దేవతలయొక్క, దృష్టి చ్ఛటా = చూపుల పరంపర, చఞ్చలా = మెఱపుగను, భక్తానాం = భక్తుల యొక్క, పరితోషబాష్పవితతిః = సంతోషాశ్రుధార, వృష్టిః = వర్షముగను, శివా = పార్వతి, మయూరీ = ఆఁడు నెమలిగను, యస్మిన్ = ఏ నీలకంఠుఁ డను నెమలియందు, ఉజ్జ్వల తాణ్డవం = ప్రకాశమానమైన తాండవనృత్యము, విజయతే = సర్వోత్కృష్టముగా నున్నదో, తం = ఆ, నీలకణ్ఠం = శివుని, భజే = సేవించుచున్నాను.

తాత్పర్యము: సాయంకాలము వర్షాకాలముగను, విష్ణువు వాయించు మద్దెలమ్రోఁత యుఱుముగను, నాకాశమునుండి చూచుచున్న దేవతల చూపులు మెఱపులుగను, భక్తుల యానందబాష్పధార వృష్టిగను, బార్వతి మయూరిగను నుజ్జ్వలముగాఁ దాండవనృత్యమునుజేయు నీలకంఠుని (నీలకంఠమును) భజింతును.

శా. సాయంకాలమె వానకారు, హరిహస్తక్షేపజాతానక
స్ఫాయద్ధ్వానమె మేఘగర్జ, సురభాస్వద్దృష్టియే శంపయున్,
ధ్యాయద్భక్తముదశ్రులే జడియు, నార్యాదేవియే నెమ్మిగా
నా యష్టాత్మకుఁ డాడెఁ దాండవ మహో! యా నీలకంఠాఖ్యు నిన్
నా యుల్లంబున నిల్పి యన్వహము నానందంబునన్ గొల్చెదన్.

55

అవతారిక : శుద్ధరూపుఁడగు శంభుని నమస్కరించుచున్నారు.

శ్లో. ఆద్యా యామితతేజసే శ్రుతిపదై ర్వేద్యాయ సాధ్యాయ తే
విద్యానన్దమయాత్మనే త్రిజగత స్సంరక్షణోద్యోగినే,
ధ్యేయా యాఖిలయోగిభి స్సురగణై ర్గేయాయ మాయావినే
సమ్యక్తాణ్డవ సమ్భ్రమాయ జటినే సేయం నతి శ్శమ్భవే.

టీక : ఆద్యాయ = జగత్తునకు మొదటివాఁడును, అమితతేజసే = అపరిమిత తేజస్సు గలవాఁడును, శ్రుతిపదైః = వేదవాక్కులచేత, వేద్యాయ = తెలియఁదగినవాఁడును, సాధ్యాయ=భక్తానుగ్రహార్థము ప్రతిమాదిరూపమునఁ బ్రతిష్ఠింపఁబడినవాఁడును, విద్యానన్దమయాత్మనే = చిదానందమయాత్మ స్వరూపుఁడును, త్రిజగతః = మూఁడులోకములయొక్క, సంరక్షణ = సంరక్షణమందు, ఉద్యోగినే = ప్రవృత్తి గలవాఁడును, అఖిలయోగిభిః = ఎల్ల యోగులచేతను, ధ్యేయాయ=ధ్యానింపఁదగినవాఁడును, సురగణైః = దేవగణములచేత, గేయాయ=గానముచేయఁదగినవాఁడును, మాయావినే=చిచ్ఛక్తితోఁ గూడినవాఁడును, సమ్యక్తాణ్డవసమ్భ్రమాయ = సమంచిత తాండవనృత్యమందుఁ ద్వర గలవాఁడును, జటినే = జడలు ధరించినవాఁడును, శమ్భవే = సుఖకరుఁడును నగు, తే = నీకొఱకు, సా = ఆ, ఇయం = ఈ, నతిః = నమస్కారము.

తాత్పర్యము : జగదాద్యుఁడును, నమితతేజస్స్వరూపుఁడును, వేదవేద్యుఁడును, భక్తానుగ్రహార్థము ప్రతిమాదిరూపమునఁ బ్రతిష్ఠింపఁబడినవాఁడును, జిదానందమయాత్మ స్వరూపుఁడును, జగత్త్రయ సంరక్షణమందుఁ బ్రవృత్తిగలవాఁడును, సరయోగిజన ధ్యేయుఁడును, సురగణ గేయుఁడును, జిచ్ఛక్తితోఁగూడినవాఁడును, సమంచిత తాండవనృత్యమందు సంభ్రమించువాఁడును, జటియు, శంకరుఁడును నగు నీ కిదే నా నమస్కారము.

శా. ఆద్యుండున్, బహుతేజుఁడున్, శ్రుతిపదవ్యక్తుండు, సాధ్యాత్ముఁడున్,
విద్యానందమయాత్ముఁడున్, ద్రిజగతీ భీమోచనుండున్, సుర
ప్రోద్యద్గీతి యు, సర్వయోగిజనభావ్యుండున్, సుమాయావియున్,
హృద్యోద్యదంచితతాండవుండు, జటి యౌ శ్రీశంభుఁ గై మోడ్చెదన్.

56

అవతారిక : సకల జగత్స్వరూపుఁడగు పరమశివుని స్తుతించుచున్నారు.

శ్లో. నిత్యాయ త్రిగుణాత్మనే పురజితే కాత్యాయనీ శ్రేయసే
సత్యా యాదికుటుమ్బినే మునిమనఃప్రత్యక్షచిన్మూర్తయే.
మాయాసృష్టజగత్త్రయాయ సకలామ్నాయాన్తసఞ్చారిణే
సాయం తాణ్డవ సమ్భ్రమాయ జటినే సేయం నతి శ్శమ్భవే.

టీక : నిత్యాయ = నిత్యుఁడును. త్రిగుణాత్మనే = సత్త్వరజస్తమోగుణములు శరీరములుగాఁ గలవాఁడును, (బ్రహ్మ విష్ణు రుద్ర స్వరూపుఁడు). పురజితే = స్థూల సూక్ష్మ కారణ శరీరములను - లేక త్రిపురాసురులను జయించినవాఁడును, కాత్యాయనీశ్రేయసే = పార్వతీ తపః ఫలరూపుఁడును సత్యాయ = త్రికాలాబాధ్యుఁడును, ఆదికుటుమ్బినే = ప్రప్రథమ సంసారియును. ము .. ... యే - మునిమనః = మునుల మనస్సులకు. ప్రత్యక్ష = గోచరమైన, చిన్మూర్తయే = చిత్స్వరూపము గలవాఁడును, మా ....య-మాయా = మాయాశక్తిచేత, సృష్ట = సృజింపఁబడిన, జగత్త్రయాయ = ముల్లోకములు గలవాఁడును, స....ణే- సకల = ఎల్ల, ఆమ్నాయాన్త = ఉపనిషత్తులయందును, సఞ్చారిణే = సంచరించువాఁడును, (ఉపనిషద్వాక్యములచే బోధింపఁబడువాఁడు), సాయం తాణ్డవ = సంధ్యాతాండవమందు, సమ్భ్రమాయ = సంభ్రమించువాఁడును, జటినే = జడదారియు, శమ్భవే = సుఖకారణమైనవాఁడును, నగు, పరమేశ్వరునికొఱకు, సా = ఆ, ఇయం, = ఈ, నతిః = నమస్కారము.

తాత్పర్యము : నిత్యుఁడును, బ్రహ్మ విష్ణు రుద్ర రూపుఁడును, త్రిపుర జేతయుఁ బార్వతీ తపఃఫల స్వరూపుఁడును, త్రికాలాబాధ్యుఁడును, ముని మనోగోచర చిత్స్వరూపుఁడును, మాయచే ముల్లోకములను సృజించువాఁడును, వేదాంత వేద్యుఁడును, సాయంతాండవమందు సంభ్రమించువాఁడును, జడదారియు నగు శంభున కిదే నా నమస్కారము,

శా. నిత్యుండున్, త్రిగుణాత్ముఁడుం, బురహరుండున్, శైలాద్రిజాశ్రేయుఁడున్,
స్థాయి, న్నాదికుటుంబియున్, ముని మన స్స్వాధీన చిన్మూర్తియున్,
మాయాసృష్టజగత్త్రయుండు, సకలామ్నాయాంత సంచారియున్.
సాయంతాండవ సంభ్రముండు. జటి యౌ శంభూ ! ప్రణామం బిదే.

## 57

అవతారిక : సేవా పరిజ్ఞాన శూన్యుఁడ నయ్యును నేను నీ కవశ్యము సంరక్షణీయుఁడనని సహేతుకముగాఁ జెప్పుచున్నారు.

శ్లో. నిత్యం స్వోదరపోషణాయ సకలానుద్దిశ్య విత్తాశయా
వ్యర్థం పర్యటనం కరోమి భవత స్సేవాం న జానే విభో,
మజ్జన్మాన్తర పుణ్యపాక బలత స్త్వం శర్వ సర్వాన్తర
స్తిష్ఠస్యేవ హి తేన వా పశుపతే తే రక్షణీయో౽స్మ్యహమ్.

టీక : నిత్యం = అనవరతమును. స్వోదర పోషణాయ = తన పొట్ట నింపు కొనుటకొఱకు, విత్తాశయా = ధనకాంక్షతో, సకలాన్ = ధనవంతుల నందఱను, ఉద్దిశ్య = గుఱించి. వ్యర్థం = నిష్ప్రయోజనముగా, పర్యటనం = సంచారమును. కరోమి = చేయుచున్నాను. విభో = సర్వవ్యాపకుఁడవైన యో దేవా. భవతః = నీ యొక్క, సేవాం = భజనమును, న జానే = ఎఱుఁగను, పశుపతే = సకల ... త్వాలకుఁడవును, శర్వ = భక్త పాపనాశకుఁడవు నగు నో పరమేశ్వరా !. మ . త్వః . మజ్జన్మాన్తర పుణ్య = నా పూర్వజన్మార్జిత పుణ్యముయొక్క, పాకబలతః = పరి పాక వశమువలన. త్వం = నీవు, సర్వాన్తరః = అన్నమయాది కోశములన్నిటి కంటెను. సూక్ష్మరూపుఁడవై యంతర్యామివిగా నా యంతరంగమున, తిష్ఠ స్యేవ హి = ఉన్నావుగదా !. తేన వా = ఆ హేతువుచేతనైనను, తే = నీకు. అహం = నేను, రక్షణీయః = రక్షింపఁదగినవాఁడను. అస్మి = అగుదును.

తాత్పర్యము : దేవా ! నేను పొట్టపోసికొనుటకై ధనాశతో ధనవంతుల నెందఱనో యాశ్రయించి తిరుగుచుంటినే కాని నిన్ను సేవించుటెంతమాత్రము నెఱుఁగను. ఆ కారణముచే నన్నుపేక్షింపకుము. నా పూర్వజన్మపుణ్యవశముచే సర్వాంతర్యామివగు నీవు నాయందును నన్నమయాది పంచకోశ విలక్షణుఁడవై యున్నావు ! కావున నేను నీ కవశ్యము సంరక్షణీయుఁడను.

చ. అనయముఁ బొట్టకై వృథగ నందఱిచుట్టు ధనాశఁ దిర్గుచున్,
గన భవదీయసేవ; శివ ! నా జననాంతరపుణ్యకారణం
బున వసియింతు నా యెడ విభూ ! సకలాంతర సంస్థితుండవై
కనుక మదీయరక్షణము కార్య మవశ్యము నీకు నీశ్వరా !

58

అవతారిక: అజ్ఞానరూప ప్రతిబంధమును దొలఁగించి సాక్షాత్కరింపుమని పరమేశ్వరుని ప్రార్థించుచున్నారు.

శ్లో. ఏకో వారిజబాన్ధవః క్షితినభోవ్యాప్తం తమోమణ్డలం
భిత్వా లోచనగోచరోఽపి భవతి త్వం కోటిసూర్యప్రభః,
వేద్యః కిం న భవ స్యహో ఘనతరం కీదృ గ్భవే న్మత్తమ
స్తత్సర్వం వ్యపనీయ మే పశుపతే సాక్షాత్ప్రసన్నో భవ.

టీక: పశుపతే = ఓయి పరమేశ్వరా!, వారిజబాన్ధవః = సూర్యుఁడు, ఏకః = ఒక్కఁడయ్యును, క్షితినభోవ్యాప్తం = భూమ్యాకాశములు వ్యాపించిన, తమో మణ్డలం = అంధకారరాశిని, భిత్వా = భేదించి, లోచనగోచరోఽపి = కంటికిఁ గనఁబడుచున్నవాఁడును, భవతి = అగుచున్నాఁడు, త్వం = నీవు, కోటి సూర్య ప్రభః = కోటి సూర్యులయొక్క కాంతి గలవాఁడవు, వేద్యః = తెలిసికొనఁదగినవాఁడవు, కిం న భవసి=ఏలకావు? అహో = ఆశ్చర్యము, ఘనతరం = మిక్కిలి గొప్పదయ్యును, మత్తమః = నా యజ్ఞానాంధకారము, కీదృక్ = ఏపాటిది, భవేత్ = అగును? తత్ = కనుక, సర్వం = నా యజ్ఞానము నంతను, వ్యపనీయ = తొలఁగించి, సాక్షాత్ = ప్రత్యక్షమై, ప్రసన్నః = అనుగ్రహించువాఁడవు, భవ = అగుము.

తాత్పర్యము: మహాదేవా! ఒక్కఁడే యయిన సూర్యుఁడు భూమ్యాకాశముల నిండిన యంధకారమును బోఁగొట్టి కన్నుల కగుపడుచున్నాఁడు. కోటి సూర్యుల ప్రభ గలవాఁడవు. నీ వేల ప్రత్యక్షము గావు? ఎంత దట్టముగా నున్నను నా యజ్ఞానాంధకారమును దొలఁగించుట నీ కొక లెక్కయా? కాదు. నా యజ్ఞానమును బాపి ప్రత్యక్షమై ప్రసన్నుఁడ వగుము.

శా. నీరేజాప్తుఁ డొకండ భూనభములన్ నిండారు పెల్లౌ తమో
వారంబుం దొలఁగించి కాననగు; దేవా! కోటిసూర్యప్రభో
దారుండై తగు నీవు మత్తమము పెద్దా యద్ది యెంతయ్యు? నౌ
రా! రా వేల కనంగ? దాని నెఱిఁ బాఱంద్రోలి కన్పట్టవే!

59

అవతారిక: ఈశ్వరపాదారవిందభజనమును దమ మనస్సు కోరు విధమును నోపమానముగాఁ జెప్పుచున్నారు.

శ్లో. హంసః పద్మవనం సమిచ్ఛతి యథా నీలామ్బుదం చాతకః
కోకః కోకనదప్రియం ప్రతిదినం చన్ద్రం చకోర స్తథా,
చేతో వాఞ్ఛతి మామకం పశుపతే చిన్మార్గమృగ్యం విభో
గౌరీనాథ భవత్పదాబ్జయుగళం కైవల్యసౌఖ్యప్రదమ్.

టీక: పశుపతే = సకలభూతాధిపతీ, విభో = సర్వవ్యాపకుఁడా, గౌరీనాథ = పార్వతీపతీ, హంసః = హంసము, పద్మవనం = తామరల గుంపును, చాతకః = చాతకపక్షి, నీలామ్బుదం = నల్లని మేఘమును, కోకః = చక్రవాకప , కోకనదప్రియం = సూర్యుని, చకోరః = చకోరపక్షి, ప్రతిదినం = దిన దిన మును, చన్ద్రం = చంద్రుని, యథా = ఏ విధముగా, సమిచ్ఛతి = కోరుచున్నదో, తథా = ఆ విధముగా, మామకం = నా సంబంధమైన, చేతః = మనస్సు, చిన్మార్గ మృగ్యం = ఉపనిషత్తులయందు వెదకఁదగిన, కైవల్య సౌఖ్య ప్రదం = కేవల నిర్గుణపరబ్రహ్మభావమను సౌఖ్యము నొసఁగునట్టి, భవత్పదాబ్జయుగళం = మీ పాదపద్మద్వయమును, వాఞ్ఛతి = కోరుచున్నది.

తాత్పర్యము: ఓయి పార్వతీపతీ! పశుపతీ! విభూ! హంస పద్మములను, చాతకము వర్షాకాలమేఘమును, చక్రవాకము సూర్యుని, చకోరము చంద్రుని గోరునట్లు, వేదాంతవేద్యమై కైవల్యసౌఖ్యము నిచ్చునట్టి నీ పాదపద్మద్వయమును నా మనస్సు కోరుచున్నది.

చ. కమలవనంబు నంచయును, గారుమొయిళ్లను జాతకంబు, న
ర్యము నల చక్రవాకమును, నన్వహ మిందుఁ జకోర మెట్లటుల్
విమలభవత్పదాబ్జయుగళిన్ శివ! చిత్పథమార్గణీయ, ము
త్తమసుఖదమ్ముఁ గోరెడు నితాంతము నా మనమున్ మహేశ్వరా!

60

అవతారిక: శివపాదసేవను జేయుమని తమ మనస్సును నియమించుచున్నారు.

శ్లో. రోధ స్తోయహృత శ్శ్రమేణ పధిక శ్ఛాయాం తరో ర్వృష్టితో
భీత స్స్వస్థగృహం గృహస్థ మతిధి ర్దీనః ప్రభుం ధార్మికమ్,
దీపం సంతమసాకులశ్చ శిఖినం శీతావృత స్త్వం తథా
చేత స్సర్వభయాపహం వ్రజ సుఖం శమ్భోః పదామ్భోరుహమ్.

టీక. చేతః = ఓ చిత్తమా!, తోయహృతః = నీటిలోఁ గొట్టుకొనిపోవువాఁడు, రోధః = తీరమును, పధికః = బాటసారి, శ్రమేణ = బడలికచేత, తరోః = చెట్టుయొక్క, ఛాయాం = నీడను, వృష్టితః = వర్షమువలన, భీతః = భయపడినవాఁడు, స్వస్థగృహం = సుఖకరమైన యింటిని, అతిధిః = భోజన సమయమునకు వచ్చినవాఁడు, గృహస్థం = గృహస్థుని, దీనః = దరిద్రుఁడు, ధార్మికం = ధర్మాత్ముఁడైన, ప్రభుం = రాజును, సంతమసాకులః = చీఁకటిచేఁ గలఁగినవాఁడు, దీపం = దీపమును, శీతావృతః = చలిచే నలమటించువాఁడు, శిఖినం చ = అగ్నిని, యధా = ఏ విధముగా, (ఆశ్రయించునో), తధా = ఆ విధముగా, త్వం = నీవు, సర్వభయాపహం = ఎల్లభయములను బోఁగొట్టునట్టియు, సుఖం = సుఖకరమైనదియు నగు, శమ్భోః = శివునియొక్క, పదామ్భోరుహం = పాదపద్మమును, వ్రజ = ఆశ్రయింపుము.

తాత్పర్యము: ఓ చిత్తమా! ప్రవాహవేగమునఁ గొట్టుకొనిపోవువాఁడు తీరమును, బడలిన బాటసారి వృక్షచ్ఛాయను, వానకు భయపడువాఁడు సుఖప్రదమైన యింటిని, అతిథి గృహస్థుని, దరిద్రుఁడు ధార్మికుఁడైన ప్రభువును, అంధకారబాధితుఁడు దీపమును, జలిచే నలమటించువాఁ డగ్నిని నాశ్రయించునట్లు నీవును సర్వభయనివారకము, సుఖావహము నగు నీశ్వరపాదపద్మము నాశ్రయింపుము.

మ. జలమగ్నుండు దరిన్, బధిశ్రముఁడు వృక్షచ్ఛాయ, దీనుండు రా
జు లసద్ధార్మికు, వృష్టిభీతుఁ డిలు, గేస్తుం జుట్టమున్, దీవియన్
వెలయన్ దామసి, శీతపీడితుఁడు వహ్నిన్ బొందున ట్లీవు ని
ర్దళితానంతభయమ్ము శంభుపదపద్మం బందుమా డెందమా!

61

అవతారిక: భక్తిస్వరూపమును నిశ్చయించుచున్నారు.

శ్లో. అఙ్కోలం నిజబీజసన్తతి రయస్కాన్తోపలం సూచికా
సాధ్వీ నైజవిభుం లతా క్షితిరుహం సిన్ధు స్సరిద్వల్లభమ్,
ప్రాప్నోతీహ యథా తథా పశుపతేః పాదారవిన్దద్వయం
చేతోవృత్తి రుపేత్య తిష్ఠతి సదా సా భక్తి రిత్యుచ్యతే.

టీక: ఇహ = ఈ లోకమునందు, నిజబీజసన్తతిః = తన బీజముల సమూహము, అఙ్కోలం = ఊడుగుచెట్టును, సూచికా = ఇనుప సూది, అయస్కాన్తోపలం = సూదంటు రాతిని, సాధ్వీ = పతివ్రత, నైజ విభుం = స్వీయ భర్తను, లతా = తీఁగ, క్షితిరుహం = చెట్టును, సిన్ధుః = నది, సరిద్వల్లభం = సముద్రమును, యథా = ఏ ప్రకారముగా (తనంతట తానే) ప్రాప్నోతి = పొందు చున్నదో, తథా = ఆ ప్రకారముగా, చేతోవృత్తిః = చిత్తవృత్తి, పశుపతేః = ఈశ్వరునియొక్క, పాదారవిన్ద ద్వయం = పాదపద్మ యుగళమును, సదా = ఎల్లప్పుడును, ఉపేత్య = పొంది, తిష్ఠతి = ఉండును, సా = అది, భక్తి రితి = భక్తి యని, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది.

తాత్పర్యము: ఊడుగు గింజలు పండి నేల రాలి మరలఁ దమతుఁదామే యా చెట్టు నంటుకొనిపోవును. ఇనుపసూది యయస్కాంతమును దనకుఁదానే యంటుకొనును. పతివ్రత తన భర్తను విడువకుండును. తీఁగ దానికదియే చెట్టును బెనవైచుకొనును, నది తానయి సముద్రమును జేరును. అట్లే చిత్తవృత్తి యెప్పుడును శివుని పాదపద్మద్వయమును బట్టుకొనియుండుటకు భక్తి యని యందురు.

మ. ధుని వారాంనిధి నట్లు, సాధ్వి నిజనాథుం బోలె, నంకోలమున్
దన బీజావళి యట్టులుం, బ్రతతి తా ధాత్రీజముం బ్రాఁకు రీ
తి, నయస్కాంతము సూది యట్లు పురహృ ద్దివ్యాంఘ్రిపద్మద్వయిన్
మనముం జేరి సదా మెలంగుటయ సుమ్మా! భక్తి నా నెప్పుడున్.

62

అవతారిక: తల్లి బిడ్డను వలె భక్తి భక్తునిఁ గాపాడునని చెప్పుచున్నారు.

శ్లో. ఆనన్దాశ్రుభి రాతనోతి పులకం, నైర్మల్యత శ్ఛాదనం,
వాచా శఙ్ఖముఖ స్థితై శ్చ జఠరాపూర్తిం చరిత్రామృతైః,
రుద్రాక్షై ర్భసితేన దేవ వపుషో రక్షాం భవద్భావనా
పర్యఙ్కే వినివేశ్య భక్తిజననీ భక్తార్భకం రక్షతి.

టీక: దేవ = స్వప్రకాశ స్వరూపుఁడవైన యో పరమేశ్వరా!, భక్తి జననీ = నీ భక్తి యనెడు తల్లి, ఆనన్దాశ్రుభిః = ఆనందబాష్పములచేత, పులకం = రోమాంచమును, ఆతనోతి = విస్తరింపఁజేయును, నైర్మల్యతః = నిర్మలత్వముచేత, ఛాదనం (ఆతనోతి) = శీత మశకాది పీడ లేకుండ వస్త్రముచే నాచ్ఛాదించును. వాచా శఙ్ఖ ముఖస్థితైశ్చ = వేదవాక్కను శంఖముయొక్క, ముఖ మందున్నట్టి, చరిత్రామృతైః = నీ చరిత్రము లనియెడు పాలతో, జఠరాపూర్తిం (ఆతనోతి) = కడుపు నింపుటయుఁ జేయును, రుద్రాక్షైః = రుద్రాక్షలచేతను, భసితేన = విభూతిచేతను, వపుషః = శరీరముయొక్క. రక్షాం (ఆతనోతి) = రక్షణమును జేయును, భవద్భావనా పర్యఙ్కే = నీతలఁపనెడు మంచమందు, వినివేశ్య = పరుండఁబెట్టి, భక్తార్భకం = భక్తుఁ డనెడు శిశువును, రక్షతి = కాపాడును.

తాత్పర్యము: దేవా! తల్లి యనురాగాతిశయముచే నానందబాష్పములు విడుచుచు బిడ్డను హత్తుకొని రోమాంచితగాత్రుని జేయునట్లు భక్తి యానందబాష్పములతో భక్తుని పులకితగాత్రుని జేయును. తల్లి బిడ్డకు శీతమశకాదిపీడ లేకుండ బట్టను గప్పునట్లు భక్తి నిర్మల భావమును విస్తరింపఁజేయును. తల్లి శంఖములోఁబోసి శిశువును గడుపారఁ బాలుగుడుపునట్లు భక్తి వేదవాక్యముగా నీ చరిత్రామృతమును దనివితీర నాస్వాదింపఁజేయును. తల్లి బిడ్డకు రుద్రాక్షములు ధరింపఁజేసి విభూతిపెట్టి యంగరక్ష గావించి మంచముపైఁ బరుండఁజేసి కాపాడునట్లు భక్తి భక్తుని నీ భావనయందుంచి కాపాడును. భక్తుని రక్షింప భక్తికంటె వేఱొండు లేదని భావము.

శా. ఆనందాశ్రులఁ నింపు గగ్గురును, మైనాచ్ఛాదముం జేసెదున్
దా నైర్మల్యముచేత, రక్ష నిడు రుద్రాక్షన్, విభూతిన్, మహే
శానా! ఖ్యాతదఁచున్ గథామృతము వాక్పంఙ్క్తిస్థితం బిచ్చి, త్వ
ద్ధ్యానాఖ్యంబగు మంచమం దునిచి నిద్రంబుచ్చి భక్తార్భకున్
దా నోమున్ సతతమ్ము భక్తి నిజమాతంబోలె దేవా! శివా!

## 63

అవతారిక: శివభక్తిపై చిత్ర్యమును వర్ణించుచున్నారు.

శ్లో. మార్గావర్తితపాదుకా పశుపతే రఙ్గస్య * కూర్చాయతే
గణ్డూషామ్బునిషేచనం పురరిపోర్దివ్యాభిషేకాయతే,
కిఞ్చిద్భక్షితమాంసశేషకబళం నవ్యోపహారాయతే
భక్తిః కిం న కరోత్యహో వనచరో భక్తావతంసాయతే.

టీక: మార్గావర్తిత పాదుకా = పలుమఱు దారిని నడచుటచే, త్రొక్కఁబడిన చెప్పు, పశుపతేః = శివునియొక్క, అఙ్గస్య = అవయవమునకు, కూర్చాయతే = భ్రూమధ్యస్థానమువలె నాచరించుచున్నది, గణ్డూషామ్బునిషేచనం = పుక్కిలించిన నీరు చల్లుట, పురరిపోః = త్రిపురాసురవైరికి, దివ్యాభిషేకాయతే = గంగాజలాభిషేక మగుచున్నది, కిఞ్చిద్భక్షిత మాంసశేషకబళం = కొంచెము తినఁగా మిగిలిన మాంసపు ముద్ద, నవ్యోపహారాయతే = క్రొత్త నివేదనద్రవ్య మగుచున్నది, వనచరః = కిరాతుఁడు, భక్తావతంసాయతే = భక్తశిఖామణి యగుచున్నాఁడు, భక్తిః = భక్తి, కిం న కరోతి = ఏమి చేయదు?, అహో = ఎంత యాశ్చర్యము!

తాత్పర్యము: ఆహా! శివభక్తి మహిమ యెంత యాశ్చర్యకరము! దారిని నడచి నడచి ప్రాఁతదయిపోయిన కాలిచెప్పు శ్రీ కాళహస్తీశ్వరునకు భ్రూమధ్య

* ఒక భక్తుని భక్తిదార్ఢ్యమును బరీక్షింప భగవంతుఁడు కన్నుల నీరు దెచ్చుకొనఁగా, భక్తుఁడవి తీసి తన మంచికన్ను లమర్పఁబోయి గుఱుతునకుఁగాఁ దన కాలి చెప్పును దేవుని కనుబొమల నడుమ నుంచె నని పురాణ కథ.

స్థానమునకు గుఱుతుగా నుంపఁబడినది. ఒక భక్తుఁడు పుక్కిలించి యుమిసిన నీరు శివునకు గంగాజలాభిషేక మయినది. భుక్తావశిష్టమాంసఖండము పరమేశ్వరునకు మహానివేదనద్రవ్యముగా నుపయోగపడినది. కిరాతుఁడు భక్తశ్రేష్ఠుఁ డయ్యెను. భక్తి యేమి చేయలేదు !

చ. అఱిగిన ప్రాఁతచెప్పు శివునంగమునన్ విలసిల్లుఁ గూర్చమై;
పురపరిపంథికిన్ దగెడుఁ బుక్కిటి నీరు మహాభిషేకమై;
హరునకు భుక్తశేషపలలాశన మౌను నవోపహార; మ
య్యెఱుకయె యౌను భక్తమణి; యేమి యొనర్పదు భక్తియింకహో;

64

అవతారిక : తమ చిత్తపాదుకలు దొడిగికొని విహరింపుమని పరమేశ్వరునిఁ బ్రార్థించుచున్నారు.

శ్లో. వక్షస్తాడన మన్తకస్య కఠినాపస్మారసంమర్దనం
భూభృత్పర్యటనం నమత్సుర శిరః కోటీరసంఘర్షణమ్,
కర్మేదం మృదులస్య తావక పదద్వన్ద్వస్య గౌరీపతే
మచ్చేతోమణిపాదుకావిహరణం శమ్భో సదా౽ఙ్గీకురు.

టీక : గౌరీపతే = ఓ పార్వతీపతీ ! శమ్భో = మంగళకరా !. అన్తకస్య = యమునియొక్క, వక్షస్తాడనం = ఱొమ్మును దన్నుటయు, క ... . నం - కఠిన = కఠినమై (భేదింపరాని), అపస్మార = స్వరూపాజ్ఞానముయొక్క, సమ్మర్దనం = నిగ్రహించుటయు (అణఁగఁద్రొక్కుటయు), భూభృత్పర్యటనం = కైలాసపర్వతము నందు సంచరించుటయు, న....ణమ్ - నమత్ = నమస్కరించుచున్న. సుర = దేవతలయొక్క, శిరః = శిరస్సులయందలి, కోటీర = కిరీటములయందు. సంఘర్షణం = ఒరయికయు. ఇదం = ఈ నాలుగును, మృదులస్య = మెత్తనిదైన, తావక పదద్వన్ద్వస్య = నీ పాదద్వయముయొక్క. కర్మ = వ్యాపారము. మ.... ణం . మత్ = నాయొక్క, చేతః = చిత్తమనెడు, మణి పాదుకా విహరణం = మణిమయమైన పాదుకలతో సంచారమును, సదా = ఎల్లప్పుడును, అఙ్గీకురు = అంగీకరింపుము.

తాత్పర్యము : ఓ పార్వతీపతీ ? యముని తొమ్మను దన్నుట. యతికఠిన మైన యపస్మారము నణఁగఁద్రొక్కుట. కొండపైఁ దిరుగుట. నమస్కరించు దేవతల కిరీటముల ఘర్షణము ఈ నాలుగును నీ కర్మములు. ఇవి క్లేశకరములు. నీ పదము లతిమృదువులు. కావున నా మనస్సనెడి మణిపాదుకలను దొడిగికొనుట కంగీకరింపుము, నా మనస్సున నీ పాదములుంచి నన్ననుగ్రహింపుమని భావము.

మ. యమవక్షఃప్రహరమ్ము, భూరికఠిన ప్రాజ్ఞాన సంమర్దమున్,
నమదాదిత్యకిరీటఘర్షణ, మగేంద్రక్లిష్టసంచారమున్
శ్రమ మొఁ ద్వన్మృదుపాదపద్మముల కీశా ! నిత్యమున్ మన్మనో
రమణీయాంచితరత్నపాదుకలఁ బర్యాటంబు సల్పంగదే !

## 65

అవతారిక : పరమశివుని పాదపద్మములను భజించువానికి దుర్లభమేమియు లేదని నిశ్చయముగాఁ జెప్పుచున్నారు.

శ్లో. వక్షస్తాడనశఙ్కయా విచలితో వైవస్వతో నిర్జరాః
కోటీరోజ్జ్వలరత్నదీపకలికానీరాజనం కుర్వతే,
దృష్ట్వా ముక్తివధూ స్తనోతి నిభృతాశ్లేషం భవానీపతే
యచ్చేత స్తవపాదపద్మభజనం తస్యేహ కిం దుర్లభమ్.

అవతారిక: భవానీపతే = ఓ పార్వతీపతీ !. యత్ + చేతః = ఏ పురుషుని చిత్తము, తవ = నీయొక్క, పాదపద్మభజనం = పాదపద్మములను భజించునో, (తం) దృష్ట్వా = వానిని జూచి. వైవస్వతః = యముఁడు. వక్షస్తాడనశఙ్కయా = తొమ్మఁ దన్నునను భయముచేత, విచలితః = పాఱిపోవుచున్నాఁడు, నిర్జరాః = దేవతలు, కో...... నం - కోటీర = కిరీటములయందలి. ఉజ్జ్వల = ప్రకాశించుచున్న, రత్నదీప=దీపములవంటి రత్నములయొక్క, కలికా = అంకురముల చేత, నీరాజనం = నీరాజనమును, కుర్వతే = చేయుచున్నారు, ముక్తివధూః = ముక్తికాంత, నిభృతాశ్లేషం = గాఢాలింగనమును. తనోతి = చేయుచున్నది, తస్య = ఆ భక్తునకు, ఇహ = ఈ లోకమునందు, దుర్లభః = లభ్యము కానిది. కిం = ఏది ?

తాత్పర్యము: ఓయి పార్వతీపతీ! ఎవని చిత్తము మీ పాదపద్మములను భజించునో వానిని జూచి పూర్వమువలెనే తొమ్మన( దన్నుదురేమోయని భయపడి యముఁడు పాఱిపోవును. దేవతలు వానికాళ్లపైఁబడి మ్రొక్కి తమ కిరీటములందలి రత్నదీపములతో వానికి నీరాజనము నిత్తురు. ముక్తికాంత వానిని గాఢాలింగనము చేసికొనును. ఇఁక నీ భక్తునకు దుర్లభమయిన దేముండును?

శా. వక్షస్తాడనశంకచేఁ జలితుఁడౌ వైవస్వతుం డెంతయున్;
రక్షోవైరులు మౌళిరత్నముల సంధానింతు రారాత్రికల్,
మోక్షజ్ఞాక్షి కదించుఁ గౌఁగిట స్వయమ్మున్; నీదుపాదద్వయం
బక్షీణంబుగఁ గొల్చువారల కసాధ్యం బెద్ది శంభూ! యిటన్?

66

అవతారిక: 'నన్ను రక్షించుట నీకుఁ గర్తవ్య' మని ప్రార్థించుచున్నారు.

శ్లో. క్రీడార్థం సృజసి ప్రపఞ్చ మఖిలం క్రీడామృగా స్తే జనాః
యత్కర్మాచరితం మయా చ భవతః ప్రీత్యై భవత్యేవ తత్,
శమ్భో స్వస్య కుతూహలస్య కరణం మచ్చేష్టితం నిశ్చితం
తస్మా న్మామక రక్షణం పశుపతే కర్తవ్యమేవ త్వయా.

టీక: శమ్భో = సుఖకరుఁడవైన యోయి పరమేశ్వరా! అఖిలం = సమస్తమైన. ప్రపఞ్చం = లోకమును, క్రీడార్థం = విలాసమాత్రఫలముగా, సృజసి = సృజించుచున్నావు, తే = నీకు, జనాః = ప్రజలు, క్రీడామృగాః = విలాసార్థమైన జంతువులు. మయా = నాచేత, యత్ = ఏ, కర్మ = కర్మము, ఆచరితం = ఆచరింపఁబడినదో, తత్ = ఆ కర్మము, భవతః = నీయొక్క, ప్రీత్యై = సంతోషముకొఱకు, భవత్యేవ = అగుచున్నది. మత్ + చేష్టితం = నా వ్యాపారము, స్వస్య = నీదయిన, కుతూహలస్య = వేడుకకు, కరణం = సాధకమైనది, నిశ్చితం = నిశ్చయము, తస్మాత్ = దానివలన, పశుపతే = ఓయి పశుపతీ!, మామక రక్షణం = నా సంరక్షణము, త్వయా = నీచేత, కర్తవ్య మేవ = చేయఁదగినదియ.

తాత్పర్యము : ఓయి పరమేశ్వరా ! నీ వీ ప్రపంచమునంతను లీలార్థము సృజింతువు, ఈ ప్రజలు నీకుఁ గ్రీడామృగములు, తమ పెంపుడుజంతువుల నడవడిలు తమకుఁ బ్రేమాస్పదము లగుట జగత్ప్రసిద్ధము. కావున నాచేష్టలు నీకుతూహలము కొఱకనుట నిశ్చయము. అందుచే మద్రక్షణము నీకుఁ గర్తవ్యము.

శా. క్రీడార్థంబు సృజింతు వెల్లభువి, నీ క్రీడామృగంబుల్ జనుల్,
వీఁడే కర్మము చేయు నా యఖిల ముర్విన్ నీదు సంప్రీతికే;
క్రీడాఖేటక ! నీదువేడుకకె మత్కృత్యంబు సర్వంబు. నీ
వాఁడన్ మాకుకరక్షణంబు శివదేవా ! నీకుఁ గర్తవ్యమౌ.

67

అవతారిక : ఈశ్వరధ్యానము శరణుచొత్తు ననుచున్నారు.

శ్లో. బహువిధ పరితోష బాష్ప పూర
స్ఫుట పులకాఙ్కిత చారు భోగ భూమిమ్,
చిరపద ఫలకాఙ్క్షి సేవ్యమానాం
పరమసదాశివ భావనాం ప్రపద్యే.

టీక : బహు విధ = నానాప్రకారములయిన, పరితోషబాష్ప పూర = ఆనంద బాష్పములయొక్క ప్రవాహమునకు, స్ఫుట = స్పష్టమైన, పులకాఙ్కిత = రోమాంచరూపమైన భక్తిచిహ్నమునకు, చారు = రమ్యమైన, భోగభూమిం = భోగస్థానమును, చి....నాం - చిరపద = శాశ్వత కైలాస స్థానమనెడు, ఫల = ఫలమును, కాఙ్క్షి = కోరువారిచే, సేవ్యమానాం = సేవింపఁబడునది యగు, పరమ సదాశివ భావనాం = సర్వోత్కృష్టుఁడగు సదాశివుని ధ్యానమును, ప్రపద్యే = శరణు చొత్తును.

తాత్పర్యము : ఆనందాశ్రువులు, రోమాంచము నను భక్తిచిహ్నముల కాస్పదమై, శాశ్వతకైలాసవాసమును గోరువారి కాశ్రయమైన పరమసదాశివ ధ్యానము శరణుచొత్తును.

తే. బహువిధానందబాష్ప ప్రవాహమునకు
స్ఫుట పులక చిహ్న రమణీయ భోగభూమిఁ,
జిరపదఫలకాంక్షిజనాళి సేవ్యమానఁ
బరమశివభావనను నేను శరణుచొత్తు.

68

అవతారిక: తన భక్తిగోవును బరిపాలింపఁ బశుపతి నర్థించుచున్నారు.

శ్లో. అమిత ముదమృతం ముహు ర్దుహన్తీం
విమలభవత్పదగోష్ఠ మావసన్తీమ్,
సదయ పశుపతే సుపుణ్యపాకాం
మమ పరిపాలయ భక్తి ధేను మేకామ్.

టీక: సదయ = దయతోఁ గూడినవాఁడా! పశుపతే = ఓయి పశుపాలకుఁడా, అమిత ముదమృతం = అపరిమితానంద మనెడి పాలను, ముహుః = మాటిమాటికి, దుహన్తీం = పిదుకనిచ్చునదియు, విమల = నిర్మలమైన, భవత్పద = నీ పాదము లనెడు, గోష్ఠం = పశువుల చావడిని, ఆవసన్తీం = నివసించునదియు, సుపుణ్య పాకాం = మంచి పుణ్యములకు ఫలమైనదియు నగు, మమ = నాయొక్క, భక్తిధేనుం = భక్తియనెడు గోవును, ఏకాం = ఒక దానిని, పరిపాలయ = కాపాడుము.

తాత్పర్యము: ఓయి పశుపతీ! నీ వపారమైన దయ గలవాఁడవు. నా పుణ్యమునకు ఫలముగా నా కీ భక్తి యను గోవు లభించినది. ఇది యపరిమితానంద రూపమైన పాలను మాటి మాటికి నిచ్చును. నీ పాదరూపమైన పశువుల చావడిలోఁ గట్టుకొననిచ్చి యీ యావు నొకదానిని గాచిపెట్టుము.

క. అమిత ముదమృతం బిడు నెపు,
డమలభవత్పాదగోష్ఠమందు వసించున్,
విమల సుకృతి ఫల పరిపా
కము నా యొక భక్తిగోవుఁ గావు పశుపతీ!

69

అవతారిక: బహుదోషాశ్రయుఁడ నైనను జంద్రునివలె నన్నును నాదరింపుమని ప్రార్థించుచున్నారు.

శ్లో. జడతా పశుతా కళఙ్కితా
కుటిలచరత్వం చ నాస్తి మయి దేవ,
అస్తి యది రాజమౌళే
భవదాభరణస్య నాస్మి కిం పాత్రమ్ ?

టీక; జడతా = మౌఢ్యము (జలాత్మత), పశుతా = వివేకరాహిత్యము (పశుత్వము), కళఙ్కితా = కళంకము గలిగియుండుట, కుటిల చరత్వం చ = కుటిలముగా సంచరించుటయు, మయి = నాయందు, నాస్తి = లేదు, దేవ = ఓ మహాదేవా! రాజమౌళే = చంద్రశేఖరా!, అస్తి యది = ఉన్నయెడల, భవదాభరణస్య = నీ యలంకారమునకు, పాత్రం = తగినవాఁడను, నాస్మి కిం = కానా ?

తాత్పర్యము: దేవా! జడత్వము, పశుత్వము, కళంకిత, కుటిలచరత్వము నాకు లేవు. అవి యన్నియుఁ జంద్రున కున్నవి. అతఁడు జలమునఁ బుట్టినవాఁడు గావున జడుఁడు. గురుదారగుఁడు కావునఁ బశువు, కళంకము గలవాఁడుగనుకఁ గళంకి. కుటిలమైన బింబముతోఁ దిరుగువాఁడు కావునఁ గుటిలచరుఁడు, అట్టి చంద్రుని శిరస్సునఁ బెట్టుకొంటివి. చంద్రశేఖరా! నన్నుఁగూర్చి 'యీ లక్షణములు నీకును గలవు. నీవు మూఢుఁడవుగనుక జడుఁడవు, వివేకరహితుఁడవు కనుకఁ బశువవు. పాపి వగుటచేఁ గళంకివి. కుటిలప్రవర్తనమువలనఁ గుటిలచరుఁడ' వని యందువేని నేనుగూడ నీచేత భూషణముగా గ్రహింపఁదగినవాఁడనే.

ఆ.వె. లేదు నాకు జడత, లేదు పశుత్వంబు.
లేదు కుటిలగతియు, లేదు మచ్చ;
యవియ యున్న నాకు, నాభరణంబనై
మసల నొక్కొ రాజమౌళి! నీకు ?

70

అవతారిక : శివుఁడు సర్వదా నా హృదయముననే యుండుటవలఁన బూజింపుట సులభమని చెప్పుచున్నారు.

శ్లో. అరహసి రహసి స్వతన్త్రబుద్ధ్యా
వరివసితుం సులభః ప్రసన్నమూర్తిః,
అగణితఫలదాయకః ప్రభు ర్మే
జగదధికో హృది రాజశేఖరోఽస్తి.

టీక : ప్రసన్నమూర్తిః = ప్రసాదోన్ముఖమైన మూర్తిగలవాఁడును, అగణిత ఫలదాయకః = ఎన్న శక్యముగానిఫలముల నిచ్చువాఁడును, ప్రభుః = సర్వ సమర్థుఁడును, జగదధికః = జగత్తుకంటె నెక్కుడవాఁడును నగు, రాజశేఖరః = రాజమౌళి — సార్వభౌముఁడు చంద్రశేఖరుఁ డనియు ధ్వని. మే = నాయొక్క, హృది = హృదయమునందు, అరహసి = బహిఃప్రదేశమునను, రహసి = అంతః కరణప్రదేశమునను. స్వతన్త్రబుద్ధ్యా = స్వాయత్తుఁడను తలఁపుతో, వరివసితుం= పరిచర్య చేయుటకు, సులభః = సులభుఁడు, అస్తి = అగును.

తాత్పర్యము : స్వాధీనుఁడైన సార్వభౌముని నిచ్చవచ్చినచోటికిఁ గొనిపోయి నిజాభీష్టము సాధించుకొనుట సులభమయినట్లు, ప్రసాదాభిముఖుఁడై యెల్ల కోరికలను దీర్చుచు, సర్వసమర్థుఁడై జగదధికుఁడుగా నున్న యీ రాజమౌళి నాహృదయముననే యున్నాఁడుకావున బహిరంగముగను, నేకాంతముగనుగూడ స్వతంత్రముగాఁ బూజింప సులభుఁడగును.

తే. అగణితఫలప్రదుండును, జగదధికుఁడుఁ
బ్రభుఁ డతిప్రసన్నుఁడు నగు రాజమౌళి
కలఁడు మద్ధృదిఁ గావున సులభుఁడగును
స్వేచ్ఛ బహిరంతరమ్ముల సేవఁజేయ.

71

అవతారిక : ఈశ్వరస్మరణముచే విగతపాపుఁడై విద్వద్వరేణ్యుఁడు శివ సాయుజ్యము నొందునని చెప్పుచున్నారు.

శ్లో. ఆరూఢ భక్తి గుణ కుఞ్చిత భావచాప
యుక్తై శ్శివస్మరణ బాణగణై రమోఘైః.
నిర్జిత్య కిల్బిషరిపూన్ విజయీ సుధీన్ద్రః
స్సానన్ద మావహతి సుస్థిరరాజలక్ష్మీమ్.

టీక : సుధీన్ద్రః = విద్వద్వర్యుఁడు, ఆరూఢ ........................ యుక్తైః - ఆరూఢ = పాదుకొనిన, భక్తి = భక్తియనెడు, గుణ = అల్లెత్రాటి చేత, కుఞ్చిత = వంపఁబడిన, భావ = అంతఃకరణమను, చాప = ధనుస్సునందు, యుక్తైః = కూర్పఁబడిన, అమోఘైః = వ్యర్థములుగాని, శివ .......... గణైః - శివ = శివునియొక్క. స్మరణ = స్మరణమనెడి, బాణగణైః = బాణజాలములతో, కిల్బిషరిపూన్ = పాపములనెడు శత్రువులను, నిర్జిత్య = నిశ్శేషముగా జయించి, విజయీ = జయముగలవాఁడగుచు, సానన్దం = ఆనందముతోఁ గూడునట్లుగా, సుస్థిర రాజలక్ష్మీం = సుస్థిరమైన బ్రహ్మాదులకు రాజయిన పరమశివునియొక్క సారూప్యమనెడి స్థిరమైన రాజలక్ష్మిని, ఆవహతి = పొందుచున్నాఁడు.

తాత్పర్యము : లోకములో నొకరాజు ధనుర్బాణములతో శత్రురాజులను జయించి యా రాజలక్ష్మిని బొంది సార్వభౌముఁడగునట్లు విద్వద్వర్యుఁ డారూఢభక్తి యల్లెత్రాడుగను, నంతఃకరణప్రవృత్తి ధనుస్సుగను నమర్చుకొని, యం దీశ్వర స్మరణముస్సుబాణముగా నెక్కుపెట్టి, పాపములనెడు శత్రువులనెల్ల జయించి యానందముతోఁ బరమేశ్వరసారూప్యలక్ష్మిని బొందుచున్నాఁడు.

శా. ఆరూఢాంచిత భక్తి నామక దృఢ జ్యా కుంచితాంతర్ధను
స్స్ఫార ప్రాప్త మహేశసంస్మరణ శుంభద్బాణజాలమ్ముచే
ఘోరాగోరిపులన్ సుధీంద్రుఁడు పరిక్షుణ్ణమ్ముగాఁ గూల్చి య
వ్వారిన్ సుస్థిరరాజలక్ష్మిఁ బరఁగన్ బ్రాపించు సానందుఁడై.

72

అవతారిక : శివభక్తులు కృతార్థులని చెప్పుచున్నారు.

శ్లో. ధ్యానాఞ్జనేన సమవేక్ష్య తమఃప్రదేశం
భిత్వా మహాబలిభి రీశ్వర నామ మన్త్రైః,
దివ్యాశ్రితం భుజగభూషణ ముద్వహన్తి
యే పాదపద్మ మిహ తే శివ తే కృతార్థాః.

టీక : శివ = శంకరా !- ధ్యానాఞ్జనేన = ధ్యానమనెడి కాటుకచేత, సమవేక్ష్య = బాగుగాఁ జూచి, ఈశ్వరనామమన్త్రైః = ఈశ్వరుని నామమంత్రములనెడు, మహా బలిభిః = గొప్ప పూజోపకరణములచేత, తమఃప్రదేశం = అజ్ఞానమనెడు స్థలమును. భిత్వా = త్రవ్వి, యే = ఏ భక్తులు, దివ్యాశ్రితం = దేవతలచేతఁ బొందఁబడిన. భుజగభూషణం = సర్ప మాభరణముగాఁ గల, తే=నీయొక్క, పాదపద్మం = పాదకమలమును, ఇహ = ఈ జన్మమునందు, ఉద్వహన్తి = ఎత్తి కొనుచున్నారో, తే = వారు, కృతార్థాః = జన్మసాఫల్యమును బొందినవారు.

తాత్పర్యము : నిధులు వెదకువాఁడు కన్నుల కంజనము పూసికొని వానిని గనిపెట్టి యచ్చట నిధిరక్షకదేవతలను బూజించి త్రవ్వి యా నిధినిగొని ముదమొందునట్లు, భక్తుఁడు ధ్యానాంజనముతో మీ పాదపద్మములనెడు నిధిని గనుఁగొని మీ నామమంత్రములనెడు పూజాద్రవ్యములతో నావరణమైన యజ్ఞానమును దొలఁగించి దేవతాశ్రితమును, సర్పాలంకృతమును నగు మీ పాదపద్మములను గొని కొల్చి జన్మసాఫల్యముగాఁ బరమానంద మొందును.

తే. ధ్యానమను నంజనమ్మున నేత్రములఁ బూసి
చక్క నొక్క తమఃప్రదేశమ్ముఁ జూచి
త్రవ్వి పశుపతి నామమంత్రముల బలుల
సర్పభూషణమును, దివ్యసంశ్రితమ్ము
నెవరు త్వత్పదాంబుజద్వయి నెత్తికొంద్రు
వారు ధన్యులు గారె శివా ! ధరిత్రి.

73

అవతారిక: శివపాదారవిందభజనము నావశ్యకతను వక్కాణించుచున్నారు.

శ్లో. భూదారతా ముదవహ ద్యదపేక్షయా శ్రీ
భూదార ఏవ కి మత స్సుమతే లభస్వ,
కేదార మాకలిత ముక్తి మహౌషధీనాం
పాదారవిన్దభజనం పరమేశ్వరస్య.

టీక: సుమతే = ఓ సద్బుద్ధీ!, యదపేక్షయా = దేని యపేక్షచేత, శ్రీభూదార ఏవ = లక్ష్మియు, భూమియు భార్యలుగాఁ గల విష్ణువే, భూదారతాం = వరాహరూపమును, ఉదవహత్ = ధరించెనో, కిం = ఇది సుప్రసిద్ధమే కదా!, అతః = అందువలన, ఆకలిత ముక్తి మహౌషధీనాం — ఆకలిత = అపేక్షితము లైన, ముక్తి = సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్య ముక్తు లనియెడు, మహౌషధీనాం = గొప్ప మూలికలకు, కేదారం = పంటపొలమైన, పరమేశ్వరస్య = మహేశ్వరునియొక్క, పాదారవిన్ద భజనం = పాదపద్మ సేవను, లభస్వ = పొందుము.

తాత్పర్యము: ఓ సుమతీ! లక్ష్మియు, భూమియు భార్యలుగాఁ గల యా మహావిష్ణువే యా మహేశ్వరుని పాదసందర్శనమునకై వరాహరూపము ధరించినాఁడు. నీ వా పరమేశ్వరపాదపద్మభజనము చేయుము. దానివలన సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్యము లనెడు ముక్తులు పంటనేలయం దోషధులు ఫలించునట్లు ఫలించును.

క. భూదార మయ్యె మును శ్రీ
భూదారుఁడె యెద్ది కోరి, ముక్త్యోషధికిం
గేదారమైన తచ్ఛివ
పాదాంబుజభజన మొనరుపంగదె సుమతీ!

74

అవతారిక: స్వచేతఃపేటీసౌగంధ్యమును గోరుచున్నారు.

శ్లో. ఆశాపాశ క్లేశ దుర్వాసనాది
భేదోద్యుక్తై ర్దివ్యగన్ధై రమన్దైః,
ఆశాశాటీకస్య పాదారవిన్దం
చేతఃపేటీం వాసితాం మే తనోతు.

టీక: ఆశాశాటీకస్య = దిగంబరుఁడైన యీశ్వరునియొక్క, పాదారవిన్దం = పాదపద్మము, మే = నాయొక్క, చేతః పేటీం = చిత్తమనెడు పెట్టెను, ఆశా....న్దైః - ఆశాపాశ = పాశమువలె బంధకమైన యాశయు, క్లేశ = అవిద్య, అస్మితము, రాగము, ద్వేషము, అభినివేశము నను పంచక్లేశము లనెడు, దుర్వాసనాది = చెడ్డ సంస్కారము (దుర్గంధము) లను, భేద = భేదించుటయందు, ఉద్యుక్తైః = ప్రవృత్తములైన, అమన్దైః = తక్కువకాని, దివ్యగన్ధైః = దివ్యములైన పరిమళములచేత, వాసితాం = సువాసన గలదానినిగా, తనోతు = చేయుఁగాక.

తాత్పర్యము: దిగంబరుఁడైన పరమేశ్వరునియొక్క పాదపద్మము నా చిత్తపేటికయందలి యాశాపాశములు, పంచ క్లేశములు మున్నగు దుర్వాసనల నడఁచి దివ్యములైన సువాసనలతో నింపుఁగాక.

క. ఆశాపాశక్లేశ దు
రాశయ దుర్గంధ దళనమౌ గంధముచే
నాశాశాటీకపదకు
శేశయ మలరించు నాదు చేతఃపేటిన్.

75

అవతారిక: దానినే మఱియొక విధముగాఁ జెప్పుచున్నారు.

శ్లో. కల్యాణినం సరసచిత్రగతిం సవేగం
సర్వేఙ్గితజ్ఞ మనఘం ధ్రువలక్షణాఢ్యమ్,
చేత స్తురఙ్గ మధిరుహ్య చర స్మరారే
నేత స్సమ_స్తజగతాం వృషభాధిరూఢ.

టీక: వృషభాధిరూఢ = నందివాహనము నధిరోహించువాఁడా!, సమస్త జగతాం = సకలలోకములకును, నేతః = నాయకుఁడా!, స్మరారే = కామవైరీ! కల్యాణినం = శుభలక్షణములు గలదియు, సరసచిత్రగతిం = సరసములు చిత్రములు నైన యాస్కందిత ధౌరితక రేచిత వల్గిత ప్లుతము లనెడు నడకలు గలదియు, సవేగం = వేగముతోఁ గూడినదియు, సర్వేఙ్గితజ్ఞం = అందఱి యింగితములు నెఱిఁగినదియు, అనఘం = నిర్దుష్ట మయినదియు, ధ్రువ లక్షణాఢ్యం = సుళ్ళు మొదలైన స్థిరమైన చిహ్నములు గలదియు నగు, చేతస్తురఙ్గం = నా చిత్త మను గుఱ్ఱమును, ఆరుహ్య = ఎక్కి, చర = సంచరింపుము.

తాత్పర్యము: ఓయి సకలజగన్నాయకా! పరమేశ్వరా! నీకు వృషభ వాహనముకంటె గుఱ్ఱము నయము కదా! నీవు నా మనస్సనెడు గుఱ్ఱము నెక్కి చక్కఁగా స్వారి చేయుము. అది కల్యాణి. యజమానునకు శుభములను గలిగించు లక్షణములు గలిగియున్నది అనురాగము గలది. దీని నడకలు బహువిచిత్రములు. మిక్కిలి వేగము గలది. ఇంగితము నెఱిఁగి ప్రవర్తించును. దోషరహితమైనది. స్థిర లక్షణములు గలది.

తే. అఖిలజగదధిపతి; వృషభాధిరూఢ!
కామవైరి! సరసచిత్రగతి, ననఘము,
నలఘువేగమ్ము, ధ్రువలక్షణాఢ్య, మధిక
తర శుభకరము, సర్వేంగితజ్ఞ మైన
మన్మనస్తురంగమము సమంచితముగ
నెక్కి విహరింపరాదె మహేశ! నీవు?

76

అవతారిక: జన్మసాఫల్యమును భంగ్యంతరమునఁ జెప్పుచున్నారు.

శ్లో. భక్తి ర్మహేశపదపుష్కర మావసన్తీ
కాదమ్బినీవ కురుతే పరితోషవర్షమ్,
సంపూరితో భవతి యస్య మనస్తటాక
స్తజ్జన్మసస్య మఖిలం సఫలం చ నాన్యత్.

టీక: భక్తిః = భక్తి, మహేశ పద పుష్కరం = మహేశ్వర పాదము లనెడు నాకాశమున, ఆవసన్తీ = నిలుకడగా నున్నదై, కాదమ్బినీవ = మేఘమాల వలె, పరితోషవర్షం = అనంద వృష్టిని, కురుతే = కలిగించుచున్నది, (తేన = ఆ వృష్టిచేత). యస్య = ఎవనియొక్క, మనస్తటాకః = మనస్సనెడి చెఱువు, సంపూరితః = నింపఁబడినది, భవతి = అగునో, తజ్జన్మ సస్యం = అతని పుట్టువనెడి పైరు, అఖిలం = సమస్తమును, సఫలం = ఫలవంత మయినది (అగును). తదితరం చ = అదిగాక తక్కినది మాత్రము, న = (సఫలము) కాద.

తాత్పర్యము: భక్తి మేఘమాలవలెఁ బరమేశ్వరుని పాదపద్మము లనెడు నాకాశమునందు వ్యాపించినదియై యానందవర్షము కురియును. అట్టి యా వర్షముచే నెవని మనస్సరోవరమంతయు నిండునో వాని జన్మమనెడి పైరు సఫలమగును. తక్కినది కాదు. ఈశ్వర పాదారవింద భజనము లేక యానందము లభింపదని భావము.

చ. శివచరణాంబరంబున వసించుచు భక్తి పయోదమాల నా
నెవని మనస్తటాకము నహీనతరప్రమదప్రవృష్టిఁ బె
క్కువగను నింపు నాతని యశుంరితమౌ జనిసస్య మంతయున్
ధ్రువముగఁ బండుఁ; దక్కొరులదో-యది తప్పక యెండిపోయెడున్.

77

అవతారిక: ఇఁక రెండు శ్లోకములలో ననేకవిధములుగా విచారపడుచున్న బుద్ధియొక్క విచారమును గాపాడుటకు ప్రార్థించుచున్నారు.

శ్లో. బుద్ధి స్థిరా భవితు మీశ్వర పాదపద్మ
సక్తా వధూ ర్విరహిణీవ సదా స్మరన్తీ,
సద్భావనా స్మరణ దర్శన కీర్తనాది
సమ్మోహితైవ శివమన్త్రజపేన విన్తే.

టీక: ఈశ్వర = నిగ్రహానుగ్రహసమర్థుఁడవైన యో దేవా!, విరహిణీ = భర్తృవియోగమును బొందిన, వధూరివ = భార్యవలె, పాదపద్మసక్తా = (మీ) పాదపద్మములయందాసక్తి గలిగినది గనుకనే, సదా = ఎల్లప్పుడును, స్మరన్తీ = తలఁచుచున్న, బుద్ధిః = అంతఃకరణవృత్తి, శివమన్త్రజపేన = 'శివ' యను మీ నామమంత్రముయొక్క జపముచేత, సమ్మోహితైవ = మోహపడినదే యగుచు, స్థిరా = స్థైర్యము గలిగినది, భవితుం = అగుటకు, సద్భావనా ........ కీర్తనాది — సత్ = సత్యమైన మీ పాదపద్మముయొక్క, భావనా = ధ్యానము, స్మరణ = స్మరణము, దర్శన = దర్శనము, కీర్తన = కీర్తనము, ఆది = మున్నగువానిఁగూర్చి, విన్తే = విచారపడుచున్నది.

తాత్పర్యము: నిగ్రహానుగ్రహసమర్థుఁడవైన యో మహాదేవా! మీ పాదపద్మములయందాసక్తి గలిగియున్న నా బుద్ధి భర్తృవియోగమును బొందిన స్త్రీవలె నిరంతరము ధ్యానము చేయుచు, 'శివ' యను మీ నామమంత్రమును జపించుచు, మోహము నొందినదై స్థైర్యముకొఱకు మీ పాదధ్యానము, మీ పాదస్మరణము, మీ పాదసందర్శనము, మీ పాదసంకీర్తనము, మీ పాదపూజనము మున్నగువానినిగూర్చి విచారించుచున్నది. దీని నుద్ధరింపుము.

తే. నాదు బుద్ధి వియుక్తయౌ నాతి భాతి
శంకరా! తావకపదాబ్జసక్త యగుచు
సంస్మరించుచు శివమంత్రజపము కతన
మోహముం బొందెనో యన భుజగభూష!
త్వత్స్మృతి ధ్యాన కీర్తన దర్శనములఁ
గూర్చి చింతించుచున్నది కోరి స్థిరత.

78

అవతారిక: భావనాదివ్యాపారములయం దేమిచేయుదునని సందేహ మందుచున్న యీ నా బుద్ధికి శ్రేష్ఠగుణము నుపదేశించి విచారమును తొలఁగింపుమని వేఁడుకొనుచున్నారు.

శ్లో. సదుపచారవిధి ష్వనుబోధితాం
సవినయాం సుహృదం సముపాశ్రితామ్.
మమ సముద్ధర బుద్ధి మిమాం ప్రభో
వరగుణేన నవోఢవధూ మివ.

టీక: ప్రభో = సమర్థుఁడవైన యో పరమేశ్వరా!, సదుపచారవిధిషు-సత్ = సత్యమైన మీ పాదపద్మముయొక్క, ఉపచారవిధిషు = పూజావిధానముల యందు, అనుబోధితాం = క్రమముగా సుశిక్షితమైనదియు, సవినయాం = విధేయ మయినదియు, సుహృదం = శుద్ధమైన మనస్సు కలదియు, సదుపాశ్రితాం = మంచి యాశ్రయము గలదియు నగు, మమ = నాయొక్క, ఇమాం=ఈ, బుద్ధిం= బుద్ధిని, వరగుణేన = శ్రేష్ఠమైన గుణము నుపదేశించుటచేత, నవోఢ వధూ మివ= క్రొత్తగాఁబెండ్లాడిన భార్యనువలె, సముద్ధర ఉద్ధరింపుము.

తాత్పర్యము: సర్వసమర్థుఁడవైన యో పరమేశ్వరా! మీ పాదపూజ యందు సుశిక్షితమై వినయముతోఁగూడి పరిశుద్ధమనస్కయై పెద్దల నాశ్రయించు నా బుద్ధికి - నుపచారము చేయుటయందు సుశిక్షితురాలును, వినయవతియు, శుద్ధాంత రంగయు, నాశ్రయించియున్నదియు నగు క్రొత్తగాఁబెండ్లిచేసికొనిన భార్యను వలె సద్గుణోపదేశముచే సంశయనివృత్తిచేసి యుద్ధరింపుము.

తే. సదుపచారవిధిజ్ఞ, సుహృదయ, వినయ
వతి, సమాశ్రిత మద్బుద్ధి వరగుణాళి
నుద్ధరింపఁగదోయి ప్రభూ! నవోఢ
యైన వధువును బోలె నో యబ్జభూష!

79

అవతారిక : శివపాదప్రత్యక్షమును గోరుచున్నాడు.

శ్లో. నిత్యం యోగిమనస్సరోజదళసఞ్చారక్షమ స్త్వత్క్రమ
శ్శమ్భో తేన కథం కఠోరయమరాడ్వక్షఃకవాటక్షతిః,
అత్యన్తం మృదులం త్వదఙ్ఘ్రియుగళం హా మే మన శ్చిన్తయ
త్యేతల్లోచనగోచరం కురు విభో హస్తేన సంవాహయే.

టీక : శమ్భో = ఓ శంకరా : త్వత్క్రమః = మీ పాదవిన్యాసము, నిత్యం = ఎల్లప్పుడును, యో....మః - యోగి = యోగులయొక్క, మనః = మనస్సనెడు, సరోజ = పద్మముయొక్క, దళ = రేకులతోఁగూడ, సఞ్చార = కలిసి తిరుగుటయందు, క్షమః = సమర్థమయినది, తేన = అట్టి మృదువైన మీ పాదముతో, క... ..తిః - కఠోర = మిక్కిలి కఠినమైన, యమరాట్ = యమ ధర్మరాజుయొక్క, వక్షఃకవాట = తలుపువంటి రొమ్ముయొక్క, క్షతిః = ఛేదనము (తన్నుట), కథం = ఎట్లు ?, అత్యన్తం = మిక్కిలి, మృదులం = మృదువైన, త్వదఙ్ఘ్రియుగళం = మీ పాదద్వయమునుగూర్చి, మే = నాయొక్క, మనః = మనస్సు, చిన్తయతి = చింతిల్లుచున్నది, హా = అయ్యో, ఏతత్ = మీ పాదయుగళమును, లోచనగోచరం = కన్నుల కగపడువానినిగా, కురు = చేయుము, హస్తేన = చేతితో, సంవాహయే = పట్టి యొత్తుదును.

తాత్పర్యము : ఓ శంకరా! యోగిమనఃపద్మములందు సంచరింపఁదగిన మీ సుకుమారపాదములతోఁ దలుపువలె నతికఠినమైన యమధర్మరాజువక్షమును దన్నితివి, అయ్యో! నా మనస్సు మిక్కిలి బాధపడుచున్నది. దేవా! వానిని నాకన్నుల కగపడునట్లు చేయుము నా చేతులతో మీ పాదములనొత్తి సేవించెదను.

చ. సతతము యోగిహృత్సరసిజాత దళప్రచరక్షమమ్ము తే
గతి సహియించె నీ నడలు కట్టు! యమేశు సుదఃకవాటసం
క్షతి? మృదులమ్ము నీ పదయుగమ్ము భృశమ్ముఁ; గడుం దపించు నా
మతి; యెదుటం గనంబడుము పరమేశ్వర! కేల నొత్తెదన్.

80

అవతారిక : దానినే ప్రకారాంతరమునఁ జెప్పుచున్నారు.

శ్లో. ఏష్య త్యేష జనిం మనోఽస్య కఠినం తస్మి న్నటానీతి మ
ద్రక్షాయై గిరిసీమ్ని కోమలపదన్యాసః పురాభ్యాసితః,
నోచే ద్దివ్యగృహా న్తరేషు సుమన స్తల్పేషు వేద్యాదిషు
ప్రాయ స్సత్సు శిలాతలేషు నటనం శమ్భో కిమర్థం తవ.

టీక ; శమ్భో = శంకరా!, ఏషః = వీఁడు, జనిం = పుట్టువును, ఏష్యతి = పొందఁబోవుచున్నాఁడు, అస్య = వీనియొక్క, మనః = మనస్సు, కఠినం = కఠోరమైనది, తస్మిన్ = దానియందు, అటాని = తిరుగవలసినవాఁడను, ఇతి = అని, మద్రక్షాయై = నా రక్షణముకొఱకు, కోమల పద న్యాసః = మృదువుగా నడుగులు పెట్టుట, గిరిసీమ్ని = పర్వతప్రదేశమందు, పురా = (నేను బుట్టుటకుఁ) బూర్వము, అభ్యాసితః = అలవాటుచేయఁబడినది, నోచేత్ = అట్లుకాదేని, దివ్యగృహా న్తరేషు = దివ్యములైన గృహములయొక్క మధ్య ప్రదేశములును. సుమన స్తల్పేషు = పూలపాన్పులును. వేద్యాదిషు = అరఁగులు మున్నగునవియు. ప్రాయః = బహుళముగా, సత్సు = ఉండఁగా, శిలాతలేషు = ఱాతినేలలయందు, తవ = నీకు, నటనం = నాట్యము, కిమర్థం = ఎందుకొఱకు ?

తాత్పర్యము ; ఓయి గిరిశా ! నీవు నన్నుఁగూర్చి 'వీఁడు భూమిలోఁ బుట్టనున్నాఁడు. వీని మనస్సు మిక్కిలి కఠినము. అప్పుడు నాకు దానియందు సంచరింపవలసివచ్చును.' అని యాలోచించి నా సంరక్షణముకొఱకు నేను బుట్టకపూర్వమే కొండలపై నడచుట నీ కోమలపాదముల కలవాటుచేసితివి, అట్లుకానిచో దివ్యగృహములు. పూఁబానుపులు. మంచి యరఁగులు నుండఁగా నీ ఱాలపై నీవేల నాట్యము చేయవలసివచ్చినది ?

మ. 'జననం బందును వీఁడు; వీని హృది పెల్చన్ నిష్ఠురం; బందు నే
ట్లన నేఁ బోవలె' నంచు నాకొఱకుఁ గొండన్ మెట్టుటల్ నేర్చెనో
పదను నీ లేయడుగుల్ ! శివా! యదియ యొప్పుంగాక ! పూఁబానుపుల్,
ఘనసౌధమ్ములు, వేదులున్ గలుగ, నేలా ఱాలపైఁ ద్రిప్పటల్ ?

81

అవతారిక : ఇట్టి లక్షణములు గలవాఁడు జీవన్ముక్తుఁ డగునని చెప్పు చున్నారు.

శ్లో. కఞ్చిత్కాల ముమామహేశ భవతః పాదారవిన్దార్చనైః
కఞ్చి ద్ధ్యానసమాధిభిశ్చ నతిభిః కఞ్చి త్కథాకర్ణనైః,
కఞ్చిత్కఞ్చి దవేక్షణైశ్చ నుతిభిః కఞ్చి ద్దశా మీదృశీం
యః ప్రాప్నోతి ముదా త్వదర్పితమనా జీవన్ స ముక్తః ఖలు.

టీక : ఉమామహేశ = ఉమామహేశ్వరా ! కఞ్చిత్ కాలం = కొంతసేపు, భవతః = నీయొక్క, పాదారవిన్దార్చనైః = పాదపద్మముల పూజలతోడను, కఞ్చిత్ = కొంతసేపు, ధ్యానసమాధిభిశ్చ = ధ్యానముయొక్క నియమములతోడను, కఞ్చిత్ = కొంతసేపు, నతిభిః = నమస్కారములతోడను, కఞ్చిత్ = కొంత సేపు, కథాకర్ణనైః = కథలువినుటతోడను, కఞ్చిత్ = కొంతసేపు, అవేక్షణైః = దర్శనములతోడను, కఞ్చిత్ = కొంతసేపు, నుతిభిః = స్తోత్రములతోడను, ముదా = సంతోషముతో, త్వదర్పితమనాః = నీయందు సమర్పింపఁబడిన మనస్సుగలవాఁడై. ఈదృశీం = ఇటువంటి, దశాం = స్థితిని, యః = ఎవఁడు, ప్రాప్నోతి = పొందు చున్నాఁడో, సః = అతఁడు, జీవన్ = జీవించియున్నవాఁడగుచునే, ముక్తః ఖలు = మోక్షమును బొందినవాఁడగునుగదా !

తాత్పర్యము : ఉమామహేశ్వరా ! మనస్సును మీయందు నిలిపి యించుక సేపు మీ పాదపద్మముల పూజలును, గొంతసేపు మీ నిరంతరధ్యాననియమములును, గొంతసేపు మీ పాదనమస్కారములును. మఱికొంతసేపు మీ కథలు వినుటయుఁ, గొంతసేపు మీ దర్శనములును, గొంతసేపు స్తోత్రములును జేయుచు నిరంతరము సంతోషము నొందువాఁడు జీవన్ముక్తుఁ డగును.

ఉ. ఇంచుకకాల మోయి గిరిజేశ ; భవచ్చరణాంబుజార్చచే,
నించుక సేపు ధ్యానమున, నించుక వించుఁ గథల్, సమాధి నో
క్కించు, కవేక్షణమ్ముల నొకించుక, కొంత నతుల్ నుతుల్ సమ
ర్పించి, మనంబు నీ యెదగుఱించి యెవండు ముదంబుమీఱఁ బ్రా
పించునో యీదృశస్థితిని, బెంపగు వాఁడు సజీవముక్తుఁడై.

82

అవతారిక : శివుని ప్రసాదమువలననే విష్ణువు పూజ్యతరుఁ డయ్యెననీ చెప్పుచున్నారు.

శ్లో. బాణత్వం వృషభత్వ మర్ధవపుషా భార్యాత్వ మార్యాపతే!
ఘోణిత్వం సఖితా మృదఙ్గవహతా చేత్యాదిరూపం దధౌ,
త్వత్పాదే నయనార్పణం చ కృతవాన్ త్వద్దేహభాగో హరిః
పూజ్యా త్పూజ్యతర స్స ఏవ హి నచే త్కోవా తదన్యోఽధికః.

టీక : ఆర్యాపతే = ఓ పార్వతీపతీ! హి = ఏకారణమువలన, హరిః = విష్ణువు, బాణత్వం = (నీకు) బాణమగుటయు, వృషభత్వం = (నీకు) నందివాహన మగుటయు, అర్ధవపుషా = సగముమేనితో, భార్యాత్వం = (నీకు), భార్యయగు టయు. ఘోణిత్వం = (నీ పాదములను దర్శింప) వరాహమగుటయు, సఖితా = (మోహినియై). మిత్ర మగుటయు, మృదఙ్గవహతా చ = (తాండవ సమయమున) నీకు మార్దంగికుఁ డగుటయు, ఇత్యాదిరూపం = ఈ మొదలగు రూపమును. దధౌ = ధరించెనో, త్వత్పాదే = నీ పాదమునందు, నయనార్పణం చ = (కమలములతోఁ బూజించునప్పుడు వేయింటి పూర్తికై) తన నేత్రమును సమర్పించుటయు. కృతవాన్ = చేసినవాఁడయ్యెనో, చ = మఱియును, త్వద్దేహభాగః = నీ దేహమునందు భాగము గలవాఁడయ్యెనో. (కావుననే) స ఏవ = ఆ విష్ణువే, పూజ్యాత్ = పూజనీయుఁ లైన బ్రహ్మాదులకంటె, పూజ్యతరః = మిక్కిలి పూజింపఁదగినవాఁడు, నో చేత్ = అట్లుకాదేని, తదన్యః = ఆ విష్ణువుదక్క మఱియొకఁడు, అధికః = ఎక్కువవాఁడు, కో వా = ఎవఁడు ?

తాత్పర్యము : ఓ పార్వతీపతీ! త్రిపురాసురసంహారకాలమున విష్ణువు నీకు బాణమయ్యెను, వృషభరూపుఁడై నీకు వాహనముగా నుండెను. నీకు భార్యయై యర్ధాంగమును బొందెను. నీ పాదములను దర్శింప వరాహరూపమును దాల్చెను. మోహినియై నీ వాల్లభ్యమును గాంచెను. నీవు తాండవము చేయునప్పుడు నీకు మార్దం గికుఁ డయ్యెను, వేయిపద్మముల కొక్కటి తక్కువకాఁగాఁ దన నేత్రపద్మమును నీ పాదముల నర్పించెను. నీ దేహమున నొక భాగమయ్యెను, కావుననే విష్ణువు బ్రహ్మా దులకంటెఁ బూజ్యతరుఁ డయ్యెను.

శా. బాణత్వంబు, వృషత్వమున్, సగమునై భార్యాత్వమున్, మిత్రతన్,
ఘోణిత్వంబు, మృదంగవాదితయు, నీకున్ మేనిభాగమ్మె శ్రీ
ప్రాణుం డొంది నిజాక్షిపద్మము భవత్పాదంబులందుంచె; శ
ర్వాణీనాథ! తదన్యుఁ డేఁ డిఁ కతఁడే ప్రాజ్యుండు పూజ్యాళిలోన్.

83

అ వ తా రి క : శివేతరదేవతల సేవవలన సుఖము లేదనియు, శివసేవవలన సౌఖ్యము లభించుననియుఁ జెప్పుచున్నారు.

శ్లో. జననమృతియుతానాం సేవయా దేవతానాం
న భవతి సుఖలేశ స్సంశయో నాస్తి తత్ర,
అజని మమృతరూపం సామ్బ మీశం భజన్తే
య ఇహ పరమసౌఖ్యం తే హి ధన్యా లభన్తే.

టీ క : జనన మృతి యుతానాం = జననమరణములతోఁ గూడిన, దేవతానాం = దేవతలయొక్క, సేవయా = సేవచేత, సుఖలేశః = సుఖలేశమును (విషయ సుఖమయినను), న భవతి = కలుగదు, తత్ర = అందు, సంశయః = సందేహము. నాస్తి = లేదు. యే = ఎవరు, అజనిం = జననశూన్యుఁడును, అమృతరూపం = మరణరహితరూపము గలవాఁడును, సామ్బం = అంబతోఁగూడిన వాఁడును, ఈశం = నిరతిశయ సుఖదాన సమర్థుఁడును నైన శివుని, ఇహ = దేహమున్నపుడే, భజన్తే = సేవించుచున్నారో, తే = వారు, ధన్యాః = కృతార్థులై, పరమసౌఖ్యం = మోక్షసుఖమును, లభన్తే = పొందుచున్నారు.

తా త్ప ర్య ము : అన్యదేవత లెల్లరును జననమరణములతోఁ గూడినవారు, అట్టివారిని సేవించువారికి విషయసుఖమయినను దృష్టిగాఁ గలుగదు, అందు సందియము లేదు. పార్వతీ సహితుఁడైన పరమేశ్వరుఁడు జనన మరణ రహితుఁడు, పరమ సౌఖ్యప్రదుఁడు. కావున శరీర మున్నప్పుడే శివుని సేవించువారు కృతార్థులై మోక్ష మందము నందుదురు.

తే. పుట్టువును జావు గల్గు విబుధులఁ గొల్వ
సౌఖ్యలేశంబు లేదు నిస్సంశయంబు.
పుట్టు వెఱుఁగని, యమృతరూపుని మహేశు
సాంబు నిటఁ గొల్చు ధన్యాత్ముఁ డందు ముక్తి.

84

అవతారిక: హృదయమందు బుద్ధితో నశినాభానము గలిగియుండఁ గోరుచున్నారు.

శ్లో. శివ! తవ పరిచర్యాసన్నిధానాయ గౌర్యా
భవ! మమ గుణధుర్యాం బుద్ధికన్యాం ప్రదాస్యే,
సకలభువనబన్ధో! సచ్చిదానన్దసిన్ధో!
సదయ! హృదయగేహే సర్వదా సంవస త్వమ్.

టీక: శివ = ఓ శుభదాయకా!, భవ = ఓ సకలోత్పాదకుఁడా!. సకలభువనబన్ధో = సర్వలోకములకు బంధువైనవాఁడా. సచ్చిదానన్దసిన్ధో = సచ్చిదానందములకు సముద్రుఁడైనవాఁడా, సదయ = దయాసహితుఁడా, గౌర్యా = పార్వతితోఁగూడ, తవ = నీయొక్క, పరిచర్యా సన్నిధానాయ = సేవించుటకు సమీపమున నుండుటకొఱకు, మమ = నాయొక్క, గుణధుర్యాం = గుణములను వహించిన, బుద్ధికన్యాం = బుద్ధియను కన్యను, ప్రదాస్యే = దానముచేసెదను, త్వం = నీవు, హృదయగేహే = (నా) హృదయమనెడి గృహమందు, సర్వదా = ఎల్లప్పుడును, సంవస = సుఖముగా వసింపుము.

తాత్పర్యము: దేవా! నీవు సకలసౌభాగ్యదాయకుఁడవు గానఁ గన్య కిచ్చు పుట్టించు పుంస్త్వగుణమును, సకలప్రపంచోత్పాదకుఁడవు గాన సంతానోత్పాదకతా గుణమును. సకలజగద్బంధుఁడవు గాన బంధుమత్త్వగుణమును, సత్స్వరూపుఁడవు గాన సాధుకారిత్వగుణమును, చిత్స్వరూపుఁడవు గాన నారోగ్యగుణమును, సదయుఁడవు గాన దయావత్త్వమును మున్నగు వరగుణము లన్నియు నీయందే కనుపట్టుచున్నవి. నీవే తగిన వరుఁడవు, బుద్ధియను నా కన్యకయు నెల్లగుణములు గలిగి

యున్నవి. గౌరీసహితుఁడవైన నీకు సేవచేయుటకు నీ యొద్దనుండునట్లు దీనిని గన్యాదానము చేసెదను. బ్రాహ్మవివాహమునఁ బరిగ్రహించి బుద్ధి యుభయపక్షములకును జతురతతో సమరసభావమును గలిగించి నా హృదయగృహమున నెల్లప్పుడు సుఖముతో విహరింపుము. నీకు మామగారనై యానందింతును.

మ. శివ! గౌరీసహితుండవై తనరు నీ సేవాప సాన్నిధ్యమీ
యవె! మద్బుద్ధిసుతాజ గుణాఢ్యన్ బెండ్లి యొనర్చెదన్;
భవ! కారుణ్యనిధాన! సర్వజగతీబంధూ! సదా నాదు హృ
ద్భవనంబందు వసింపవయ్య సుఖమొప్పన్ సచ్చిదానందభీ!

85

అవతారిక: 'నీపు కోరు సపర్యను జేయుటకు నేను సమర్థుఁడనుగా'నని భంగ్యంతరమునఁ జెప్పుచున్నారు.

శ్లో. జలధిమథనదక్షో నైవ పాతాళభేదీ
న చ వనమృగయాయాం నైవ లుబ్ధః ప్రవీణః,
అశన కుసుమ భూషా వస్త్ర ముఖ్యాం సపర్యాం
కథయ కథ మహం తే కల్పయా నీన్దుమౌళే.

టీక: ఇన్దుమౌళే = చంద్రశేఖరా!, తే = నీకు, అశన . ఖ్యాం . అశన = ఆహారము, కుసుమ = పువ్వు, భూషా = ఆభరణము, వస్త్ర = వస్త్రము, ముఖ్యాం = ప్రధానములుగాఁ గలిగిన, సపర్యాం = పూజను, కథం = ఎట్లు, కల్పయాని = కలిగింతును?, కథయ = చెప్పుము, అహం = నేను, జలధి మథన దక్షః = సముద్రమును ద్రచ్చుటకుఁ జాలినవాఁడను, నైవ = కానేకాను, పాతాళ = పాతాళమును, భేదీ = భేదించువాఁడను, న చ = కాను, వన = అడవి యందు, మృగయాయాం = వేఁటాడుటయందు, ప్రవీణః = నేర్పరియైన, లుబ్ధః = బోయవాఁడను, నైవ = కానే కాను.

తాత్పర్యము: చంద్రమౌళీ! నేను సముద్రమును మథింపఁ జాలిన వాఁడను గాను. అట్టిచో నీ కిష్టమైన కాలకూటాహారమునుగాని, పుష్పమువలె శిరో

భూషణముగఁ జంద్రునిగాని నే నెట్లీ నేర్తును? పాతాళలోకమును భేదించువాఁడ నైనను గాను. అట్టిచో నీ కిష్టమైన భుజగాభరణము నెట్లు కల్పింపఁగలను? అడవులందు వేఁటాడనేర్చిన బోయవాఁడను గాను. అట్టిచో నీ వభిలషించు గజచర్మవసనమును నే నెట్లు సమకూర్పఁగలను? ఇఁక నిన్ను నే నెట్లు పూజింపఁగలుగుదునో చెప్పుము.

మ. జలధిన్ ద్రచ్చఁగలేను నీ కళసపుష్పంబుల్ సమర్పింతు నె
ట్టులు? పాతాళముఁజేరఁజాల నిఁక నెట్టుల్ దేను భూషల్? వనీ
స్థలి వేఁటాడఁగలేను నీ కెటులు వస్త్రం బిత్తు నోయీ హలా
హలకంఠా! యిఁక నిట్టి నేవ నెటు చేయంగల్గుదున్ జెప్పుమా.

86

అవతారిక: పూజాసామగ్రి సమృద్ధిగా నున్నను, బూజాస్థానము తెలియకపోవుటవలనఁ బూజింప సమర్థుఁడను గా ననుచున్నారు.

శ్లో. పూజాద్రవ్యసమృద్ధయో విరచితాః పూజాం కథం కుర్మహే
పక్షిత్వం న చ వా కిటిత్వ మపి న ప్రాప్తం మయా దుర్లభమ్,
జానే మస్తక మఙ్ఘ్రిపల్లవ ముమాజానే న తేఽహం విభో
న జ్ఞాతం హి పితామహేన హరిణా తత్త్వేన తద్రూపిణా.

టీక: ఉమాజానే = పార్వతీపతీ!, పూజాద్రవ్య = పూజావస్తువులయొక్క, సమృద్ధయః = సమృద్ధులు, విరచితాః = సమకూర్పఁబడినవి, పూజాం = పూజను, కథం = ఎట్లు, కుర్మహే = చేయుదుము? దుర్లభం = పొంద శక్యముకాని, పక్షిత్వం = హంస పక్షిరూప మగుటయు, న చ వా = లేనిచో, కిటిత్వ మపి = వరాహరూప మగుటయైనను, మయా = నాచేత, న ప్రాప్తం = పొందఁబడలేదు, అహం = నేను, తే = నీయొక్క, మస్తకం = శిరస్సును, అఙ్ఘ్రిపల్లవం = చిగురుటడుగును, న జానే = ఎఱుఁగను, విభో = సర్వవ్యాపకుఁడా!, తద్రూపిణా = హంస వరాహ రూపములు పొందిన, పితామహేన = బ్రహ్మచేతను, హరిణా = విష్ణువుచేతను, తత్త్వేన = యథార్థముగా, న జ్ఞాతం హి = తెలియఁబడలేదు గదా!

తాత్పర్యము: పార్వతీపతీ! పూజాద్రవ్యములు సమృద్ధిగా నున్నను నేను నిన్నుఁ బూజించుట యెట్లు? నీ శిరస్సును దెలియదు. నీ పాదములును దెలియవు. నాకు హంసరూపమును, వరాహరూపమును దుర్లభములు. ఆ రూపము లను దాల్చిన బ్రహ్మయు, విష్ణుమూర్తియు మాత్రము తెలిసికొనఁగలిగిరా యేమి? అట్టి వారే తెలిసికొనఁజాలనప్పుడు, పూజాస్థానములగు మీ శిరస్సును, బదపల్లవమును, నే నెట్లు పూజింపఁగలుగుదును?

శా. పూజాద్రవ్యసమృద్ధి యున్న దయినన్ బూజించు టెట్టుల్ నినున్?
గాఁజాలన్ విహగంబ, నట్లు కిటినిం గాఁజాల నెట్లున్; భవా
నీజానీ! భవదీయ మస్తపదముల్ నేఁ గానఁ; దద్రూపులై
రాజీవప్రభవుండు విష్ణువును సంప్రాపించిరే యింతకున్?

87

అవతారిక: శివపాదభక్తిని మాత్రమే కోరుచున్నారు.

శ్లో. అశనం గరళం ఫణీ కలాపో
వసనం చర్మ చ వాహనం మహోక్షః,
మమ దాస్యసి కిం కి మస్తి శమ్భో
తవ పాదామ్బుజభక్తి మేవ దేహి।

టీక: శమ్భో = ఓయి శంకరా!, తవ = నీకు, అశనం = ఆహారము, గరళం = కాలకూటవిషము, కలాపః = భూషణము, ఫణీ = పాము, వసనం = వస్త్రము, చర్మ = ఏనికతోలు, వాహనం చ = వాహనమును, మహోక్షః = ముసలి యెద్దు, కిం = ఏమి, దాస్యసి = ఇత్తువు, మమ = నాకుఁ గావలసినది, కిం = ఏమి, అస్తి = ఉన్నది? తవ = నీయొక్క, పాదామ్బుజభక్తిం + ఏవ = పాద పద్మములయందలి భక్తిని మాత్రమే, దేహి = ఇమ్ము.

తాత్పర్యము: ఓయి శంకరా! నీ కాహారము విషము. ఆభరణము పాము. ధరించునది యేనుఁగుతోలు. వాహనము ముసలియెద్దు, ఇఁక నాకుఁ గావలసి దిన నీ కడ నేమున్నది? నీ వేమి యిత్తువు నీ? పాదపద్మభక్తి యొక్కటి మాత్రమే

యుష్మ. ఇచ్చట నీశ్వరుని నిందించినట్లు పైకిఁ గనఁబడుచున్నను, బర్యవసానమున స్తుతియే కాని నింద కాదు 'ఏష ఆత్మాఽపహత పాప్మా' యను శ్రుతివలన నీశ్వరుఁడు సర్వదోషవర్జితుఁడు, అశనము గిరళ మను భక్త రక్షణమే స్ఫురించుచున్నది. ఫణి భూషణ మనుట యతని యభయత్వమే ద్యోతిత మగుచున్నది. వసనము చర్మమనుట యతని నిస్పృహత్వము తెలియుచున్నది. వాహనము మహోక్షమనుట యతని దుష్ట నిగ్రాహకత్వ సూచకము. నాకుఁ గావలసినది నీ కడ నేమున్నది యనుటలోఁ దన నైస్పృహ్యమే తోఁచుచున్నది.

చ. విస మశనమ్ము నీకుఁ బృథివీరథ ! భూషణమో ఫణీంద్రుఁడున్,
వసనమొ యేన్గుతోలు, మఱి వాహనమో ముదియెద్దు, నాకు నే
మొసఁగెద ? వాదిభిక్షుకుఁడ వో శివ ! నీ కడ నున్న దేమి ? నా
కొసఁగుము త్వత్పదాంబురుహయుగ్మవినిశ్చలభక్తి యొక్కఁడే.

88

అవతారిక : ఇట్టివాఁడను గాఁగలుగుదు నేని నీ యర్చన స్తోత్ర ధ్యానములను జేయఁజాలుదు నని చెప్పుచున్నారు.

శ్లో. యదా కృతామ్భోనిధి సేతుబన్ధనః
కరస్థలాధఃకృతపర్వతాధిపః,
భవాని తే లఙ్ఘితపద్మసమ్భవ
స్తదా శివార్చా స్తవ భావన క్షమః.

టీక : శివ = ఓయి శంకరా !, యదా = ఎప్పుడు, కృ....నః - కృత = చేయఁబడిన, అమ్భోనిధి = సముద్రమునందు, సేతుబన్ధనః = వారధి నిర్మాణము గలవాఁడను, కరస్థల = అఱచేతిలో, అధఃకృత = క్రిందుపఱుపఁబడిన, పర్వతాధిపః = వింధ్యపర్వతము గలవాఁడను, ల....వః - లఙ్ఘిత = అతిశయితుఁడయిన, పద్మసమ్భవః = బ్రహ్మదేవుఁడు గలవాఁడను, (అగుదునో), తదా = అప్పుడు, తే = నీయొక్క, అ ...మః - అర్చా = పూజయందును, స్తవ = స్తోత్రమునందును, భావన = ధ్యానమునందును, క్షమః = సమర్థుఁడను, భవాని = అగుదును.

తాత్పర్యము : ఓయి శంకరా ! సముద్రమునకు సేతువు గట్టిన శ్రీరాముఁడను, అఱచేత వింధ్యపర్వతమును నేల కణఁచిన యగస్త్యుఁడను, బ్రహ్మదేవుని కంటె మిన్నయగువాఁడను నే నగుదునేని గ్రహముగా నీ పూజా స్తోత్ర ధ్యానములు చేయ సమర్థుఁడ నయియుందును.

ఉ. ఎప్పుడు వార్ధిబంధనము నే నొనరింపఁగఁగల్గువాఁడనో,
యెప్పుడు పర్వతాధిపు మహీస్థలిఁ గేల నడఁచువాఁడనో,
యెప్పుడు పద్మసంభవున కెక్కుడువాఁ డనిపించుకొందునో
యప్పుడు దక్షుఁ డౌదు భవదర్చన సంస్తుతి భావనంబులన్,

89

తాత్పర్యము : శివునకుఁ బూజన తాడనములు రెండును ప్రీతికరములని తెలిసి తా నాచరించుట కం దేది ప్రియతరమని యడుగుచున్నారు.

శ్లో. నతిభి ర్నుతిభి స్త్వ మీశ పూజా
విధిభి ర్ధ్యానసమాధిభి ర్న తుష్టః,
ధనుషా ముసలేన చాశ్మభి ర్వా
వద తే ప్రీతికరం తథా కరోమి,

టీక : ఈశ = ఓ యీశ్వరా !, త్వం = నీవు, నతిభిః = నమస్కారములచేతను, నుతిభిః = స్తోత్రములచేతను, పూజావిధిభిః = పూజావిధానముల చేతను, ధ్యానసమాధిభిః = ధ్యాన సమాధుల చేతను, ధనుషా = వింటి దెబ్బచేతను, ముసలేన = రోఁకటి పోటులచేతను, అశ్మభి ర్వా = రాలు ఱువ్వుట చేతను వలె, తుష్టః = సంతోషించినవాఁడవు, న = కావు, తే = నీకు, ప్రీతికరం = (పయి రెంటను) ప్రియమైనది, వద = చెప్పుము, తథా = అట్లు, కరోమి = చేయుదును.

తాత్పర్యము : పరమేశ్వరా ! నీవు నమస్కారములు, స్తుతులు, పూజలు, ధ్యానములు, సమాధులు-అనువానితోఁ దృప్తినొందక వింటి దెబ్బలు, రోఁకటిపోటులు, రాల ఱువ్వులు ననువానిలో మిక్కిలి ప్రీతి నొందితివని వింటిని. అందు నీ కేది

ప్రియతరమో చెప్పిన నే నట్లు చేయుదును. అర్జునుఁడు శివుని వింటితోఁ గొట్టఁగొనతఁడు ప్రియమంది వానికిఁ బాశుపతము నిచ్చెనని పురాణగాథ.

తే. నతుల నుతులఁ బూజావిధానముల ధ్యాన
ముల సమాధుల సంతుష్టి గలుగదేని,
ధనువునను ముసలమున బాలను మహేశ!
తుష్టి యగునన్న నటె చేయుదును వచింపు

90

అవతారిక: త్రికరణశుద్ధిగా యథోచితముగా నిన్ను సేవింతు ననుచున్నారు.

శ్లో. వచసా చరితం వదామి శమ్భో
రహ ముద్యోగవిధాసు తేఽప్రసక్తః,
మనసాఽఽకృతి మీశ్వరస్య సేవే
శిరసా చైవ సదాశివం నమామి.

టీక: అహం = నేను, తే = నీయొక్క, ఉద్యోగ విధాసు = ఉన్నత యోగములయొక్క విధానములయందు, అప్రసక్తః = పరిచితి లేనివాఁడను, వచసా = వాక్కుచేత, శమ్భోః = సుఖస్వరూపుఁడ వగు, తే = నీ యొక్క, చరితం = చరిత్రమును, వదామి = చెప్పుచున్నాను, మనసా = మనస్సుచేత, ఈశ్వరస్య = ఈశ్వరుఁడవైన, తవ = నీయొక్క, ఆకృతిం = ఆకారమును, సేవే = సేవించుచున్నాను, శిరసా = శిరస్సుచేత, సదాశివం = నిత్యసుఖస్వరూపుఁడవైన, త్వాం + ఏవ = నిన్నే, నమామి చ = నమస్కరించుచున్నాను.

తాత్పర్యము: ఈశ్వరా! ఉన్నతములైన శివయోగముల పరిచయము నాకు లేదు. మన స్సంత నిలుకడగా నుండదు. కావున నేను వాక్కుతో మీ చరిత్రములు పలుకుచు, మనస్సుచే మీ యాకారమును ధ్యానించుచు, శిరస్సుతో మీ పాదపద్మములకు నమస్కరించుచు యథాశక్తి సేవింతును.

శా. నీ యుద్యోగ విధానముల్ దెలియ నింతేఁ జిత్తవిభ్రాంతిచేఁ;
నోయీ! నీ చరితంబుఁ బల్కెదను శంభూ! నేను నోరారఁగా;
నో యీశా! భవదాకృతిన్ మనసులో నొప్పారఁగాఁ గొల్చెదన్
మాయాభేత! సదాశివా! శిరమునన్ బ్రార్థింతు నిన్నే సదా.

91

అవతారిక: నీ పాదపద్మద్వయమునే సేవింతు ననుచున్నారు.

శ్లో. ఆద్యా ఽవిద్యా హృద్గతా నిర్గతాసీ
ద్విద్యా హృద్యా హృద్గతా త్వత్ప్రసాదాత్,
సేవే నిత్యం శ్రీకరం త్వత్పదాబ్జం
భావే ముక్తేర్భాజనం రాజమౌళే.

టీక: రాజమౌళే = ఓ చంద్రశేఖరా?, త్వత్ప్రసాదాత్ = నీ యనుగ్రహమువలన, హృద్గతా = హృదయమును బొందియున్న, ఆద్యా = మొట్టమొదటిది యగు, అవిద్యా = అజ్ఞానము, నిర్గతా = తొలఁగిపోయినది, ఆసీత్ = ఆయెను, యా = ఏ జ్ఞానము, హృద్ = హృదయగ్రంథిని నశింపఁజేయునో, (సా = అ), విద్యా = జ్ఞానము, హృద్గతా = హృదయమును బొందిన దయ్యెను, శ్రీకరం = సంపత్కరమును, ముక్తేః = మోక్షమునకు, భాజనం = కారణ మయినదియు నగు, త్వత్పదాబ్జం = నీ పాదపద్మమును, భావే = మనస్సునందు, నిత్యం = ఎల్లప్పుడును, సేవే = ధ్యానించుచున్నాను.

తాత్పర్యము: శివా! నీ యనుగ్రహమువలన నా యజ్ఞానము తొలఁగిపోయి హృదయగ్రంథిని భేదించు సుజ్ఞానము గలిగినది, సంపత్కరమును, మోక్షదాయకమును నగు నీ పాదపద్మద్వయమును సేవింతును.

తే. హృద్గతావిద్య యాద్య బహిర్గతంబు;
కలిగె హృద్గ్రంథి నెడలింపఁగలుగు విద్య
భవదనుగ్రహమున, ముక్తిభాజనంబు,
శ్రీకరము నీ పదాబ్జమ్ముఁ జిత్తమందు
నన్వహంబును గొల్తు నో యబ్జమౌళి!

92

ఆ వ తా రి క : ఈ సంసారసముద్రమునుండి తన్నుఁ గడతేర్చుమని వేఁడుకొనుచున్నారు.

శ్లో. దూరీకృతాని దురితాని దురక్షరాణి
దౌర్భాగ్య దుఃఖ దురహఙ్కృతి దుర్వచాంసి,
సారం త్వదీయచరితం నితరాం పిబన్తం
గౌరీశ మా మిహ సముద్ధర సత్కటాక్షైః.

టీ క : గౌరీశ = ఓ పార్వతీపతీ, దురక్షరాణి = నుదుట బ్రహ్మ వ్రాసిన దుర్లిపిసూచకములును, దురితాని = పాపముచేఁ గలిగినవియు, దౌ.........సి - దౌర్భాగ్య = దురదృష్టము, దుఃఖ = దఃఖము, దురహఙ్కృతి = దుష్టమైన దేహమందు 'అహం' అను నభిమానమును, దుర్వచాంసి=పరుషోక్తులును. సత్కటాక్షైః= నీ కడకంటి చూపులచేత, దూరీకృతాని = దూరముచేయఁబడినవిః సారం = సారమైన, త్వదీయ చరితం = నీ చరిత్రను, నితరాం = మిక్కిలి, పిబన్తం = త్రావుచున్న - వినుచున్న, మాం = నన్ను, ఇహ = ఈ పుట్టువునందు, సముద్ధర= ఉద్ధరింపుము.

తా త్ప ర్య ము : ఈశ్వరా ! నేను బుట్టినప్పుడు బ్రహ్మ నా నుదుట వ్రాసిన వ్రాఁతలకు సూచకము లయి పాపాచరణమువలనఁ గలిగిన దురదృష్టము, దుఃఖము, దురహంకారమును నీ కటాక్షవీక్షణముచేఁ బాసినవి. ఇఁక సారవంతమైన నీ చరిత్రములు వినుచుందును, నన్నీ సంసారసాగరమునుండి తరింపఁజేయుము.

తే. దురితములు, దురక్షరములు దుర్భగత్వ
దుఃఖ దురహంకృతులు నగు దుష్టవాక్కు
లుడిగె గౌరీశ ! కడకంట నోము మిటనె
సార భవదీయ చరితమ్ము సంతతమ్ము
వీనులారంగఁ గ్రోలెడువాని నన్ను.

93

అవతారిక : నిజ మనోరథము నర్థించుచున్నారు.

శ్లో. సోమకళాధరమౌళౌ
కోమలఘనకన్ధరే మహామహసి.
స్వామిని గిరిజానాథే
మామకహృదయం నిరన్తరం రమతామ్.

టీక : మామక హృదయం = నా చిత్తమును, సోమకళాధరమౌళౌ = శిరసునందుఁ జంద్రకళను ధరించినట్టియు, కోమల = మృదులమైన, ఘన = మేఘము వంటి, కన్ధరే = మెడగలిగినట్టియు, స్వామిని = సర్వనియంత యయినట్టియు, గిరిజానాథే = పార్వతీపతిరూపమైన, మహామహసి = మహాజ్యోతియందు, నిరన్తరం = ఎల్లప్పుడును. రమతామ్ = క్రీడించుఁగాక.

తాత్పర్యము : శిరసునందుఁ జంద్రరేఖయుఁ, గోమలమైన మేఘసన్నిభ కంఠమును గలిగి సర్వనియంతయై పార్వతీపరమేశ్వరరూపమున వెలయుచున్న పరంజ్యోతిస్స్వరూపమైన పరబ్రహ్మమునందు నా చిత్తమెప్పుడును విహరించు చుండుఁగాక.

శ్లో. సోమకళాశేఖరమును
శ్యామలఘనకంధరమ్ము స్వామియు గిరిజా
స్వామిక మురుమహమందున్
మామకహృదయము రమించు మానక యెపుడున్.

94

అవతారిక : జిహ్వాదులు పరమేశ్వరాయత్తము లగుటవలననే సాఫల్యము నొందునని చెప్పుచున్నారు.

శ్లో. సా రసనా తే నయనే తావేవ కరౌ స ఏవ కృతకృత్యః.
యా యే యౌ యో భర్గం వద తీక్షేతే సదార్చతః స్మరతి.

టీక: యా = ఏ నాలుక, భర్గం = భర్గుఁ డను మాటను, వదతి = పలుకు చుండునో, యే = ఏ కన్నులు, భర్గం = శివుని, ఈక్షేతే = చూచుచుండునో, యౌ = ఏ చేతులు, భర్గం = శివుని, సదా = ఎల్లప్పుడును, అర్చతః = పూజించు చుండునో, యః = ఎవఁడు, భర్గం = శివుని, స్మరతి = తలఁచుచుండునో, సా = అదియే, రసనా = నాలుక, తే = అవియే, నయనే = కన్నులు, తౌ + ఏవ = అవియే, కరౌ = చేతులు, స ఏవ = వాఁడే, కృతకృత్యః = కృతార్థుఁడు,

తాత్పర్యము: ఎల్లప్పుడు నీశ్వరనామము నుచ్చరించు నాలుకయే నాలుక; ఎప్పుడు నీశ్వరుని జూచుచుండు కన్నులే కన్నులు. అనుదిన మీశ్వరునిఁ బూజించుచుండు చేతులే చేతులు. నిరతముఁ బరమేశ్వరుని ధ్యానించుచుండు భక్తుఁడే కృతకృత్యుఁడు. తక్కినవి వ్యర్థములని భావము.

ఉ. ఏ యది భర్గు నెప్డు వచియించునొ యద్దియె జిహ్వయౌఁ జుమీ;
ఏ యవి భర్గుఁ జూచునొ యవే కనులై చను; భర్గునర్చలం
బాయక యేది చేయు నదె పాణియుగమ్మగు; భర్గు నేఁడు శ్ర
ద్ధాయతిమైఁ దలంచు మది నాతఁడె పో కృతకృత్యుఁడై తగున్.

95

అవతారిక: అతికఠినప్రదేశములందు సంచరింపవలసివచ్చెనను సంశయము ను విడువుచునుచున్నారు.

శ్లో. అతిమృదులౌ మమ చరణా వతికఠినం తే మనో భవానీశ,
ఇతి విచికిత్సాం సంత్యజ శివ కథ మాసీ ద్గిరౌ తథా ప్రవేశః.

టీక: శివ=ఓయి మంగళస్వరూపుఁడా!, భవానీశ = ఓ పార్వతీపతీ! మమ = నా యొక్క, చరణౌ = పాదములు, అతి మృదులౌ = మిక్కిలి కోమలములు, తే = నీ యొక్క, మనః = మనస్సు, అతి కఠినం = మిక్కిలి కఠినమయినది, ఇతి = అని, విచికిత్సాం = సంశయమును, సంత్యజ = విడువుము, తథా = అట్టి, గిరౌ = కొండమీఁద, ప్రవేశః = సంచరణము, కథం = ఎట్లు, ఆసీత్ = ఆయెను?

తాత్పర్యము: దేవా! పార్వతీపతీ! 'ఈ భక్తుని మనస్సు మిక్కిలి కఠినముగా నుండును. నా పాదములు మిక్కిలి కఠినములు. దానియందు నే నెట్లు సంచరింపఁగల' నను సంశయమును విడువుము. అతికఠినమైన పర్వతముపై నీవు పార్వతీసహితముగా సంచరించుట లేదా?

క. 'అతిమృదువులు మచ్చరణము
లతికఠినము నీదు చిత్తమను విచికిత్సన్
మతి నిడకుమోయి యీశా!
సతితో నెటు లుంటి వద్రిసానువులందున్?

## 96

అవతారిక: ఈశ్వరచరణమునఁ దన మనస్సును బంధింపఁ బ్రార్థించుచున్నారు.

శ్లో. ధైర్యాఙ్కుశేన నిభృతం
రభసా దాకృష్య భక్తిశృఙ్ఖలయా,
పురహర! చరణాలానే
హృదయమదేభం బధాన చిద్యన్త్రైః.

టీక: పురహర = ఓయి త్రిపురాసురసంహరుఁడా!, హృదయ మదేభం = (నా) మనస్సనెడి మదపుటేనుఁగును, ధైర్యాఙ్కుశేన = ధైర్యమనెడి యంకుశముతో, రభసాత్ = వేగమువలన, ఆకృష్య = స్వాధీనము చేసికొని, భక్తిశృఙ్ఖలయా = భక్తి యనెడి గొలుసుతో, చరణాలానే = (మీ) పాదమనెడి గజబంధనస్తంభమునందు, చిద్యన్త్రైః = ఈశ్వరమహిమవిషయకజ్ఞాన మనెడి యంత్రములతో, నిభృతం = కదలకుండునట్లు, బధాన = బంధింపుము.

తాత్పర్యము: పురహరుఁడవైన యో పరమేశ్వరా! శత్రుపురములను జయించిన రాజు మదగజముల నంకుశముతో వశపఱుచుకొని గొలుసులతోఁ గట్టుఁగంబములకుఁ గట్టియుంచునట్లు నా మనోగజమును ధైర్యమనెడి యంకుశముతో

స్వాధీనము చేసికొని భక్తి యను గొలుసుతో నీ మహిమజ్ఞాన మనెడి యంత్రము లతో నీ చరణ మనెడి కట్టుఁగంబమున బంధింపుము.

తే. త్రిపురహర। శంకరా। నాదు హృదయమత్త
కరిని రభసాన భక్తిశృంఖలను లాగి
ధృతి యనెడు నంకుశమున బంధింపుమయ్య।
యతిదృఢమ్ముగఁ జిద్యంత్రవితతిచేత.

## 97

అవతారిక: మనస్సునకు శాశ్వతపద మిమ్మని వేఁడుకొనుచున్నారు.

శ్లో. ప్రచర త్యభితః ప్రగల్భవృత్త్యా
మదవా నేష మనఃకరీ గరీయాన్,
పరిగృహ్య నయేన భక్తిరజ్వా
పరమ స్థాణుపదం దృఢం న యాముమ్.

టీక: పరమ = ఓ యపరిచ్ఛిన్నస్వరూపుఁడా।, మదవాన్ = మదము గలిగిన, గరీయాన్ = గొప్పదియగు, ఏషః = ఈ, మనః కరీ = మనస్సనెడు గజము, ప్రగల్భ వృత్త్యా = దుర్నివారవ్యాపారముతో, అభితః = అంతటను, ప్రచరతి = సంచరించుచున్నది, అముం = దీనిని, భక్తి రజ్వా = భక్తి యను త్రాటితో, నయేన = అనునయముతో, పరిగృహ్య = పట్టుకొని, స్థాణు = స్థిర మయిన, పదం = స్థానమును, దృఢం = మరలఁ దిరిగిరాకుండ, నయ = పొందిం పుము.

తాత్పర్యము: ఓయి యపరిచ్ఛిన్నానందస్వరూపా। ఈ నా మన స్సనెడి మత్తగజము దుర్నివారగమనముతో నలువలఁకులకుఁ బరువు లిడుచున్నది. దీనిని నీ భక్తి యనెడి త్రాటితోఁ గట్టి మెల్లఁగాఁ బట్టుకొని పునరావృత్తిరహితముగా సుస్థిర బ్రహ్మపదమును బొందింపుము. సగుణోపాసనమును జేయు నాత్మ పర్యవసానమున నిర్గుణభావము నొందును గావున మనస్సునకు నిర్విశేషఫలకమైన బ్రహ్మాకారత్వ మును గలిగింపు మని ప్రార్థించుట గ్రంథావసానమున సమంజసముగా నున్నది.

తే. కలయఁ దిరుగుచునుండుఁ బ్రగల్భవృత్తి
మన్మనఃకరి యిది పెద్ద మత్తిలినది;
భక్తిరజ్జువుచే దీనిఁ బట్టి నయత
స్థాణుపదమును బొందింపు ద్రఢిమఁ బరమ!

98

అవతారిక: కవి తన కవితను గన్యనుగా భావించి గౌరీప్రియుఁడగు పరమేశ్వరున కర్పించుచున్నాఁడు.

శ్లో. సర్వాలఙ్కారయుక్తాం సరళపదయుతాం సాధువృత్తాం సువర్ణాం
సద్భి స్సంస్తూయమానాం సరసగుణయుతాం లక్షితాం లక్షణాఢ్యామ్,
ఉద్యద్భూషావిశేషా ముపగతవినయాం ద్యోతమానార్థరేఖాం
కల్యాణీం దేవ గౌరీప్రియ మమ కవితాకన్యకాం త్వం గృహాణ,

టీక: గౌరీప్రియ = గౌరి ప్రియురాలుగాఁ గల, దేవ = మహాదేవా! సర్వ = సమస్తమైన, అలఙ్కార = ఉపమాద్యలంకారములతోను (భూషణములతోను), యుక్తాం = కూడినదియు, సరళ = మృదువైన - సుబోధమైన (మందమైన) పద = శబ్దములతో, (పదగతులతో), యుతాం = కూడినదియు, సాధువృత్తాం = సలక్షణములైన యార్యాదివృత్తములు గలదియు (మంచినడక గలదియు) సువర్ణాం = పరుషములుగాని యక్షరములు గలదియు. (చక్కని రూపముగలదియు), సద్భిః = కావ్యలక్షణ (శరీరలక్షణ) వేత్తలగు విద్వాంసులచేత. సంస్తూయమానాం = పొగడఁబడుచున్నదియు. సరసగుణయుతాం = శృంగారాదిరసములతోను, మాధుర్యాది గుణములతోను గూడినదియు, (భర్తృప్రీతికరముగా సరసముగను గుణవతిగను నుండునదియు, లక్షితాం = ప్రతిపాద్యవస్తువుగలదియు (వరణీయగా నెంచఁబడినదియు) లక్షణాఢ్యాం = సర్వలక్షణములతో నొప్పునదియు, ఉద్యత్ = ఎక్కువగాఁ బ్రకాశించుచున్న, భూషావిశేషాం = అలంకారవిశేషము గలదియు (సౌశీల్యము గలదియు), ఉపగత = తెలియఁబడిన, వినయాం = కవియొక్క వినయము గలదియు (పొందఁబడిన నమ్రతగలదియు), ద్యోతమాన = స్ఫురించుచున్న, అర్థరేఖాం = అర్థముల వరుస గలదియు), (భాగ్యరేఖ గలదియు) కల్యాణీం = అర్థపుష్టితో శోభించునదియు నగు, మమ = నాయొక్క, కవితా కన్యకాం = కవిత యనెడి కన్యకను, త్వం = నీవు, గృహాణ = స్వీకరింపుము.

తాత్పర్యము : గౌరీప్రియుఁడవైన యో మహాదేవా ! ఈ నా కవితాకన్యక కన్యాలక్షణములు గలిగి కల్యాణమునకుఁ దగియున్నది. కన్య సర్వాభరణములు గలిగి యుండునట్లే, యిదియు సర్వాలంకారములు గలిగియున్నది. కన్య సరళపదయై (మంద గమనయై) యొప్పునట్లే, యిదియు మృదువులై సుబోధములగు పదములతో నొప్పు చున్నది. కన్య సాధువృత్త - అనఁగా సద్వర్తన, ఇదియు సలక్షణములైన వృత్తములు గలిగియున్నది. కన్య 'సువర్ణ', అనగాఁ జక్కని రూపముగలది. కవితయు మంచి వర్ణములు • అక్షరములు గలది. శరీరలక్షణవేత్తలు కన్యను మెచ్చుకొందురు. కావ్యలక్షణజ్ఞులు కవితను బ్రశంసింతురు. కన్య సరసురాలు. గుణవంతురాలు నయి యుండును. కవిత శృంగారాది రసములతోను. మాధుర్యాదిగుణములతోను గూడి యుండును. కన్య వరణీయగా నితరులచే నెన్నఁబడును. కవితయు నితరులచే మన్నింపఁబడును. సర్వలక్షణసంపద కన్యకును, గవితకును సామాన్యము, కన్య వినయవతి, కవితయుఁ గవి వినయమును దెలుపఁగలదు. కన్యకు సౌశీల్య మాభరణము. కవితయందు నుపమాద్యలంకారము లుండును. కన్య భాగ్యరేఖ గలిగి యుండును. కవితయం దర్థముల పరంపర యుండును. కన్యకును. గవితకును నర్థపుష్టి సాధారణము. ఇట్టి నా కవితాకన్యను నీవు స్వీకరింపుము.

తే: సర్వభూషణయుక్తయు, సరళపదయు.
సాధువృత్త, సువర్ణ, సత్ స్తవనపాత్ర.
లక్షణాఢ్య, సవినయ, సల్లక్షిత మును,
నంచితకలాప, ద్యోతమానార్థరేఖ,
సరసగుణయుత, కల్యాణి సాంబదేవ !
స్వీకరింపుము మత్కవితాకుమారి.

99

అవతారిక : హరిబ్రహ్మలకుఁ గూడ నగోచరుఁడవైన నీవు నా కెట్లు ప్రసన్నుఁడ వగుదువని యడుగుచుఁ బ్రార్థించుచున్నారు.

శ్లో. ఇదం తే యుక్తం వా పరమశివ కారుణ్యజలధే
గతౌ తిర్యగ్రూపం తవ పద శిరోదర్శన ధియా,
హరిబ్రహ్మాణౌ తౌ దివి భువి చరన్తౌ శ్రమయుతౌ
కథం శమ్భో స్వామిన్ కథయ మమ వేద్యోఽసి పురతః.

టీక: పరమశివ = పరమేశ్వరా!, కారుణ్యజలధే = కరుణాసముద్రుఁడా!, తవ = నీయొక్క, పద శిరో దర్శన ధియా = పాదములను. శిరస్సును గనుఁగొనవలయునను బుద్ధితో, తిర్యగ్రూపం = తిర్యక్కుల (వరాహము, హంస) రూపమును, గతౌ = పొందిన, తౌ = ఆ, హరిబ్రహ్మాణౌ = విష్ణు బ్రహ్మలు, దివి = ఆకాశమునను, భువి = భూలోకమునను, చరన్తౌ = సంచరించుచున్న వారయి, శ్రమయుతౌ = శ్రమముతోఁ గూడినవారు. (స్యాతాం=ఐరి), శమ్భో = శంకరా!, స్వామిన్ = ఈశ్వరా!. మమ = నా యొక్క, పురతః = ముందర, వేద్యః = కనుఁగొనఁదగినవాఁడవు, కథం = ఎట్లు, అసి = అగుదువు? కథయ = చెప్పుము. ఇదం = ఇది, తే = నీకు, యుక్తం వా = తగునా?

తాత్పర్యము: పరమేశ్వరా! దయాసముద్రా!, మీ పాదములను జూడఁగోరి వరాహరూపమును దాల్చి విష్ణువును, శిరము దర్శింపఁగోరి హంసరూపమును ధరించి బ్రహ్మయు భూమ్యాకాశములఁ దిరిగి మిక్కిలి శ్రమపడిరేకాని కృతకృత్యులు కాలేకపోయిరి. శంకరా! స్వామీ!, అట్టివో నీవు నా యెదుటనెట్లు తోఁచెదవో చెప్పుము, భక్తపరాధీనుఁడైన శివుఁడు హరిబ్రహ్మల కలవిగాని తన దర్శనభాగ్యమును దనకుఁ గలిగించునని భావము.

చ. పరమశివా! దయాజలధి! భావ్యమొకో యిది నీకుఁ? దొల్లి యా
హరి విధి తిర్యగాకృతుల నంది భవత్పదసారసమ్ములన్,
శిరముఁ గనుంగొనంగ భువినిన్ దివిఁ ద్రిమ్మరి యెంతయున్ శ్రమిం
చిరి గద! స్వామి! శంకర! వచింపవె నాకిఁక నెట్లు తోఁచెదో!

100

అవతారిక: శివపరబ్రహ్మమునందు సకలదేవతా స్తోత్రార్హతయుఁ దదధికమాహాత్మ్యమును బ్రతిపాదించుచున్నారు.

శ్లో. స్తోత్రేణాలమహం ప్రవచ్మి న మృషా దేవా విరిఞ్చాదయ
స్స్తుత్యానాం గణనాప్రసఙ్గసమయే త్వామగ్రగణ్యం విదుః,
మాహాత్మ్యాగ్రవిచారణప్రకరణే ధానాతుషస్తోమవ
ద్ధూతాస్త్వాం విదురుత్తమోత్తమఫలం శమ్భో భవత్సేవకాః.

టీక: శమ్భో = శంకరా ! భవత్సేవకాః = నీ భక్తులయిన, విరిఞ్చాదయః = బ్రహ్మాదులగు, దేవాః = దేవతలు, స్తుత్యానాం = స్తవనీయులగువారియొక్క, గణనాప్రసఙ్గసమయే = గణించు విషయమునందు, త్వాం = నిన్ను, అగ్రగణ్యం = మొదట గణింపఁదగినవానినిగా, విదుః = తెలిసికొనుచున్నారు, మా.........ణే - మాహాత్మ్య=సృష్టి స్థితి లయ సామర్థ్యమును గూర్చిన, అగ్రవిచారణ = మొదటి చర్చయొక్క, ప్రకరణే = సందర్భమునందు, ధానా తుషస్తోమవత్ = నిస్సారమైన ధాన్యపుఁబొట్టంతయు వలె, ధూతాః = ఎగురఁగొట్టఁబడినవారయి, త్వాం = నిన్ను, ఉత్తమోత్తమఫలం = మిక్కిలి సారవంతమైన ధాన్యమునుగా, విదుః = తెలిసికొనుచున్నారు, స్తోత్రేణ + అలం = స్తోత్రమునకుఁ జాలను, అహం = నేను, మృషా = అసత్యము, న ప్రవచ్మి = చెప్పను,

తాత్పర్యము: శంకరా ! స్తోత్రార్హులైన బ్రహ్మాదిదేవతలను లెక్కించునప్పుడు నిన్నగ్రగణ్యునిగాఁ బరిగణించుచున్నారు, సృష్టి స్థితి లయ సామర్థ్య రూపమైన మాహాత్మ్యమును గూర్చి చర్చించునప్పుడు ధాన్యము నెగురఁబోయునపుడు పొట్టంతయు నెగిరిపోవునట్లు, తాము దూరముగా నెగిరిపోయి సారవంతమైన ధాన్యమును వలె నిన్నుత్తమోత్తమునిగాఁ బరిగణించుచున్నారు. దేవా ! వట్టి స్తోత్రపాఠము వలనఁ బ్రయోజన మేమి ? నే నసత్య మాడను.

మ. స్తుతికిం జాల. నసత్యమున్ నుడువ, భక్తుల్ బ్రహ్మముఖ్యామరుల్
స్తుతియోగ్యావలి లెక్కపెట్టుతఱి నాద్యుంగా నినున్ గాంత్రు, స
న్నుతమాహాత్మ్యవిచారణావసరమందున్ వారు ధానాతుష
ప్రతతిం బోలె విధూతులై చని నినున్ భావింతు రుత్కృష్టుఁగా.

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీమచ్ఛఙ్కరాచార్య కృతా
శివానన్దలహరీ సమాప్తా.



## గ్రంథకర్తృ విషయము

గ్రంథకర్త :
డాక్టర్ జొన్నలగడ్డ మృత్యుంజయరావు,
ఎం.ఏ., పిహెచ్.డి.

జననము : క్షయనామ సంవత్సర (అధిక) చైత్రి శుద్ధ జయవారము (16-3-1926) పెండ్యాల (ప. గో.)

తల్లిదండ్రులు : సీతారామచంద్రమ్మ, బాషిరాజు.

ప్రాథమికవిద్య : కోలమూరు, రాజమహేంద్రవరము తా॥(1931-35)

ఉన్నతవిద్య : శ్రీ వీరేశలింగాస్తికోన్నత పాఠశాల, రాజమహేంద్రవరము (1935-43)

కళాశాలావిద్య : స్వయంకృషి (1950-53)

విశ్వవిద్యాలయవిద్య : ఎం. ఏ. ఆంధ్రవిశ్వకళాపరిషత్తు-ప్రథమశ్రేణి, ప్రథమస్థానము (1953-55)
పిహెచ్.డి. (1974) ఆంధ్రవిశ్వకళాపరిషత్తు. సర్ రఘుపతి వేంకటరత్నం స్వర్ణపదక పురస్కృతి.

ఉద్యోగములు : శ్రీ వీరేశలింగాస్తికోన్నత పాఠశాల, రాజమహేంద్రవరము 1946-50
ప్రభుత్వాదర్శోన్నతపాఠశాల, రాజమహేంద్రవరము 1950-55
రాష్ట్రమునందలి వివిధ ప్రభుత్వకళాశాలలలో ఆంధ్రోపన్యాసకత్వము, ఆంధ్రభాషాశాఖాధ్యక్ష్యము (1955-84)
కోరుకొండ (తూ. గో.) లోని శ్రీమతి దాసరి అరవాలమ్మ డిగ్రీకళాశాల అధ్యక్షత (1994- )

ఇతర రచనలు :

1. కుమారసంభవము (కాళిదాసుకృతికి ఆంధ్రీకృతి)
2. వ్యాసభారతము-నన్నయ పరిష్కారము (సిద్ధాంత గ్రంథము)
3. శ్రీ శివమహిమ్నఃస్తోత్రము (పుష్పదంతుని కృతికి ఆంధ్రీకృతి)
4. వ్యాఖ్యానములు : నన్నెచోడుని కుమారసంభవము, శ్రీనాథుని శివరాత్రిమాహాత్మ్యము, తిక్కన సాహిత్యోద్యోగ పర్వములు.